


## స్త్రీలవిశ్వవిద్యాలయము, పూనా

భారతదేశమున ప్రజాసంస్థలు అనిగర్వముతో చెప్పుకొనదగిన విశ్వవిద్యాలయములలో కాశీహిందూవిశ్వవిద్యాలయమును, అలిఘురు మహమ్మదీయవిశ్వవిద్యాలయమును, పూనా మహిళావిశ్వవిద్యాలయమును ప్రథమగణ్యములు. భారతదేశమునగల స్త్రీలకళాశాలలసంఖ్య, వానియందలి విద్యార్థినులసంఖ్యాబలమును పరిశీలింపుడు:

| రాష్ట్రము | స్త్రీలకళాశాలలు | | విద్యార్థినులు | |
|---|---|---|---|---|
| | 1922 లో | 1927 లో | 1922 లో | 1927 లో |
| మదరాసు | 4 | 5 | 384 | 490 |
| బొంబాయి | లేవు | లేవు | 258 | 382 |
| స్త్రీలవిశ్వవిద్యాలయము | 2 | 2 | 22 | 32 |
| బెంగాల్ | 4 | 4 | 204 | 321 |
| సంయుక్తపరగణాలు | 4 | 5 | 73 | 133 |
| పంజాబ్ | 1 | 2 | 36 | 77 |
| బర్మా | లేవు | లేవు | 56 | 138 |
| బిహారు, ఒరిస్సా | 1 | 1 | 12 | 7 |
| సెంట్రల్ప్రోవిన్సెస్ | లేవు | లేవు | 2 | 17 |
| అస్సాము | లేవు | లేవు | 15 | 4 |
| మొత్తం | 16 | 19 | 1062 | 1601 |

ఈ 19 కళాశాలలలో 5 గవర్నమెంటువారు నిర్వహించుచున్నవి. 12 క్రిస్టియను మిషనరీలు నడుపుచున్నవి. 2 ఇతరులు నడుపుచున్నవి. ఈకళాశాలలయందు విద్యనార్జించు

స్త్రీలలో విశేషము పార్శీజాతివారును, క్రిస్టియనులును. ఒకఉదాహరణము చూపెదము. 1927-వ సంవత్సరమున మద్రాసురాజధానియందలి అయిదు స్త్రీలకళాశాలలలోను 222 క్రిస్టియనులును, 137 హిందువులును, 2 మహమ్మదీయులు నుండిరి. సంయుక్తపరగణాల యందలి అయిదు స్త్రీలకళాశాలలలోను 50 మంది క్రిస్టియనులు, 48 హిందూజాతివారు, 10 ముహమ్మదీయులు. బొంబాయిరాష్ట్రమున కళాశాలవిద్యనార్జించుచుండిన 382 స్త్రీలలో 241 క్రిస్టియనులు, 168 హిందువులు, 99 పార్శీజాతివారు.*

బొంబాయిరాష్ట్రమున ప్రభుత్వమువారునడుపు స్త్రీకళాశాలలు లేకుండుటచేత ఆరాష్ట్రమునందును, హిందూదేశమున ఇతరరాష్ట్రములందు దేనియందును ప్రజాసంస్థయగు ఇట్టి మహిళావిశ్వవిద్యాలయము లేకుండుటచేత ఈదేశమునందును పూనా మహిళావిశ్వవిద్యాలయమునకు మంచి ప్రతిష్ఠగలిగినది. ఇది ఇట్లు కీర్తింపబడినది. †"పూనామహిళా విశ్వవిద్యాలయము కార్వేపండితునిచే స్థాపింపబడినది. ఈ విశ్వవిద్యాలయమునకు అనుబంధముగ పూనా, బరోడా, అహమ్మదాబాదునగరములందు మూడుకళాశాలలుగలవు. ఈమూడుకళాశాలలయందును నలుబదివిద్యార్థినులుగలరు. బొంబాయిరాష్ట్రమున ప్రత్యేకకళాశాలలమూలకముగ ప్రబోధము స్త్రీలయందుపుట్టించుసంస్థ ఈవిశ్వవిద్యాలయ మొక్కటియే. ఈవిశ్వవిద్యాలయపుపరీక్షలను బొంబాయి యూనివర్సిటీవారు రికగ్నయిజుచేయని కారణమున సంఖ్యాబలమున పెంపొందుటలేదు. ఈవిశ్వవిద్యాలయనిర్వాహణమంతయు ఉదారులగు ధనవంతులు, ఉచితజ్ఞులగుఇతరులు ఇచ్చువిరాళములపై నాధారపడియున్నది. సర్ విఠలదాసుగారి భూరివిరాళముకూడ ఈవిద్యాలయమును ఆర్థికముగ సుస్థితికిగొనిరాలేదు. అయినను కార్వేపండితుని దీక్షాపరత్వమున విద్యాలయము దివ్యముగసాగుచున్నది. ప్రజలీవిశ్వవిద్యాలయమునందు విశ్వాసమునుంచుటకు ప్రారంభించిరి. ప్రభుత్వమువారు దీనిని ప్రశంసింప మొదలిడిరి. వారి విద్యానివేదికలు ప్రతివత్సరమును ఈవిశ్వవిద్యాలయ ప్రశంసలతో పిక్కటిల్లియుండుచున్నవి. ఇక ఈవిశ్వవిద్యాలయపుపరీక్షలపై వారియంగీకార ముద్ర పడవలసియున్నది. పడుచో ఈవిశ్వవిద్యాలయము మంచిఅభివృద్ధిలోనికి రాగలదు. ఈవిద్యాలయయాజమాన్యమున జరుగు జి. ఏ. (Science) పరీక్షను హిందూదేశమునందలి విశ్వవిద్యాలయములెల్ల అంగీకరించియున్నవి. పూనా మహిళావిశ్వవిద్యాలయమున జి. ఏ. పరీక్షలోజయముగాంచు ప్రతిస్త్రీయు ఇందువలన ఇతరవిశ్వవిద్యాలయములలో వైద్య పరీక్షకుచదువుకొన వీలుగలిగినది. పదునారుసంవత్సరములకుపూర్వము ఈవిశ్వవిద్యాలయమును స్థాపనముచేయ కార్వేపండితుడు దొరకొనినపుడు ఈసడించినవారిపుడు దీనియభివృద్ధిని, వినియోగమునుచూచి తలవంకించుచున్నారు."

* Progress of Education By Mr. M. R. Paranjpe.

† The Harto Committee's Report Page 162.

కొద్దివ్యయముతో విశేషఫలముసందవలయునని ఈవిశ్వవిద్యాలయనిర్మాతలఅభిప్రాయము. అది పూర్తిగ నెఱవేరుచున్నదనియే చెప్పవచ్చును. ఈవిశ్వవిద్యాలయమునకు సాలుసరిఖర్చు డెబ్బదివేలుమాత్రమే. ఇచ్చటివిద్యార్థినులకు విద్యకొఱకైన సగటు సాలుసరిఖర్చు నలుబదిరెండు రూపాయిలుమాత్రమే. గవర్నమెంటువిద్యాలయములందలి విద్యార్థినులకు విద్యకొఱకగు సగటుసాలుసరిఖర్చుకంటె ఈఖర్చు నూటికి నలుబదివంతున తగ్గియున్నదని తెలిసికొనుటకు సంతోషమగుచున్నది. మిక్కిలి పేదదేశమగు భారతదేశమున ఇట్టి మితవ్యయవిధానమువలననే విద్యాప్రచారము విస్తారదూరముసాగగలదు. ప్రభుత్వవిద్యాలయములందుగలుగుచున్న దుబారా విరివియైనవిద్యాప్రచారమునకు ఎట్లు అడ్డంకిగానున్నదో ఈవిశ్వవిద్యాలయచరిత్ర నిదర్శనపూర్వకముగ చెప్పుచున్నది.

ఈవిద్యాలయము ఖండాంతరకీర్తిని గాంచినది. "ఎట్టి మూలధనములేకనే దీనిని స్థాపించిరి. అచిరకాలముననే అది దేశీయులఆదరణకు పాత్రమై విరివిగ విరాళములసందినది. ఎట్టిప్రభుత్వపుసాయముగానిలేకనే నడుపబడుచున్నది. దీనియాజమాన్యమున 3 కళాశాలలు, 5 మాధ్యమిక పాఠశాలలు, 10 ఉన్నత పాఠశాలలు ప్రస్తుతముగలవు. ఇచ్చటి విద్యావిధానము గవర్నమెంటు పాఠశాలలవారిచే కూడ ఆమోదింపబడి అవలంబింపబడుచున్నదనుచో దీని ప్రాశస్త్యమును మదింపుచేయవచ్చును. అన్నితరగతుల, అన్నిజాతుల, అన్నిమతముల స్త్రీలు ఇచ్చట విద్యాసముపార్జనము చేయుచుందురు. ఇచ్చట విద్యబడసినవారిలో పలువురు ప్రాయికముగా ఉపాధ్యాయినీవృత్తి నవలంబించి దేశసేవచేయుచున్నారు. ప్రభుత్వమువారుగాని, స్థానికసంస్థలుగాని విద్యాలయస్థాపనమునకు పూనుకొనని పెక్కుతావులయందు ఈ స్త్రీవిద్యాలయపుగ్రాడ్యుయేట్లు తాము సకలబాధ్యతలువహించి ప్రత్యేకముగ ఉన్నతపాఠశాలలను, మాధ్యమికపాఠశాలలను నిర్వహించుచున్నారు."* ఈవిశ్వవిద్యాలయమునకు ఖండాంతరవాసులిచ్చిన ఈప్రశంసాపత్రమును చదివిన ప్రతిభారతీయుడును పులకితుడై తీరును.

అయితే ఈపులకింపులోగూడ ఈవిశాలభారతభూమియందు స్త్రీలకొఱకైన ఇట్టి ప్రత్యేకవిశ్వవిద్యాలయము లింకను ఎన్నియో కావలసియున్నవని ఆతడు పలుకును. ఆంధ్రభూమికి ప్రత్యేకస్త్రీకళాశాలయేలేదు, విశ్వవిద్యాలయముమాట యెత్తుట కవకాశమెక్కడ? గుంటూరులో జరిగిన మహిళాసభ ఈవిషయమున ప్రభుత్వమువారిని అడుగుకొనపోయినది. నోరు వెలితియైనది కాని రొట్టయైనపడలేదు. ఇక ప్రభుత్వమువారిని యాచించిలాభములేదు. ప్రజలే పూనవలయును. కాకినాడ, రాజమండ్రి, ఏలూరు, గుంటూరు, నెల్లూరు మొదలగు తావులందుగల స్త్రీవిద్యాసంస్థల పరిపాలకులెల్ల ఒకచో సమావేశమై ఈవిషయమై ఆలోచించి కార్వేగారిపద్ధతిని తెలుగుమాగాణియందును ఒకస్త్రీవిశ్వవిద్యాలయము స్థాపింపనగును. ఆంధ్రనాయకులీసదుద్యమమునకు సమకొందురుగాక!

* Proceedings of the Third Biennial Conference of the World Federation of Education Associations, Geneva.

# సంవత్సరాదిపండుగ అంటే

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

నిజంగా పండుగంటే అదేమిటో క్రొత్తశోభవస్తుంది. అలుకుముగ్గులతో, పసుపు కుంకాలతో, పచ్చనితోరణాలతో కలకలలాడుతుంటవి గృహాలు. నవనవాభరణాలతో, నవీనవస్త్రాలతో కలకలలాడుతుంటారు జనులు. ఎటువంటి క్లేశచిత్తునికైనా ఉపశాంతి కలిగిస్తుంది పండగ. ఎటువంటి కటికిదరిద్రుడికైనా కడుపునిండిస్తుంది పండుగ. ఎటువంటి లుబ్ధుని చేతనైనా పైసా దానంచేయిస్తుంది పండగ. ఎటువంటి నిరంకుశాధికారికైనా కనికరం పుట్టిస్తుంది పండగ. పండగవచ్చిందంటే బజారువస్తువులు తేవడానికి పెచీపెట్టరుమగవాళ్లు. పనిఅంటే విసుక్కోరు ఆడవాళ్లు. తలంటుఅంటేయేడవరు పసివాళ్లు. ఈవిధంగా అందరిలోను సహనాన్ని నెలకొల్పి ఉత్సాహంఉదయింపజేసి ఒక విధమైన సంతోషసాగరంలోముంచి తేలుస్తుంది ప్రజలను పండుగ. ఎవరైనా పోట్లాడుతుంటే పండగపూటా జగడాలాడకండి అంటారు. ఎవరైనా తిట్టుతుంటే పండగపూటాతిట్టకండి అంటారు. ఎవరైనా దుఃఖపడుతుంటే పండగపూటా దుఃఖపడకండిఅంటారు. ఎవరైనా బిచ్చానికొస్తే పండగపూటా లేదనకండంటారు. అంటే పండుగనాడు ఒకరిమనస్సు నొప్పించడం, తనమనస్సు నొవ్వజేసుకోటం తన్మూలంగా సంతోషంభంగం చేసుకోడంకూడదు. అందఱుఆనందంగాఉంటేనే పండగ.

ఈవిధంగా నెండలో యెడారినిపడి నడిచేవాడికి చల్లనిచలువపందిరివలె నానావిధ తాపత్రయాలతో కొట్టుకొనేదేహికి అన్నీ మఱపించి ఒకఅనిర్వచనీయానందంగూర్చేదివ్యఫలం పండుగ. అయితే ఇటువంటి సుదినాన్నిగూడ దుర్దినంచేసుకొని ఆనాడే యేమేమోకల్పితచింతలు కలుగజేసికొని క్రాగిపొయ్యే లఘుచేతసులుగూడా కొందఱులేకపోలేదు. కాని వారి మాట అప్రస్తుతం. మొత్తంమీద పండుగఅంటే బీదలూభాగ్యవంతులూ అనేతారతమ్యం లేకుండా యెల్లరూ తమకు దైవమిచ్చినంతలో మేలైనభోజనంచేసి, మేలైనవస్త్రాలు ధరించి తమనిత్యక్లేశాలు మఱచి తృప్తిగా సంతోషంగా గడిపేరోజూఅనిచెప్పాలి. అటువంటి దివ్యమైన పండుగలలో తొలిపండుగ యీ సంవత్సరాదిపండుగ. ప్రతిపండుగకూ యిండ్లకూ ఇండ్లలోని మనుష్యులకూ మాత్రమే శోభవస్తుంది. ఈసంవత్సరాది పండుగకు ప్రకృతికంతకూ శోభవస్తుంది.

చూడండి నిన్నమొన్నటివఱకూ మనకు చల్లనినీళ్లన్నా, చల్లనిగాలిఅన్నా, చల్లని చంద్రకిరణాలన్నా అసహ్యం. ఆమూడూ మనకిప్పుడు హితకరములై, ప్రీతికరములై, ఆనందకరములుగూడా అయిపోయినాయి. పదినెలలనుండి మూగనోముపట్టిన గండుగోయిల కోమలకంఠమెత్తి తన అవ్యక్తమృదుమధురమనోజ్ఞగానంతో రసికలోకాన్ని తన్మయులను జేస్తున్నది. పిల్లలైనా ప్రతిరవంజేస్తే ఆకలకంఠం ఊరుకోదు. కువు, కువు, కువు అని ఊపిరాడ

కుండాకూసి యెదుటివారు నోరెత్తకుండాచేసి తనసంగీతసాహిత్యంలో తనకుగల సామ్రాజ్యత్వం నిలుపుకొంటుంది. ఆవృక్షలోకానికీ, పరభృతములకూగల సంబంధబాంధవ్యమెట్టిదో ఆస్పష్టికర్తకే వేద్యము. ఆచివురుజొంపములయింపు సొంపుల కుబ్బి తబ్బిబ్బై కోయిల పాట పాడ నేర్చినదో, ఆకోయిలా కోమలగానరవంఆలించి తరువులు పల్లవింపనేర్చినవో ఏమో యేదిముందో తెలియదు. నవరసాలపల్లవఖాదియై చొక్కనగాని కోయిలకంఠ మెత్తదు. కోయిలగానరవం ఆలించినగాని తరులతాదులు క్రొంజివురులదొడగవు. వృక్షవిహగాదులకు యేమిటీపొత్తు? అంటే వీటికన్నిటికీ ప్రభువు ఋతురాజు వసంతుడు. ఏడాదికొక్కమాఱు వచ్చి రెండునెలలు ప్రభుత్వంచేస్తాడు. ఈతడు రసపాయి. సౌందర్యోపాసకుడు. ఈతడుపరిపాలించిన రెండునెలలు కళారాధకులకు పండుగదినాలు. కాబట్టే కళాప్రియులైన కవులూ గాయకులూ చిత్రకారులూ ఈతని ఆగమనాన్ని నిరీక్షిస్తుంటారు. పక్షులచే పాడించి, వృక్షములచే ఊగించి, గంధవహునిచే వింజామరలువేయించి, సుధాకరునిచే మధురపీయూషమిప్పించి సర్వవిధముల కళారాధకుల ఆకలిదప్పులతీర్పిస్తాడీతడు. తనఆశ్రితుల నింతగా తృప్తిపఱచినవారు వేరొకరులే రీఋతునాయకులలో. కాబట్టే యితనికి ఋతురాజనేపేరు సార్థకమైయినది.

ఉత్తరహిందూదేశస్థులు వసంతనవరాత్రములనుపేర యితనిస్వాగతోత్సవము మహావైభవంగా జరుపుతారు. మనదేశంలో యిదిలేకపోయినా సంవత్సరాది అగుటచేత వసంతనవరాత్రముల ప్రథమదినమునూ, శ్రీరామనవమిఅగుటచేత తుదిదినమునూ పండుగజరుపుతునే ఉన్నాము. ఆఋతురాజుకు ఆహ్వానమిస్తూనే ఉన్నాము. కాబట్టి నేటిమనసంవత్సరాది సంవత్సరానికి ఆరంభోత్సవమేగాకుండా వసంతుని స్వాగతోత్సవంగూడా అయిఉన్నది. అయినా మనకు ముఖ్యమైనది సంవత్సరారంభమే అగుటవల్ల సంవత్సరాది అంటేయేమిటో యికఆలోచిద్దాము. గృహాలంకరణం, అభ్యంగనం, నింబకుసుమభక్షణం, ఇష్టమృష్టాన్న భోజనం, నూత్నవస్త్రధారణం, పంచాంగశ్రవణం ఇవినేటికర్తవ్యాలు. సరే గృహశుద్ధి, భాండశుద్ధి, దేహశుద్ధిచేసుకొని కడుపుశుద్ధి చెడేటట్లుతిని వేధించో సాధించో ప్రార్థించో మగవారివల్ల క్రొత్తవస్త్రాలు తెప్పించికట్టుకొని పండుగను వెళ్లద్రోయడం ప్రతిపండుగకూ మామూలే. వానిలో క్రొత్త లేమీలేవు. అయితే వేపప్రసాదంపుచ్చుకోడం, క్రొత్తపంచాంగాలు చదవడంమాత్రం ఈపండుగకేగాని మఱెప్పుడూలేదు. ఇవి ఉగాదిపండుగకు ప్రత్యేకంగా ఏర్పడ్డ విశేషాలు. సంవత్సరాదిపండుగ శ్రీరామనవమి, గోకులాష్టమివంటి అవతార పురుషుల జన్మదినోత్సవంగాదు. విజయదశమి, దీపావళివంటి శూరవీరస్త్రీపురుషులసామర్థ్యం తలచి పులకించే స్మారకోత్సవంగాదు. వరలక్ష్మివ్రతం, అనంతపద్మనాభవ్రతంవంటి బహుఫలాపేక్షతోగూడిన వ్రతోత్సవంగాదు. ఏకాదశి, శివరాత్రివంటి దేహశుద్ధి, మనోశుద్ధి కలిగించే ఉపవాసోత్సవంగాదు. కేవలం కాలమునకు సంబంధించినది సంవత్సరాదిపండుగ. రోజూ

ప్రొద్దు కూకుతుంటుంది, తెల్లవారుతుంటుంది. నిన్నటిపగటివంటిదే నేటిపగలు. కడచిన రాత్రివంటిదే వచ్చేరాత్రి. ఒకేచిత్రమునకు ఒకప్రక్క తెలుపు ఒకప్రక్క నలుపుగల చిత్రము లనుచిత్రించి తిరుగబోర్లావేసి పగలు, రాత్రి చూపుతున్నాడు మహాచిత్రకారుడైన సృష్టి కర్త. ఈఅహర్నిశలకు అంతులేదు. మార్పులేదు. కాని వీనితో సయ్యాటలాడే ప్రాణిచయ మునకుమాత్రం అంతున్నది. మార్పున్నది. మనంచూస్తున్నప్రతిజీవీ వీనితో కొన్నాళ్లు ఆడి నిష్క్రమించుచున్నది. చూస్తుండగానే పసివాళ్ళు పడుచువాళ్ళవటం పడుచువాళ్ళంతలో ముసలివాళ్లవటం, జిగిబిగిగలశరీరం సడలిపోవడం, నల్లనివెంట్రుకలు తెల్లబడిపోవడం, క్రమంగా జీవచ్యుతి గూడా సమీపించడం సంభవిస్తున్నది. ఈవిధంగా రాత్రింబవళ్లవల్ల జీవులలో ఇట్టి పరిణామం కలుగుతున్నదంటే అర్థమేమిటి? ఈరాత్రింబవళ్లే జీవులఆయువును భక్షణజేస్తున్న వన్నమాట.

కాబట్టే ఈఅహర్నిశలుయిట్లాసాగితే మనకేమని ఊరుకోడానికి వీలులేదు. అహ ర్నిశలతోగూడిన యీకాలం చాలానిరంకుశమైనది. ఈరోజున నేను యేమీపనిచేయ లేదు మొద్దులాకూర్చున్నాను, కాబట్టి నాలెక్కలో వ్రాసుకోబోకు అంటేకాలంపలకదు, జబాబు చెప్పదు, కానిజమకట్టుకోకుండా వూరుకోదు. కాబట్టి కాలానికిమనము బద్ధులము కావాలె గాని కాలంమనకు బద్ధంగాదు. కనుక కాలంయొక్క అధికారం గుర్తించి యెప్పుడు ఒకేవిధంగాఉంటే యీఅపరిమితకాలవాహినికి పరిమితాయువులమగు మనము మనజీవితంలో మనస్వధర్మం మనము గమనించి అనుష్ఠించాలెఅంటే ఒకహద్దుపద్దుఏర్పఱచుకోవలెను. లేకపోతే మనజీవితవ్యవహారంసాగడం చాలాకష్టం. కాన ఇటువంటివ్యవహారసౌకర్యార్థం సృష్టించబడ్డదే పంచాంగం. నాల్గుదినాలు పంచాంగంలోని తిథివారాలో, క్యాలెండరులోని తారీఖులోచూచుకోకపోతే యెన్నిఅహర్నిశలు వెళ్లిపోయినాయో గుర్తించలేము. ఒకగుర్తు అనేది, లేకపోతే, ఒకేమాదిరిగా కవలపిల్లల్లాగాఉన్న ఈరేబవళ్లను గమనించడంకష్టం. మఱేన్నీ ఒకరికి మనంకొంతసొమ్ము అప్పుయిస్తాము. ఒకపనిమీద కొన్నాళ్ల కొకగ్రామం వెళ్ల వలెననుకొంటాము. ఒకవ్యాజ్యం వాయిదా కొన్నాళ్లలో ఉన్నదనుకుంటాము. ఒకశుభ కార్యము తలపెట్టుకుంటాము. ఇటువంటివాటి కన్నిటికీ ముందు జాగ్రత్తపడి అందఱికీతెలియ బఱచి అందఱినీ సమకూర్చుకొని చెయ్యాలంటే ఈకాలాని కొకకొలతఅనేది లేకపోతే యెట్లా? కాబట్టే ఒకపగలురాత్రికలిపితే ఒకదినమనీ, ఆ దినాలు యేడైతే ఒకవారమనీ, ఆ వారాలు నాలుగైతే ఒకనెలనీ, ఆనెల్లుపన్నెండైతే ఒకసంవత్సరమనీ, అటువంటి సంవత్స రాలు పన్నెండైతే పుష్కరమనీ, నూరైతే ఒకశతాబ్దమనీ యీవిధంగా కాలనికిగుర్తులు వేశారు మనపెద్దలు.

అంతేగాకుండా మనదికర్మభూమి. ఏకాదశినాడు ఉపవాసాలంటాము, అమావాస్య నాడు పితృతర్పణాలంటాము, తగిలుంటే తద్దినంఅంటాము, మిగిలుంటే వ్రతంఅంటాము,

ఇవీగాక నైమిత్తికంగావచ్చే గ్రహణాలు గ్రహపీడలు యెన్నోఉన్నాయి. వీనికన్నిటికీ జపతపాలుచేసుకోకపోతే ఉపశాంతిలేదంటాము. కాబట్టి తిథి, వార, నక్షత్ర, యోగ, కరణాదులనియెడి పంచఅంగములతో గూడినపంచాంగం మనపూర్వులైన ఖగోళశాస్త్ర పారంగతులగు మహర్షులచే నిర్మింపబడ్డది. మహామేధావులైన మనపెద్దలు మహోన్నితమైన యిట్టిమహాశాస్త్రమును నిర్మించి మనకు ప్రసాదించిపోగా దానిలో తిథిని చూచుకొనే తెలివి లేదు మనకిప్పుడు. ఎంతదురదృష్టమోచూడండి. పంచాంగం వచ్చేసంవత్సరముయొక్క భవిష్యత్తును ముందుపెట్టుతుంది. ఎండలతీరు, గాడ్పులవైఖరి, వర్షముల విధము, ధరలరీతి, గ్రహములగతులు ఇత్యాదు లెన్నో వివరిస్తుంది. గ్రహణా లెప్పుడువస్తాయో, తోకచుక్కలు యెప్పుడుపుట్టతాయో తెలుపుతుంది. ఈపంచాంగం అబద్ధమనడానికి వీలులేదు. ఎందుకంటే పంచాంగములో వ్రాసినసంగతులు ఖచితముగా నెరవేరుచుండడమేకారణం. ఈపంచాంగంలో రెండుమూడురకములున్నవి. మనది చాంద్రమానము అనగా చంద్రునినడకనుబట్టి నిర్ణయించినదన్నమాట. మనకు సమీపస్థులైన అరవవారిది సౌరమానము అనగా సూర్యునిగతిని బట్టి నిర్ణయింపబడిన పంచాంగమువారిది. ఉత్తరదేశమువారిది బార్హస్పత్యమానము. అనగా వారి పంచాంగం బృహస్పతిగ్రహగతినిబట్టి నిర్ణయించబడును. ఈవిధంగా మనదేశంలో పంచాంగభేదములున్నవి. ఏభేదములున్నా వత్సరారంభమునందు ఆయాదేశములవారాయా పంచాంగములు చదవడం ప్రతిదేశములోనూ ఉన్నఆచారమే.

ఇక రెండోది నింబకుసుమభక్షణం. నింబకుసుమమంటే వేపపువ్వు. తియ్యనిబెల్లం, పుల్లనిచింతపండు, చేదు వేపపువ్వు కలిపినదే వేపప్రసాదం. ఈవేపప్రసాదం భోజనాత్పూర్వం ప్రతివారూ సేవించవలసినవిధి. దీనిఅర్థమేమిటి? దుఃఖమే చేదు. కష్టమే పులుపు, సుఖమేతీపు. ఈమూడుగుణములు కలిపిపెనవేసిన ముప్పేటలత్రాడువంటిదే మనజీవయాత్ర. ఈసంవత్సరం గూడ నిన్నిమూడున్నూ యెదుర్కోగలవు. వీనిని సమభావంతో స్వీకరించడమనేదే యీవేప ప్రసాదంయొక్క తాత్పర్యం. నిజంగా ఈపులుపుతీపిచేదుల చవిచూడని మానవులుగాని మానవులచే నిర్వహింపబడుసంస్థలుగాని ఉండవు. కనుకనే మనమండలిగూడా ప్రపంచవైఖరి ననుసరించి యీపులుపు తీపి చేదులచవిచూస్తునేఉన్నది. అయినా భగవదాశీర్వాదమువల్లను, మీవంటిసోదరీమణుల సహాయసంపత్తివల్లను తనజీవితంలో నేడీప్రథమసంవత్సరాదిని జరుపగలిగింది. అందుకు శ్రీపరమేశ్వరునకును, మీకును నా భక్తిపూర్వకనమస్కృతులు.

సోదరీమణులారా! సంవత్సరాది అన్నిపండుగలవంటిదిగాదు. ఇది అటుకాలమునూ, ఇటు మన జీవితమునూ కొలిచేపండుగ. ఓజీవీ! నీజీవితంలో మఱోయేడు చెల్లగట్టవు నాలెక్కలో. నీజన్మంయొక్క ఉద్దేశమేమిటి? సార్థకతదేనిలోఉన్నది? నీజీవిత పరమార్థమేమిటో తెలుసుకున్నావా? అనిప్రశ్నించి హెచ్చరించి పోతున్నది సంవత్సరాదిపండగ. కాబట్టినేటి యీపండగయొక్క పరమార్థంగురించి వర్షాకాలపునదులవలె అతివేగంతో

గడచిపోవుచున్న మనజీవితప్రవంతులు వ్యర్థమై కాలసాగరంలో కలిసిపోకుండా విద్యఅనే ఆనకట్ట కట్టించి సత్యధర్మములనే తూములగుండా భక్తిజ్ఞానవైరాగ్యములనే పంటచేలలోకి ప్రవహింపజేసి జన్మసార్థకత అనేపంటనుపండించి ధన్యులుకండని కోరుతున్నాను.

ఇట్లాగే అనేకసంవత్సరాదులు మీసహకారసాభాగ్యంతో ఈ స్త్రీహితైషిణీ మండలిలో జరిపేలాగున మహాకాలస్వరూపియగు పరమేశ్వరుడు అనుగ్రహించుగాక అని దేవదేవునిప్రార్థిస్తూ నాఉపన్యాసముముగిస్తున్నాను. *

## ఆత్మోపదేశము

శ్రీమతి చేబోలు సరస్వతీదేవిగారు

జనితానందరిసాబ్ధిఁ దేలుచును సంసారంబులోఁజిక్కి యొ
క్కనిమేషంబయినన్ బరార్థమును నాకాంక్షించి వేదాంతవే
ద్యునిభావంబుననిల్పికొల్వకయె సాయుజ్యంబుచేకూరునే?
మనమా! యేటికిజీవితంబు? కనుమా మాయాపహారిన్ హరిన్.

జననీగర్భమునన్ వసించి పదిమాసంబుల్ మహాదుఃఖవే
దనలన్ జెంది జనించితంత మలమూత్రస్నిక్తదేహంబులో
దినముల్ ద్రోసితి యుక్తకాలమరిగెన్ దీనన్ ఫలంబున్నదే?
మనమా! యేటికిజీవితంబు? కనుమా మాయాపహారిన్ హరిన్.

వినుమా యౌవనమంకురింప నట నువ్విళ్లూరుచున్ లోకమున్
గనులన్ గానక మోహసాగరమునన్ కాయంబెటో నెట్టుచున్
మునుకల్ వెట్టితివేమి సార్థకము దుర్మోహంబు వీడంగదే?
మనమా! యేటికిజీవితంబు? కనుమా మాయాపహారిన్ హరిన్.

ఘనవార్ధక్యము పైఁబడంగ నట నీగాత్రంబుజీర్ణమ్మునై
కనులున్ వీనులునున్ బటుత్వమునువీకన్ బాసి తబ్బిబ్బులై
తనువున్ బాయఁగనున్న యప్పుడు నినున్ దర్శింపరారెవ్వరున్
మనమా! యేటికిజీవితంబు? కనుమా మాయాపహారిన్ హరిన్.

ధనకాంక్షన్ మొదలంట వీఁడుమిఁక సద్ధర్మానురక్తిన్ వెసన్
జనకాదుల్ మునుబోయినట్టి పదమాస్థన్ బట్టి పొమ్మింక లోఁ
గను మాయిచ్చఁజరింపఁగావలదు భోగంబంత నిత్యంబొకో?
మనమా! యేటికిజీవితంబు? కనుమా మాయాపహారిన్ హరిన్.

* బాపట్లలోని స్త్రీహితైషిణీమండలియందు సంవత్సరాదినాడుఒసగిన ఉపన్యాసము.

# అక్రమవిభాగము

పిన్నమరాజు రాజగోపాలముగారు బి.యె. సారస్వతసమాజము

౧

క్రొత్తగాచేయించుకొన్న తన ముద్దుల రాట్నానికి పక్కగా బుల్లిపీట వేసుకొని దాని మీదకూచొని నూలుతీస్తోంది శేష. ఎదురుగుండా ఒకచిన్న కౌనుబల్లవుంది. దానిమీద వున్న బిగ్బెన్‌గడియారము టిక్కుటిక్కుమంటోంది. గిఱ్ఱునతిరుగుతోవున్న రాటపు చక్రము భావిభారత భాగ్యాన్నికూర్చే కాబోలు ఒక్క ఆశామహితగీతం తనప్రవాహోతుషితరాగాన యేకాలాపనచేస్తోంది. ఇతరమైన సవ్వడియేదీలేదు.

ఆగది కిటికీలోనుంచి సమీరకుమారుడు తప్పటడుగులతో ప్రవేశించి కొంతసేపామె ఖద్దరుచీర చెఱగు కదలించాడు. వెనక్కైనా తిరిగిచూడకుండా ఆమెపనిలో లీనమైవున్నది. గుబురులుగుబుర్లుగా ముఖసీమను వ్రాలే నీలాలకాలు కదలించి తొంగిచూస్తే అక్కడ భావనాతరంగాలు మాత్రమే పోటుపాటు చేస్తున్నాయి.

కొంతసేపటికామె యోచనాపూరితసుందరవదనం పయికెత్తిచూచింది. అప్పటికప్పుడే గడియారపుముల్లు తొమ్మిదిమీదికిపోయింది. వెంటనేలేచి బల్లమీదవుంచిన గ్లాసులో వేలుపెట్టి చూచింది. అందులో కాఫీచల్లారిపోయివుంది. "ఎంచేతో యింకారాలేదు? పొద్దున్నఅనగా వెళ్లారు" అని తామరమొగ్గలాటి తనకెంపుఅరచేయి ముకుళించి చూపుడువేలుతో పాటమరించిన తనలేగులాబీబుగ్గ నదుముకుంటూ మళ్లీ ఆలోచనలోపడింది. ఇంతలో వీధిగుమ్మంలో మెవ్వరో రాక్షసిగొంతుకతో "పూర్ణచంద్రావుగారూ!" అని అరుస్తూన్న ధ్వని వచ్చింది. అదివిని "ఎవరువారూ?" అని శేష సింహద్వారం చెంతకివచ్చింది.

వీథిగుమ్మందగ్గర ఒకనల్లటి లావైనమనిషి నుంచున్నాడు. తలకట్టులేని 'గా'లావుంది వానిజుట్టు కత్తిరింపుమాదిరి. చేతిలో వలమైన ఒకపేముకఱ్ఱ వంకరిదివుంది. మంచి ముతకరకం ఖద్దరుచొక్కా బొంతలాంటిపంచీ కట్టుకున్నాడు. ఆయనతోపాటు ఇంకో ఆయన గుమాస్తో, నౌకరో కూడా నుంచున్నాడు. గద్దిరిగాడితో యుద్ధానికి సాయపడే గొడ్డుకోతిలావున్నాడా రెండోఆయన. శేషనిచూడగానే మొదటాయన "లేడుటమ్మా! యింట్లో లేదూ, మమ్మల్నిచంపేస్తున్నాడు, మాప్రాణాలు తోడేస్తున్నాడు, తిరగలేకచచ్చిపోతున్నానుఇల్లంతా దోచిచ్చానే. ముందుగుమ్మరించానే. ఏడువేలు. ఒకటా, రెండా. ఇస్తారా? ఏమిటిచ్చేదీ నామొహం, ఆయనమొహం. ఎప్పుడురావడం ఆయన" ఏకధాటీని ఖడ్గమృగానికి మల్లే మొదటిఆయన గోండ్రించాక ఆయనగుమస్తా సర్కసుకోతిలాగు ఆయననను కరించాడు.

అదంతావింది శేష. హృదయంజల్లుమంది. ఒకవిచారతరంగం పైడలుతరంగమై పొంగివచ్చింది. ముఖంజేవురించింది. ఉదారగుణవిద్యాసుందరుడైన తనభర్తననే మాటలు వినలేకపోయింది. "లేరు పొమ్మ"ని వాళ్లవెన్నుమీద తలుపు దడాలుమనిపించి యింట్లోకిపోయింది.

౨

రెండుగంటలు కావచ్చింది. పూర్ణచంద్రరావు మంచంమీద శయనించి, తలమాత్రం పైకెత్తి కూర్చున్నట్టుగానున్నాడు. ఎదురుగావున్న పేముసోఫామీదకూర్చుండి తమలపాకు లిస్తోంది శేష.

పూర్ణచంద్రరావుది లేతనలుపుశరీరం. చక్కని ఎగదువ్వడుక్రాపు. విశాలమైన నుదురూ, వక్షస్థలమూ; సన్నటినడుమూ మనిషిరూపసే అనిపిస్తాయి. పైపెదవి చిక్కని బిగీ, విశాలనేత్రాలలోని చాపల్యమూ, ఔదార్యాదిగుణసమూహాని కట్టకుగున అంతర్వాహినిగావచ్చే భావోద్రేకస్వభావాన్ని కూడా తెలియజేస్తాయి. అతనికివున్న సంపూర్ణవిద్యాసంస్కారం శరీరానికి మంచి నాజూకు తీసుకువచ్చి విద్యావంతులకుండే యేదోశోభ చూపిస్తుంది.

శేషకూడా చక్కనిదనే చెప్పాలి. ఎఱుపుడవులుకల చామనచాయ. నెమ్మేనిలో హృదయపావిత్ర్యం తెలియజేసే కాంత్యుజ్వలత వుంది. అది ఆమె సుందరవదనంలో చాలా బాగాకనిపిస్తుంది. విశాలనయనాలు సుశోభాప్రపూర్ణాలు కాని యీమధ్య పొందుచున్న మనోదుఃఖంవల్ల జడాలసములుగానున్నవి. కాని నిరాడంబరమైన ఆమె అలంకారము లోకవిధమగువన్నె చేకూరుస్తున్నాయి. మెడలో ఒకగొలుసు, చేతులకి రెండుమూడు జతలు గాజులు, స్వయంగావడికిననూలుతో తాను నేయించుకొన్న ఖద్దరుచీర, జాకెట్టు, ఆమె జీవితాన్నిగురించి సంపుటాలు చెప్పుతాయి.

మౌనముద్రనడలించుకొని పూర్ణచంద్రరావు "అయితే యిష్టమొచ్చినట్లల్లా పేలాడన్నమాట, పాపయ్య?" అన్నాడు. వేగముతో దానికి

శేష

ఏదోఏడిశాడు లెండి. మనము శాంతమే వహించాలి. ముం దీఋణసముద్రంలోనుంచి బయటపడేమార్గం చూడండి.

పూర్ణచంద్రరావు

ఓనే మరియేమిచేయమన్నావు? అవతల మహాత్ముడుచూస్తే పవిత్రమైన వుద్యమం లేవతీసినాడు. ఒకమూల ప్రపంచమంతా అరికట్టినది ఆర్థికసమస్య. ఈలాటప్పుడు సర్వత్రా వుదారపురుషులంతా మానవసేవలో లీనమైపోయి దరిద్రసోదరకోటిని వుద్ధరించడానికి సర్వస్వమూ ధారపోస్తూంటే యీవడ్డీజీవనపు ఘాతుకమృగాలు సోదరకోటిని ఋణగ్రస్థులిని తినెయ్యాలని చూస్తున్నారు. మానవజీవనం త్యాగవిరహితం అయిపోయింది. దురాశాపూరితమైన ఈనరకోటికంతా ఒకమహాప్రళయం, రక్తప్లావితంచేసే ఒకపెద్దవిప్లవం తప్పకుండా వస్తుంది. ఏమంటావు, శేషూ?

శేష

వచ్చితీరుతుంది. ఎన్నాళ్లు సాగుతుందీఅక్రమవిభాగం? సోదరమానవుణ్ణి సోదరమానవుడు తినాలనిచూచే యీ ఆర్థికసంబంధం, ఈపెట్టుబడిదారులదురంతికం. ఎవడు నిర్మించా డీవిశాలప్రపంచం? ఆనిఖిలేశుడు సృజించా డీవిశ్వమంతా. మానవులంతా సోదరులు. అందరికీ సమానమైన హక్కువుండీ

తీరాలి. కష్టించేవాడు, మేధాసంపన్నుడు, కళాకుశలుడు లేమిచేత అల్లాడుతుంటే వారసత్వమనే దుర్మార్గముచేత ఒకానొకతిండిపోతు, మనుష్యజంతువు, ధనాకర్షణయంత్రము బాగుపడడమా? తప్పదండీ! మీరన్నట్లుగా యీసంఘం ప్రస్తుతం అల్లుకుపోతూవున్న యీనిరంకుశసంఘం కుంగిపోయి తీరుతుంది.

పూర్ణచంద్రరావు

అదెల్లాగూరూఢే. కాని నాసంగతే పాలుపోటంలేదు. ఇదివరకు యకరం రెండువేలు చేసే భూమి యిప్పుడు వెయ్యిరూపాయలకు కూడా మూతిచూసేవాడులేడు. ఎక్కడెక్కడ ఋణదాతలూ అంతావకటి. వక్కడి హృదయాల్లో గాలించినా దయదాక్షిణ్యమూ అనేవి లేవు. ఎల్లాగో అల్లాగు భూమి పుచ్చుకోమంటే డబ్బేకావాలిట. ఒకవేళ రాయించుకుంటే అసలు కిమ్మతులో మూడవవంతుకి అడుగుతున్నారు. పెద్దసంసారులు ఎంత నిరాడంబరులైనా ఋణం చేసికోక తప్పిందికాదు. మానాన్నగార్ని మాత్రమేమి నిందించనూ. ఈఋణాలలో అనవసరమైనది కాని, భోగకోసము కాని ఒక్కటీలేదు.

శేష

పోనీండి. ఈతక్కువధరకే భూములు వాళ్ల మొహానతగలేస్తే మనకేమి మిగులుతుందో చూడండి.

పూర్ణచంద్రరావు

అల్లాతక్కువధరలుచూచినా వాళ్లు సవ్యంగా కట్టుకుంటే పదెకరాలూ యీయిల్లుమిగలవచ్చునుకుంటూ.

శేష

ఆఖరు కిల్లు మిగిలినాచాలులెండి. నాకే నగలూ, పట్టుచీరలూ అక్కరలేదు. ఈ రాటమేచాలు. మీరు పిల్లలపోషవర్గానికి తెస్తూంటే యింట్లో గౌరవంగా తలదాచుకోవచ్చు.

పూర్ణచంద్రరావు

అంతే అన్నావు. ఏభయియకరాల సంసారులము తిండికి దైన్యపడవలసి వస్తోందా?

అని ఏడుపారంభించాడు. కళ్లకొలకుల్లో నుంచి నీరు గట్టుతెగినట్టుగా కారుతోంది. ఎగుపులువస్తున్నాయి.

అంతలో శేష దగ్గరకువచ్చి అతన్ని తన మృదువైన చేతులతో అదిమిపట్టుకొని "మీరల్లా అధైర్యపడకూడదు. ఈభారతదేశంలో ఏడుకోట్ల ప్రజలున్నారు. ఒకపూటకైనా తిండిలేనివాళ్లు అందులో మనమొకళ్లమవుదాము. ఏమిటి శాశ్వతం? అన్నీ వదలుకొనిపోవాలి విశ్వపతిపిలుపువస్తే. ఈమాత్రాని కీవడ్డీవ్యాపారపు తోడేళ్లు మిడిసిపడుతున్నాయి."

సరిగ్గా ఆసమయంలోనే లేచి చంటిపిల్లాడు రోదనమారంభించాడు. "ఉండండి చూచి వస్తాను" అని వెళ్లింది.

పూర్ణచంద్రరావు

నాబతుక్కి పరమేశ్వరా! అప్పుడే యీ పిల్లల్ని కూడా యిచ్చేవెందుకు?

3

అది వట్టిదుర్దినం. చిటపటా చినుకుపసుతోనేవుంది. ఆకాశం మేఘావృతంగానేవుంది. వసారాగదిలోవున్న చింకిరిచాపమీద

చొక్కా లేకుండా పాపయ్య బొజ్జ నిమురుకుంటూ "యిదిగో సర్వయ్యా! మంచి వుపాయందొరికిందోయ్. ఏమిటంటావా, వినుమరి చెపుతాను. బొత్తిగా ఆంద్రదెబ్బసాగిందిలే ప్రజలికి. ఈమధ్యదోచేసారుగా ఒకడిదగ్గిర తెలియకుండా యింకొకడిదగ్గిర నోట్లమీద డబ్బు. ధరపడిపోయింది. వెధవలై పోయారు. చూసావు మనకి చౌకగా అవునన్న ధరకి భూములు రాయించుకోడానికిదే మంచిసమయం. ఇప్పుడు మనబాకీకింద లింగయ్య, మంగయ్య, సంగయ్య, బాకీలకిందా పూర్ణచంద్రావు ఆస్తీయిల్లుకూడా రాయించుకున్నామా? ఇంకా అయిదువందలకో నోటుందికాదుటోయి. మధ్య వెధవలంతా అవిమానుకోమన్నారు.

సర్వయ్య

ఇకఆస్తి ఏదండీపాపం?

పాపయ్య

అదిగో, అదేపనికిరాదు. నీదగ్గిర వెధవమెత్తతనం చాలకానిజాలి. మాదగ్గిర గుమస్తాగా వుండాలంటే బాకీవాళ్ళ కాళ్లకుక్కలకిమల్లేకఱచి మరీతీసుకురావాలి. వెఱ్ఱివాడా! వాళ్ళని ఋణాలెవ్వరు చేయమన్నారు? ఒళ్లు తెలియక తగలేసుకుంటే అప్పులుచేస్తే యెక్కడకిపోతాయి మరి. దానికేమిగాని పాపం, సర్వయ్యా! పూర్ణచంద్రరావెక్కడున్నాడోయి? నావుపాయం చెపుతానుకాని.

సర్వయ్య

దాసుగారింటో పక్కవేపున అద్దెకున్నాడు.

పాపయ్య

నేను ఎరస్టువారంటుకి పెట్టానులే. ఆర్డరు పడిందిలే. నువ్వూనేనూకలిసి బంట్రోతును తీసుకువెడదాము. ఈవేళ ముసురుకాదూ. ఎక్కడికీపోడు. ఇంటిదగ్గిరేవుంటాడు. సుళువుగా పట్టుకోవచ్చు.

సర్వయ్య

ఆస్తిలేనప్పుడు ఖైదులో పెడితేమాత్రం లాభమేమిటి?

పాపయ్య

వెఱ్ఱివాడా! లాభమేమిటా? పెళ్ళాము మెడలో గొలుసుంది, చేతికిగాజులున్నాయి. మొగుడిని ఖైదులోపెడితే పెళ్ళామావస్తువులమ్మి విడిపించుకుంటుంది. కనక మనమూ పనిచేస్తేమనడబ్బూ మనకొస్తుంది. వాళ్ళకీ యిక పేచీలుండవు.

సర్వయ్య (తనలో)

అరి నిన్నుతగలెయ్యా! (పైకి) చిత్తము.

పాపయ్య

సరే. లే యికవెడదాము.

౪

ఒకచిన్న పెంకుటింటివసారా పక్కదొడ్లో చాపమీదకూచున్నాడు పూర్ణచంద్రరావు. కళ్ళలోనుంచి వెలితి చూపులొస్తున్నాయి. నేత్రకోణాలు గుంటలుపడ్డాయి. మొఖం వైవర్ణ్యంపొందింది. చేతిలో ఒకచిన్న సీసావుంది.

కొంతసేపటి కిట్లాని తర్కించుకోడం మొదలువెట్టాడు. "నిజమే అయివుంటుంది. వారంటుకెన్నాళ్ళని దాగుతాను. ఇదివరకే సగము చచ్చివున్నాను. ఇక ఎరస్టుచేసి వీథులమ్మట తీసికెడ్తారు. అంతబతుకుబతికి అల్లాటి

తండ్రికిబుట్టి ఛీ! ఎందుక్కీబ్రతుకు? దానితో చెపితే నగలమ్మి తీర్చమంటుంది. ఇకనాముద్దు కూన పాపరూ, పాపరుబిడ్డానా? నాకేనా యీదైన్యం? నా కీపిరికితనం ఎందుకు? ఈ విషద్రావకం తాగితే అన్నీ వదలుతాయి.”

అట్లా తర్కించుకొంటూవుండగా— శేష అంట్లగిన్నెలుతోముకుంటూ ఆబురదచేతితో పిల్లాణ్ణిచంకని వేసికొనివచ్చి అక్కడ కూల వేసి ‘వీడినిచూద్దురూ, పనికడ్డమైనాడు’ అని వదలిపెట్టి వెళ్ళిపోయింది. పూర్ణచంద్రరావు మాట్లాడలేదు. పిల్లవాడిని చేరతీయలేదు. భార్యవంక అట్లేచూస్తోవుండిపోయాడు. నా భార్య దాసీదైపోయిందే అనుకున్నాడు.

ఇంతలో చంటిపిల్లాడు “బాబా! తీతా నాకి”మ్మని లాగనారంభించాడు. “నీకు కాదు నాన్నా! నాకే మహాపాపికి, నిర్భాగ్యుడికి” అని అందులో విషద్రావకం తాగేసి ఆసీసా విసరికొట్టాడు.

ఆవిషద్రావకం తాగీతాగడంలో గొంతుకు మండిపోయింది. కెవ్వునకేకెట్టి కూలిపోయాడు. కళ్లు గవ్వలై తిరిగిపోయాయి. చంటి పిల్లవాడు పెద్దపెట్టున ఏడుపారంభించాడు.

శేష పాపం పరుగుపరుగునవచ్చి చూచేసరికి ప్రళయప్రదర్శనం కనపడింది. భర్త ప్రాణంపోయింది. ఎంతపరీక్షించినా వూపిరి లేదు. అంతలో ఎదురుగుండావచ్చి పాపయ్య అతనిగుమస్తా, యిద్దరు బంట్రోతులు ఏరస్టువారంటు-యమధర్మరాజు దూతలల్లే నుంచున్నారు.

వాళ్ళనిచంటిపిల్లాడు చూచి ‘బూచాల్లే’ అని తల్లికాళ్లలోపడ్డాడు. శేష స్తంభితురాలై నిలబడిపోయింది.

## చిల్కా!

శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారు

ఒకచెట్టు మీాద ఒప్పైన గూటిలో
వసియించు చుండగా చిల్కా!
పాడువేడిగాడ్పు బాధింప నెంతయో
పరితాప మొందితిని చిల్కా!
చిగురుటాకులతోడ గుబురుగా
చిన్నమావి నీడజేర
ఆదరముజూపి సమ్మోదమ్మునొడగూర్చె
ఆనందమాయెనే చిల్కా!
గున్నమావినీడ గూర్చుండియుండగా
పున్నమ వెన్నెలగాయ
చిన్నిసంద్రమ్ము నా ఎన్కా యలలు రేగి
యుత్సాహ మొదవించె చిల్కా!
అంతలోన యెంతో సంతోషమలమగా
అదియేమి కర్మమోగాని
పంతము బూని యాపాడువిధి మనమునా
సంతాప మొదవించె చిల్కా!
గాఢపరితాపమున వాడుబారిన మనసు
వశము తప్పియుండగాను
కఠినభాషల నెంతో గారింతురే పరులు
కలతబడి నవయగా చిల్కా!
ఎన్నాళు లీరీతి యేహ్యజీవితమునా
వెళ్లబుత్తును దినములెంచి
కొన్నాళ్ల కయిన నా తెన్ను త్రోవ తెల్పి
కన్ను దెరిపింపవా చిల్కా!
మోసులెత్తి యాసకాసి పుష్పించగా
గాసి బాసి సుఖము జెందా
నే నాసించుచుండగా నాస
దీరక సుఖంబదియేల గల్గునే చిల్కా!

# గయ్యాళి వదినె

శ్రీమతి ఐ. యస్. లక్ష్మిగారు

౧

"దాదా! ఎక్కడ" అంటూ వంటఇంట్లోనుంచి కేకవేసింది శకుంతల.

"హాల్లోవున్నాను శకూ!" అన్నాడు రఘురామయ్య.

"నేను రావచ్చునా?" అన్నది తిరిగి.

"ఆ"

వెంటనే శకుంతల హాల్లోకివచ్చింది. పన్నెండేండ్ల బాల, చామనచాయకల నేతచీరకట్టుకున్నది. ఏదో చారలజాకెట్టు తొడుగుకొన్నది. వదులొదులుగా జుట్టు చెవులమీదపడుతూ వాల్జడ వేసుకుంది. ఇటునటు తొంగిచూచి, "మాతాజా? అన్నయ్యా!" అన్నది.

"ఏమిటమ్మా?"

"రాత్రి మొట్టికాయలుకూడా అయినాయి. నాకెన్నాళ్ళీకర్మం? మళ్ళీవస్తోంది కాబోలు దొడ్లోకి పోయింది. నీతో చెప్పేనని తెలుస్తే మరింతమండి పడుతుంది. కడుపులో పెట్టుకో. తెలియనీకు."

ఇంతట్లోకే వదినెగారు సత్యభామ పాకిట్లో ప్రత్యక్షమయింది. "ఇక్కడేంచేస్తున్నావుపిల్లా! పొయ్యి అంటించమంటే అంటించకుండాను." "లేదువదినా అంటిస్తా. దాదా నిన్ను పిలుస్తేను, ఎందుకో కనుక్కుందామని వచ్చేను." అని వెళ్ళిపోయింది.

౨

"ఏమండీ."

"........."

"ఏమండి మిమ్మల్నే"

"........."

"మాట్లాడరేం, బెల్లంకొట్టినరాయిలాగ వినపడటంలేదూ?"

"ఆ, ఏమిటి?"

"ఏమిటీలేదు, పిలిస్తేపలక్కపోవడం."

"అబ్బా, ఏమిటాగావు కేకలు. అమ్మలక్కలాగ అరుస్తావు. ఏదోపరధ్యానంగా వున్నాను."

"ఎందుకు నన్నుపిలిచారట పిల్లఅన్నది."

"ఏమీలేదు. ఇంకామడికట్టుకున్నావో లేదో, అని."

"ఇదిగో కట్టుకుంటూన్నా మరి. కొంచెం బద్ధకంగా వుందని ఆవిడగార్ని కట్టుకోమంటే కట్టుకోలేదు."

"పోనిద్దూ చిన్నపిల్ల ఏదో ఆడుకునే ఈడు. ఆక్కడికీ మంచిపిల్ల గనుక, తోచిన పనిచేస్తూనే వున్నది."

"ఆ, చేస్తోందిచేస్తోందని ఘోష. ఏమిటిచేస్తున్నది? ఆమాత్రపుపనికి, అబ్బురమాయేమిటి? ఎవరికోసరంచేస్తారు? వాళ్ళపొట్టకు వాళ్లు చేసుకోకపోతే, ఎవరుచేస్తారు? మీరుకూడా అల్లాగేమాట్లాడుతారు. అవును లెండి. పెళ్ళాం లేరగావచ్చింది కనుక అంటారు, అనండి. ఏంచేస్తాం, నాఖర్మమిల్లావుంది. పడక తప్పదు. ఎక్కడాదిక్కులేక, మీకు తెచ్చికట్టిపెట్టారు. పూజకొద్ది, పురుషుడన్నారు. ఏంపూజ చేశానోకదా దేవుడా; జిల్లేడుకాయలు, వుమ్మెత్తపువ్వులు, చేశానుకాబోలు" అని కళ్ళనీళ్ళు తెచ్చుకుంది.

"ఎందుకొచ్చిన కంఠశోష. మళ్ళీమడిగట్టుకో పొద్దెక్కుతోంది. పెందరాళే వెళ్ళాలి ఆఫీసుకు" అన్నాడు రఘురామయ్య కొంచెంవిసుగుతో.

భామ వెళ్ళిపోయింది.

౩

రఘురామయ్యకు కలెక్టరాఫీసులో నలుబది రూపాయలపని. ముప్పయిఏళ్ళున్నాయి. అతనిచెల్లెలు, శకుంతలకు, అతనికి పదునెనిమిదేండ్లవార. లేకలేక కలిగిన ఆడపిల్ల. అతనిభార్య సత్యభామకు ఇరవయి సంవత్సరాలు. కాపరానికివచ్చి అయిదువత్సరాలయింది. శకుంతలకు తలిదండ్రులిద్దరూకూడా కఱవయినారు. సాలుకు అయిదువందల రూప్యములు భూముల మీద వస్తాయి. ఇతనికొచ్చే నెలజీతము. ఇంతేవారికొచ్చేవరుంబడి. శకుంతల వివాహము ఆయిరెండేండ్ల

యింది. కొడుక్కి పెండ్లిచేశారు. మరుసంవత్సరమే ఇద్దరూ పోయినారు. పాపం తల్లిదండ్రులులేని పిల్లను రాల్చుకు తింటుందివదినెగారు. మొగుడంటే లక్ష్యం లేదు. పైగా అతను చెల్లెలుమాట ఏదేనాఎత్తితే, ఇంక ఆపూట ఇంట్లో అన్నకుచెల్లెలికికూడా, ప్రాణప్రాప్తిలేదన్నమాటే. ఇంకెవరూ పెద్దదిక్కులేదు. ఏం చేస్తారు? అట్లాగే బ్రహ్మరాక్షసిదగ్గర కొట్టుకుంటున్నారు. ఇంకోఏడాది ఓపికపట్టే పిల్లఅత్తవారింటికి వెళ్ళిపోతుందికదా అని రఘురామయ్య అభిప్రాయం. అన్నకుచెల్లెలికి అమితప్రాణం. అన్నగారు పక్కపువ్వుగాని, చకలికగుడ్డగాని ఏదేనా కొనుక్కుతెచ్చేందుకు డబ్బుగాని వదినెగారు చూస్తుండగా ఇవ్వకూడదు. అందుకోసరం చాటుగాపిల్చి ఏదేనా డబ్బిచ్చి కొనుక్కోమనేవాడు అన్నగారు. తెల్లవారిపూట చల్దిఅన్నం, మధ్యాహ్నంవేడన్నం, సాయంత్రం మళ్ళీచద్దన్నమే, అదైనా, అరకడుపుభోజనమే. పాపం, ఆపిల్లకు, ఏవిధమైన సౌఖ్యంలేదు. ఎప్పుడు అత్తవారింటికి విరగడైపోతుందా అని భామ ఎదురు చూస్తోంది. ఇంతకూ తనకు పిల్లలైనా లేరు. అయినా, కించిత్తుకూడా ఓర్పులేదు. అన్నగారు యింట్లోవున్నప్పుడు 'పిల్లా' అంటుంది. లేనప్పుడు నసీ, ఏమే అని పిలుపు. ఇదే ఆడపడుచును ఆదరించవలసినరీతి?

౪

"వదినా! శ్రావణమాసంవచ్చింది. శనగలు తెప్పించవూ? నోమునోచుకుంటాను."

"చాల్లేవే. మహానోములుగీములు, మాకొంపను అప్పులపాలుచేయ తలచుకున్నావు." అన్నది భామ మండిపడుతూ.

"పోనీ వదినా! ఎందుకుకోపం, మానేస్తాలే. వచ్చే యేడు నోచుకుంటాలే" అన్నది దీనంగా శకుంతల.

"చాల్లేవే, మహాగొప్ప అత్తవారిల్లు దొరికింది. అక్కడచేయిస్తారులే. చూస్తా, చూస్తా, ఇక్కడ నన్ను నలుగురిలో యాగీచెయ్యటానికి, ఇదంతాను. ఒకశేరుశనగలు తెప్పిస్తాను, అవిపెట్టినోచుకో."

"నాకక్కరలేదులే. అంతకొంచెంతో నోమేమిటి?"

"అబ్బో, పదవికిపట్టుపగ్గాలు, విడవపోకులు లేకుండావున్నాయి, చేసుకుతీరాలి. అన్నిటికీ నీఇష్టమేనా?"

"మాఅమ్మా, నాన్నావుంటే ఇలాచేస్తారా?" అని శకు కళ్ళనీళ్ళెట్టుకుంది.

"ఆహా, తక్కువలా. నువ్వింతనిర్వాహకంనిప్పేటు తున్నావు, ఇహవారు—శకేశ్వరులు, చచ్చారో, అదృష్టవంతురాలినయ్యానో. నీతో నేవేగలేకుండావున్నాను నాతల్లీ! నువ్వుకూడా పూడ్చిపెట్టుకు ఎప్పుడు పోతానో, ఎప్పుడు సుఖపడుతానోగదా దైవమా? ఇంకా ఎందుకు బోల్లిబొల్లి ఏడ్పులు?"

ఇన్నిమాటలచెప్పటికి, శకుంతలకువెర్రిదుఃఖమొచ్చి ఏడుస్తూ మంచంమీదపడుకుని నిద్రపోయింది. అన్నం తినేలేదు. వదినెగారు తినమనలేదు.

౫

"తలుపు, తలుపు."

"........."

"తలుపేవ్."

"యెవరు?"

"నేనే, తలుపు."

"వస్తాను."

పదినిముషాలయింది తలుపుతీయలేదు. తిరిగీతలుపు దబదబాతట్టాడు. సత్యభామవచ్చి తలుపుదఢాలున తెరిచింది. రఘురామయ్య లోపలికొచ్చి, బైటినుంచి వచ్చిన బట్టలు విడిచేసి, లోపలికొచ్చి మడిబట్టకట్టుకుంటూ "శకుంతలపడుకున్నదా?" అన్నాడు.

"ఊ" అన్నది భామ.

"వంటయిందా? వడ్డిస్తావా?" అన్నాడు.

"రండి, వడ్డిస్తా" అన్నది.

విస్తరిముందు కూర్చున్నాడు రఘురామయ్య. వడ్డిస్తోంది భామ.

"శకు అన్నంతిన్నదా?"

"........"

"ఏమే అన్నంతిన్నదా?"

"ఆ"

"జవాబు సరీగా చెప్పవేం? నోట్లోంచిమాట బయటికి రాదేం?"

"ఏమిటీ చెప్పేది? మీరు చేసేవుద్యోగానికి తోడు, ఎదురుగడమా ఇంపులుకూడానా? కొంచెం అణిగివుండండి. మీరు చేసేపన్లకి, మీ చెల్లెలు చేసేపన్లకి, సంతోషం ఎక్కువయి, నోట్లోంచి మాట రావటం లేదు."

"ఏమి చేసే? ఏంమునిగిందిప్పుడు?"

"ఏంమునిగేద మేమిటి. ఇందాకటినుంచి పెద్దరంతు చేసి, కంచెడు చెల్లించి, మరీ నిద్రపోయింది."

"ఏంరంతు చేసిందేమిటి?"

"ఏముంది. మళ్ళీ నాపీకమీదికి శ్రావణమాసం వచ్చిందిగా నోములకు."

"పోనీ నోపించు. రేపు రెండురూపాయల శనగలు తెస్తాను. దానికేం, బ్రహ్మాండమేముంది?"

"అవును మీకు తేలికగా నేవుంటుంది. వుండమూమరి. ఆరెండురూపాయల్లోను, అర్ధరూపాయ పెట్టితెస్తే నాలుగువారాలకూ సరిపోతాయి. మిగతా డబ్బు పెట్టి నాకో రవికెల్కొనితెండి. మంగళవారం పేరంటానికెళ్ళడానికి రవికలేలేవు."

"పోనిస్తూ దానిష్టమొచ్చినట్లా నోచుకోనీ. ఈ యేడేగా మనింట్లో. పైమాటు వెళ్ళిపోతుంది."

"పోనీ ఇల్లరికం పెట్టుకోండి. నెత్తిమీద కెక్కించుకోండి. వద్దన్నదెవరు? ఇంతకూ నేనెవరికి తెమ్మన్నానసేనా? పిల్లమీదవున్న ప్రేమ నామీద లేదాయెను. ఇంతకూ నే నెరగనూ మీ నైజం?."

౬

"ఏమేం, పిళ్ళారిచవితి వస్తోంది. శకుంతల మొగుణ్ణి, పిలుద్దామా? నేనెట్లాగూ పూజ చేసుకుంటానాయెను."

"ఎందుకులెస్తురూ ఇప్పుడు. పిలుస్తే బట్టలుపెట్టవలసివస్తుంది. ఎందుకొచ్చినఖర్చు?"

"పోనిస్తూ ఈసారేకదూ. అయినా నీఇష్టం. ఆలోచించిచెప్పు. నువ్వుమాత్రం వద్దంటావేమిటి? ఇంకా వారంరోజులుంది. వుత్తరం వ్రాస్తేవస్తాడు."

ఆలోచించింది దీర్ఘంగా "సరే, పిలవండి," అన్నది.

"అమ్మయ్య, ఎంతమంచిమాట వచ్చిందే నీ నోట్లోంచీ." అనుకున్నాడు రఘురామయ్యమనసులో.

"సరే, వుత్తరంరాయనా ఇవాళ?"

"రాయండి."

౭

రాత్రి 8 గంటలమెయిల్లో విశాఖపట్నంనుంచి కామేశ్వరరావు వచ్చిదిగాడు. తెల్లవారే చవితి. కామేశ్వరరా వొక్కడేవచ్చాడు. తెల్లవారిపూజకన్నీ సిద్ధంచేస్తున్నారు శకుంతలా సత్యభామలు. భావమరుదులిద్దరూ కబుర్లుచెప్పుకుంటూ నిద్రపోయారు.

తెల్లవారింది. బావమరుదులిద్దరూ పూజచేస్తున్నారు. వదినెమరదళ్ళిద్దరూ వంటపనిచూస్తున్నారు. పూజా, నైవేద్యం అయినాయి. భోజనాలకు కూర్చున్నారు ఒక బ్రాహ్మడు, ముత్తయిదువ, బావమరుదులిద్దరూను. భామ వడ్డిస్తూంది. శకుంతల మొగుడువచ్చాడని సిగ్గుతో బయటికేరాలేదు. రాకపోతే వూరుకునే వదినెగారు గనుకనా? "వచ్చి, కొంచెంనెయ్యి, మజ్జిగ అయినావడ్డించు. సిగ్గేమిటి తింగిసాదం" అంటూ విసవిసలు మొదలెట్టింది భామ.

పాపం, శకుంతల కెటూ తోచదు. వెళ్ళటానికి సిగ్గు. వెళ్ళకపోతే వదినెగారికేకలు, మొగుడు వింటాడనిభయం. ఇంతట్లోనే అన్నగారు, "శకూ! రా అమ్మా, ఫరవాలేదు," అన్నాడు.

అన్నగారనగానే శకుంతల నెయ్యిపట్టుకొచ్చింది.

భార్యనుచూశాడు కామేశ్వరరావు. దీనముఖం, తిండిసరిగాలేక, మనసులో దిగులుచేత, పిల్లచిక్కిపోయినట్లుంది. అతనిమనసులో ఏమితోచిందోకాని తలవంకించి వూరుకున్నాడు. ఇదంతా శకుంతల కనిపెట్టింది. నెయ్యివడ్డించి వెళ్ళిపోయింది.

ఆరోజువుండి మర్నాడు ప్రయాణమైనాడు కామేశ్వరరావు. రఘురామయ్య కొత్తబట్టలకు పనుపంటించి చేతికిచ్చాడు. కామేశ్వరరావు శకుంతలను చాటునపిల్చి "డబ్బేమైనాకావాలా" అన్నాడు.

"నాకెందుకు? వద్దు" అన్నది శకు తలవంచుకుని.

"ఎందుకూసిగ్గు? తలెత్తినాకేసిచూడు" అన్నాడు కామేశ్వరరావు.

తలెత్తింది శకుంతల.

"ఏమిటిల్లావున్నావు? ఇంత చిక్కిపోయి. నీ కష్టాలు నాతో చెప్పవూ?"

"చెప్పేందుకేముంది దైవాన్ని ప్రార్థించటమే."

"సరే లే. నే వూరికెళ్లుతున్నా. ఏమీభయం లేదులే" అని వెళ్ళిపోయాడు.

కార్తీకమాసంలో ముహూర్తాలున్నాయి. ముహూర్తం జరిపించమని శకుంతలమామగారు వుత్తరం వ్రాశారు. "మాఘమాసంలో తప్పకుండా చేస్తా"నని రఘురామయ్య బదులువ్రాశాడు.

౮

"దాదా! సంక్రాంతిపండుగ వస్తోంది. ఏదేనా చీరకొని పెట్టగలవా?" అన్నది గద్గదస్వరంతో శకుంతల.

"శకూ! నాతల్లీ! నే నంతఅదృష్టవంతుణ్ణా అమ్మా! చీరకొంటే ఇంకాఏమేనావున్నదా? ఏమీ లేదు, బ్రహ్మరాక్షసికి దణ్ణంపెట్టవలసివస్తోంది రోజుకు రోజు. అయినాభయపడకు వెర్రితల్లీ! నువ్వు అత్తారింటికెళ్లేటప్పుడు కొనిపెట్టాను. అయిపోయిందిలే, నీ కష్టాలు గట్టెక్కాయిలే. కామేశ్వరరావుకూడా మంచివాడేను. జాగ్రత్తగానే చూచుకుంటాడు. మాఘమాసందాకా ఓర్చుకోతల్లీ!" అన్నాడు కళ్ళనిండా నీళ్ళతో.

"కష్టపడకు, దాదా. నాఅదృష్టమంతే, నువ్వేం చేస్తావు? నీకుమాత్రం ఏమిసుఖముంది? ఆ, ఆఫీసులో వున్న కాస్సేపుసుఖం. ఇంటికొస్తే నరకలోకమే. అవునుగాని దాదా! మాఅత్తవారింటికి నన్ను చూడ్డానికి, ఎప్పుడైనావస్తుంటావా? నిన్ను చూడందేవుండలేను దాదా! రెండునెలలకొకసారి కనుపిస్తావా? ఏమోలే, ఆవిడగారికి తెలుస్తేరానీదు."

"అవును లేఅమ్మా! ఎట్లాగోఅట్లా వీలుచూచుకుని వస్తూంటాను."

ఈ సంభాషణ ముగిసీముగియకముందే అమ్మ శక్తి తయారయింది.

"ఏమిటిరహస్యం? చెవులుకొరుక్కుంటున్నారు, అన్నాచెల్లెళ్లూనూ?"

"ఏమీలే. శకుంతల బొమ్మలెట్టుకుంటాను పళ్లు తెచ్చి పెడతావా? అని అడుగుతూంది. వదినతో చెప్పలేదు. చెప్తాను. నీతో చెప్పి వెళ్దామనివచ్చాను. అంటున్నది." అన్నాడు రఘురామయ్య.

"అవును లెండి. నాతోయెందుకు చెప్పడం? నేనెవర్ని, ఆవిడకళ్ళకు నేనుకనిపిస్తానా? నాపెత్తనం, పేలాలేగినట్లేవుంది. మీఇష్టమొచ్చినట్లు చేసుకోండి. నాకేం తెలియదు."

"సరే, అట్లాఅని వూరుకో. పళ్లు నే తెస్తాను, బొమ్మలు పెట్టుకో, శకూ!" అన్నాడు రఘురామయ్య.

"ఆ, ఆ, నా ఎదుటనే చిన్నపిల్లల ఎదుట పెద్దవాళ్ళను లక్ష్యంచేయకపోతే, వాళ్ళూ లక్ష్యం చెయ్యరు."

"లక్ష్యానికేముంది? వదినా!" అన్నది శకుంతల.

"ఆహా! నువ్వుకూడా ఇంతదానవయ్యావు? గుడ్డు వచ్చి పిల్లను వెక్కిరించినట్లుంది. ఏంచూసుకున్న మిడిసిపాటు. రా చెప్తా. బొమ్మలూపెట్టనిస్తా, పళ్ళు తేనిస్తానా?" అంటూ చక్కాపోయింది రొసరొసలాడుతూ.

"కానీ, తల్లీ! ఏంచెయ్యను. కాని రోజులివి."

"పోనీలే, దాదా! ఎల్లాఅయితే అల్లాఅవుతుంది. మించిపోయిందేమిటి?"

౯

మూడునిద్రలూఅయి, నాలుగోనాడు ప్రయాణమయినారు, శకుంతల అత్తవారు. శకుంతలకు అన్నగారు, వకట్రంకుపెట్టె రెండుచీరెలూ ఇస్తానన్నాడు. అంతే. అక్కడనుంచి, అలమ్మరాగాలుపెట్టి, ఇవ్వటానికివీల్లేదని అడ్డంకూచుంది భామ. "సరేపోనీ" అన్నాడు. కట్టుకున్నబట్ట, పసుపుపోసి వకచిన్న ఇత్తడిచెంబు, ఇంతేసారె శకుంతలకు.

౧౦

శకుంతల అత్తవారింట కాపరంచేస్తున్నది. ఒకనాడు రఘురామయ్యవచ్చాడు. శకుంతలవచ్చి వడిలోవాలి "అన్నయ్యా!" అని కౌగలించుకుంది.

"కులాసగా వుంటున్నావా? శకూ!"

"ఆ, దాదా! నామాట కేంగాని, నీపనెల్లా వుంది?"

"మామూలుకు భిన్నంలేదు, శకూ!"

"దాదా! వదినెతో చెప్పివచ్చావా? లేదా?"

"లేదు, స్నేహితునివూరు వెళ్తానని చెప్పి వచ్చాను."

"నాకేం తెచ్చావు? దాదా!"

"మూడువందలరూపాయలు తెచ్చాను, శకూ. అది పెట్టి నీకేంకావాలో కొనుక్కో... మీవదినెకుమాత్రం తెలియనీకు."

నాల్గురోజులున్న తర్వాత, "ఇవాళ, వెళ్లివస్తాను శకూ!" అన్నాడు రఘురామయ్య. చెల్లెలు సుఖంగా వున్నందుకు సంతోషపడ్డాడు. కామేశ్వరరావు పెళ్ళానికి కావలసినన్ని నగలు చేయించిపెట్టాడు. అతనికి నెలకునూరురూపాయిలు జీతం. ఓశకుంతల కాపురం వేశివెయ్యకండా చేస్తోంది.

"ఇంకా రెండుదినాలుండు, దాదా!" అన్నది.

"వుండనమ్మా మళ్లీవస్తాలే" అన్నాడు రఘురామయ్య. వెళ్లేటప్పుడు అన్నగారికి బట్టలుపెట్టింది శకుంతల. మళ్లీ శకుంతల పుట్టినింటివైపు తిరిగిచూడ లేదు. వదినెగారిగా రాలేదు. అప్పుడప్పుడు దాదా మాత్రం వస్తూపోతూవుండేవాడు.

## ఋణము

గుంటూరి వేంకటశాస్త్రిగారు

అప్పుడప్పుడె చీకటులంతరించె
యావిషాదమలీమసాచ్ఛాదితముఖ
బింబమదె నాదునేత్రయుగ్మంబుముందు
ఛాయవలెతోచి నెమ్మది బాయదయ్యె.
కానఁగారాని పలుకఁగరాని యొక్క
శక్తినను నామె వెనువెంటఁ జనుమటంచుఁ
ద్రోసివైచెను మనసునఁదోచునితర
భావములవీడి, పోతివిభ్రాంతితోడ.
ఎంతదవ్వరిగినాడనో యెఱుఁగనేను;
ఆమెయాగినప్రతిచోట నాగినాడ
నామెగృహకృత్యములఁజేసి "అమ్మగారు!
జీతమిచ్చెదరా" యని చీఱుచుండె.
రేపురమ్మనికొండఱు, రెండుమూడు
దినములలోచూచి యిచ్చెదననుచుఁగొంద
ఱప్పుడేనెలయాయెనా యయ్యగారు
లేవలేదనికొండఱు, లేచినంత
నడిగియుంచెదననికొంద ఱనిరి, "కాని;
అట్లుకాదండి తల్లి! మాయనుఁగుబిడ్డ
జ్వరముతోబాధపడుచుండె పదిదినముల
నుండి, రాతిహెచ్చినది, యెట్లుండునో, మ
రేమగునో? తామదయనువహించి నేఁడు
జీతమీయ మందునకు వెచ్చించుకొందు"
ననిన యాదాసి దీనవాక్యముల నొక్క
రేనియునువిన్నకై వడిఁగానపడరు.
జాముప్రొద్దెక్కెనది; యాశజారిపోయె
మెల్లమెల్లగ నాదాసి యిల్లుఁజేరె
కొడుకుపై నాశవిడచి యంధుడగుతండ్రి
రోదనమొనర్చుచుండె వేరొక్కదెసను.
అంత నేఁజని వారలననునయించి
యౌషధంబొసగితిని యాయర్భకునకు;
వారలంతట నానందబాష్పజలము
లద్దుకొనివందనమొనర్చ నంటినిట్లు.
"నావిధినొనర్చినాఁడ వందనములొంద
నర్హుండనుకానునేను, ఉదయంబునుండి
కాంత! నీదుప్రజాసేవఁ గాంచినంత
కఠినశిలలైననీరమై కరగుఁగాని
ధనమదాంధత నీదీనదశఁదలంప
హృదయమునతావు లేకపోయెను బ్రజలకు
అవసరమునకుఁదోడ్పడనట్టివారు
మీఋణము నెన్నటికిఁ దీర్పలేరు సుంత."

# పువుముద్దరాలు

ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు

ఆవసంతమనోజ్ఞసాయంతనమున
సంజకెంజిగులొలసెడి సమయమందు
నరఁటిబోదెలచాల మాపెరటిలోన
నతివిశాలోన్నతాగ్రసౌధాంతికమున
నుల్లమిడిపెంచికొనెడి నామల్లెతీగ
తరుణసహకారవిభుని గాంధర్వవిధిని
పరిణయంబయి హాయిఁగాపురముసేయు
చుండెనఁట యెంతొ వేడ్కతోఁ జూడఁబోయి
యపుడపుడుప్రకృతిశోభల నరయుకొఱకు
పఱచికొన్నట్టి పాషాణఫలకమందు
హాయిఁగూర్చుంటి పల్లవాహ్వానమునను.

* * *

చివురుజొంపాలమేడలోఁ జిన్నిచిన్ని
మంచుముత్యాలజాలరుల్ మలచి జాజి
పసఁతికట్టె లతాద్వారబంధములను
గప్పురపుఁబుప్పొడుల మొల్లకాంత తీర్చి
దిద్దిముగ్గులఁబచరించె ముద్దులొలుక
గములగములఁజిల్కు తేనె వాకలనుజిమ్మ
కనులవిందొనరించెఁ జెంగలువచెలువ
గొంతుసన్నాయిసవరించి కోకిలంబు
తీర్చియేవేవొ రాగాలఁ దీయుచుండె
చీరసింగారిమొసరించి చిలుకకొదమ
జిలుఁగునడకలుకులుకులఁ గులకరింప
తవిలిసవరించునేదొ యంతఃపురాన
పర్వమిణుఁగురుగాలిదీపాలనేర్చి
రోచులెగఁజిమ్మ సమరించెఁ గీచురాయి
తన్వనేకానురాగత తసర నాకుఁ జిలుక
స్థానులు నాట్యాలఁ జేయుచుండ్రి
చూడవలెనోర యప్పటిసోయగంబు.

* * *

అంటు నొకపూవుపడుచు మాయళికుమారు
తిలకమిడె నొక్కపూలేమ తేటిదొరకు
రాసిపువుగంధ మొకరిత భ్రమరపతికి
పెండ్లికొడుకయి తీవి మాభృంగరాజు
అనిలసఖునికై దండ నొయ్యారమునను
దీరుగానొకలతకూనఁ గూరుచుండి
మల్లెపూమోహనాంగికై మఱఁగిమఱఁగి
భావనాసౌధమాలలఁ బరుగులెత్తి
ప్రణయదేవి నుపాసించి బడలిపోయి
మోహభర మాఁపలేక ప్రముగ్ధుఁడయ్యె.
చాలురా! లేర! సుమబాలతాళలేదు
దంటవాదన ముద్దుగోరెంటకన్న
కందెనపుటాడలిమార్చెదఁ గుందనంపు
టాడలిగానంచుఁ దనదు మైపొడినిఁజిమ్మ
రంగుగామేలమాడె గేదంగిపడుచు
ఎంతవగకాఁడవుర! పువుటింతిమనసు
చొక్కఁజల్లిగ్రహించి నీసొత్తుఁజేసి
కొంటని హాసించెను గులాబికోమలాంగి
ఎంతధన్యతముండవో? మాభృంగరాజు.

* * *

అళికుమారక! రమ్మదే యలరుపడుచు
తొలఁకుఁజిరునవ్వులో సిగ్గుతొట్రుపడగ
కులుకునడకలఁగోర్కులు గునిసియాడ
మధురకుంజాన నొంటిమై మలయుచుండె.

* * *

చివురుఁజేతుల మెల్లఁగా జేరఁబిలిచి
పదరిభాషింపఁబోయి త్రపాభరాన
తోడిముడుదలమోములఁ జూడలేక
ముసిపెముగనాకుఁ జీరమేల్ముసుఁగులోన
మొరఁగెదేలనే? మల్లెపూముద్దరాల!

* * *

## కీ. శే. శశిపద బెనర్జీ

శ్రీమతి గంటి కామేశ్వరమ్మగారు

సంఘసంస్కరణోద్యమమును సాగించి యత్యంతోన్నత్యమునకుదీసికొనివచ్చి హిందూదేశమున నూతన శకమును స్థాపించిన కీ. శే. శ్రీరాజా రామమోహనరాయలు చిరస్మరణీయులు. ఈయన యనంతరము వంగదేశమున పెక్కుమహనీయులవతరించి రామమోహనునియాశయములగొనసాగించి సుస్థిరముగా స్థాపనజేయ బద్ధకంకణులైరి. అందు ముఖ్యులలో నొకరు కీ. శే. శశిపద బెనర్జీ. ఈతనిఘనకార్యములకు వంగదేశీయులే కాక యావద్భారతీయులును నీయనను గొనియాడకతప్పదు.

బెనర్జీ కలకత్తాకు చేరువనున్న బారానగరున 1840 సంవత్సరములో జన్మించెను. ఈయన ప్రసిద్ధికెందిన కులీనబ్రాహ్మణుడు. బారానగరులో పేరెన్నికగన్నవాడును, ప్రథమాంగ్లపాఠశాలాస్థాపకులలో నొకడును నగు శ్రీరాజకుమార బెనర్జీగారి తృతీయపుత్రులు. వీరి కయిదువత్సరముల ప్రాయము రాకమునుపే తండ్రి విగతజీవుడాయెను. కష్టకాలమందైనను మనోధైర్యముగల యాతనిజనని, విద్యారహితయైనను సహజగుణశీల సంపదచే వలరారునది. బెనర్జీని యల్లారుముద్దుగా పెంచి పెద్దవానినిజేసెను. విధివశమున నీసతి మహావ్యాధిచే పీడితురాలై 1863 లో స్వర్గీయురాలయ్యెను.

బెనర్జీ మెట్రిక్యులేషన్ పరీక్షయం దారితేరకమునుపే పాఠశాలను విడనాడవలసియుండెను. పూర్వాచారమునను సరించియు, నప్పటి దేశకాలపరిస్థితులననుసరించియుగూడ బ్రాహ్మణయువకులు బాల్యవివాహములకే గురియగుచుండినను బెనర్జీగారుమాత్రము ఇరువదియవసంవత్సరమున వివాహముజేసికొనిరి. ప్రథమకళత్రమువలన నాయన కేవురుతనయులుగలరు. నల్గురు కాలముచేసిరి. అయిదవవారు, ఇండియన్ సివిల్ సర్వీసు యందు దారితేరినవారగు సర్ అల్బియన్ రాజకుమార్ బెనర్జీ, క. టి. ఎస్. ఏ. సి. యస్. ఐ. సి. ఐ. ఇ., ఐ. సి. యస్. గారు. ఈయన ఇప్పుడు లండనులోనున్నట్లు తెలియుచున్నది.

1870 వరకు శ్రీ బెనర్జీగారుపాధ్యాయపదవిలోనుండి యార్థికపరిస్థితులకులోనగు చిక్కులవలన మిగుల శ్రమపడిరి. తదుపరి దైవకృపచేనాయనకు ప్రభుత్వములో నొకయున్నతోద్యోగములభించినందున పైన చెప్పబడినకష్టములు తొలగిపోయినవి. వీరిమంచిచేతలకెంతయుసంతసించి భాత్పారాపండితు లీయనను "సేవవ్రత" యను బిరుదముతోనలంకరించిరి. 1868 లో ప్రభుత్వమువా రీయనను గౌరవన్యాయాధికారి పదవికిని, గౌరవపురపాలకసంఘకార్యదర్శిగను నియమించిరి. బెనర్జీ ఇంగ్లండుదేశమునకు వెడలుసందర్భమున బారానగరుప్రజ లాయనను మిగులసన్మానించి వీడ్కొల్పిరి. భారతదేశమున మితపానోద్యమమునకు జేయూత నొసంగి మహోపకారమొనర్చిన బెనర్జీ కార్యదీక్ష కచ్చెరువంది బర్మింగుహాముప్రజ లీయనను దగుబిరుదములచే సత్కరించిరి. మాతృదేశమునందును, విదేశములయం దింతగాకొనియాడబడినను బెనర్జీ ఇసుమంతయు గర్వమునకులోనుగాలేదు. ఆత్మబోధాతత్పరుడై తనజీవితమునుగడపిన మహాత్ముడు తొలుత నీయన సంఘసంస్కరణోద్యమమునకొనర్చిన సేవల బరిశీలింతము.

జన్మస్థానమగు బారానగరులో జాలయంత్రశాలలుండుటవలన పెక్కుకార్మికులు నివసించుచుండిరి. ఉదారస్వభావుడైన బెనర్జీ కార్మికుల దుస్థితికెంతయువగచి వారి కన్నివిధములతోడ్పడనెంచి విద్యాహీనులైన కార్మికులకు విద్యాదానముజేయ రాత్రిపాఠశాలలను జాలస్థలములలో స్థాపించెను. వారి యుపయోగార్థమై పుస్తకభాండాగారమందిరమునునిర్మించి వారికెల్లవిధముల ప్రోత్సాహమొసగుచుండెను. అందుచేగాబోలు బెనర్జీ ఇంగ్లాండునకేగునపుడు కార్మికసంఘము సన్మానపత్రమునం దాతనిని దమగురువనియు, దండ్రియనియు

# కాపుపాట

డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు ఎం. ఏ., పి. హెచ్. డి.

కాపుపాటలలోన కలదురాతీపి
కాపుచేతలలోన కలదురాలచ్చి
కాపుమాటలలోన కలదురానీతి
కాపుమానసములో కలదురాతేట

కాపుపాటలు మెచ్చి
కాపుచేతలఁ జొచ్చి
కాపుమాటలఁ జొక్కి
కాపుమనసుననిక్కి

కవికుమారకులార! కదలిరండయ్య
కాపుకై తలఁగూర్చి కలిసిపాడుదము.

... ... ...

సీతమ్మసింగారమే
ఒళ్లంతబంగారమే

చిన్నారిపొన్నారి సీతపుట్టింది
చిటిపాపచిక్కింది చేనిలో నిపుడు.

సీతమ్మఁగన్నట్టి ఆతల్లియెవరు?
భూమహాలచ్చిమికి పుట్టిందిసీత.

సీతమ్మఁగన్నట్టి ఆతండ్రి యెవరు?
దున్ని తేల్చినకాపు కన్నాఁడుసీత.

సీతమ్మ నెవ్వరు చేపట్టుతారో?
శివువిల్లువిరిచేటి చెన్నరాయుండు
దరినినిల్వఁగల కోదండరాముండు
తనలోననవ్వు నాత్మారాముఁడతను
దొంగరాకాసుల త్రుంచేటివాఁడు
దుక్కిటెద్దులు మరఁదులు సీతకై రి
పాలేరు లచుమన్న మరియొక్క మరఁది.

... ... ...

సీతమ్మకిప్పుడే చేస్తారు పెళ్లి
సొగసుకాన్కలు కొంచు చూడఁబోదాము.

... ... ...

సీతాకల్యాణమే
వైభోగమే

పైరుపచ్చని పట్టుచీరకట్టింది
రంగుగులాబీల రైకతొడిగింది
మోదుగుపూవుల బొట్టుపెట్టింది
కల్వరేకులవన్నె కాటుకెట్టింది
గల్లుగల్లుఁ వచ్చె కన్నెసీతమ్మ
కల్యాణవేదికి కనులపండువుగ.

... ... ...

కవికోకిలములార! కలసిపాడండి
కవిశుకంబులు పలుకండిదీవెనలు
కవిహంసములు వేడ్క కలసిచేరండి
కవిమయూరములు త్రొక్కండినృత్యములు
కాన్కలిత్తామిప్డు కన్నెసీతకును
కన్నెసీతమ్మకు కాన్కయేముంది?
తొలకరిచినుకులే తొల్లింటికాన్క.

# కర్షకుడు

కుర్రా వేంకటసుబ్బారావు చౌదరిగారు

సీ. కోరమీసము దువ్వుకొనుచు సింహాసనా
ధ్యాసియై వెల్గు భూమీశుమహిమ

శాత్రవనిర్భేద్యసరణితంత్రంబుల
గల్పించుమంత్రపుంగవునిమహిమ

వీరకుమారులు వినుతింప సమరవి
హారియౌ సైనికాధ్యక్షుమహిమ

గర్వాంధతను కన్నుగానక కేవల
భోగియైతిరుగు యుద్యోగిమహిమ

దేశకాలస్థితులనెల్ల తెలుసుకొనుచు
ధనమునుగడించు మేటివర్తకునిమహిమ
శీతవాతాతపంబులచే చెమర్చు
కర్షకా! నీదు స్వేదాంబుకణముగాదె.

నేకగ్రీవముగా బల్కిరి. ఇట్టిపితృభావము కార్మికులలో గల్గుటకు ముఖ్యకారణము బెనర్జీయొక్క నిర్మలాత్మయు, స్వార్థపరిత్యాగబుద్ధియు నుదారస్వభావముతప్ప వేరొండుగాదు.

అథఃపాతాళమున కణగద్రొక్కబడిన తక్కువజాతివారలను ఆర్థికముగను, సాంఘికముగను, నైతికముగను నభివృద్ధికిదీసికొనివచ్చి, వారలను తోడిసోదరులతో సమానహక్కుగలవారలనుగాజేయుటయే యాయన యాశయము. విశ్వసోదరప్రేమయే యాయనసందేశము. అందులకు తాను వారితో విచ్చలవిడిగా గలిసిమెలిసి యితరులనట్లుజేయుమని చెప్పి మార్గదర్శకుడాయెను. ఆకాలమెట్టిదన సనాతనధర్మములు మహోన్నతస్థితియందుండెను. బొంబాయిలో నిట్టి తక్కువజాతివారిసంఘమొకటి స్థాపనజేయగా నీవిశ్వదాత యాసంస్థకు రెండు వందలరూప్యముల విరాళమొసగి తనప్రేమను వెల్లడించుకొనియెను.

బెనర్జీ ఆంగ్లభాషాపరిచయముచే గొప్పమార్పునకు లోనయ్యెను. 1865 లో నీయన విగ్రహారాధనమును మానివేసి, యజ్ఞోపవీతమునుగూడదీసివైచి రామమోహనునిచే జిరస్థాయిగ నెలకొల్పబడిన బ్రహ్మమతమును స్వీకరించెను. ఈకారణమున బారానగరనివాసులందరును వెలివేసి యాతని నెంతయునకష్టములపాలొనర్చిరి. ఎట్టిబాధచేనైననుజలించు స్వభావుడుకాడు బెనర్జీ. నిశ్చలచిత్తముతో, ద్విగుణీకృతధైర్యసాహసములతో నాతని, నాతనివిధానమును సాగించుచునేయుండెను.

బెనర్జీకుటుంబము పెద్దది. బంధుగులుసహితము వీరియింటనే నివసించుచుండెడివారు. వివాహానంతరము భార్య వీరిగృహమునకురాగానే యామెనితకు విద్యాబుద్ధులు స్వయముగాగఱప నుద్యుక్తుడయ్యెను. "పతియాశయములనెఱింగి యీయిహలోకజీవయాత్రలో నాతని కన్నివిధములసాహాయ్యమొనరించునదియే సతి. అందుకొఱకే వివాహమత్యవసర"మని యీమనుగుణునియభిప్రాయము. వంగదేశాచారమునుబట్టి భార్య భర్తను పగటిపూట చూడరాదనునిషేధమున్నను లెక్కచేయక బెనర్జీ తనకాంతకు విద్యయందుత్సాహమునుగలుగజేసి యొక్కవత్సరముననే విద్యావంతురాలినిగాజేసెను. అదిమొదలు ఆప్రేమైకదంపతులిరువురును పాఠశాల నొకదానినినిర్మించి బాలికలకు, స్త్రీలకును విద్యాభ్యాసమునుగలిగించుచుండిరి. వీరి కార్యక్రమమునునిర్మూలించు నుద్దేశముతో సనాతనులును, శత్రువులును జెప్పరాని యడ్డంకులను గలిగించినను బెనర్జీ నిరుత్సాహమును బొందలేదు.

1866 లో బెనర్జీ స్వగృహమును విడనాడవలసివచ్చెను. బారానగరులో నొకగృహమునిర్మించుకొని యందుండెను. 1871 లో బెనర్జీ సతీసమేతుడై యాంగ్లదేశమున కేగెను. ఇంగ్లండునకేగివచ్చిన హిందూనారీమణులలో బెనర్జీసతి ప్రథమురాలనియే యూహింపనగును. హిందూదేశమునకురాగానే దొరతనమువారాయనకు సహాయవ్యాయాధికారిపదవినొసగినను, దన సంకల్పముల కిది యడ్డంకియనియెంచి నిరాకరించెను. పెక్కుమహిళావిద్యాలయములనేర్పరచి భారతరమణుల విద్యాభ్యాసమునకు గారకుడాయెను. ఈయనకుగల ముగ్వురుతనయలు విదుషీమణులు. దురదృష్టవశమున నీయనకుముందుగనే వారు మరణించిరి. అందు ముఖ్యముగా "ఇందుబాల" బెనర్జీనిర్వహించుచున్న పత్రికను స్వయముగా నిర్వహించుచుండెడిది.

స్త్రీవిద్యతో నాతడు సంతృప్తిజెందలేదు. హిందూదేశమున బాలవితంతువులపాట్లు కనుటకు, వినుటకు, నాయనకు దుర్భరముగానుండెను. తనకుటుంబములో నొకవితంతువు, కష్టములకుసహించలేక నాత్మహత్యగావించుకొనినసంగతి స్వయముగానెఱుగును. కాన నప్పటినుండియు హిందూబాలవితంతువుల వైధవ్యమును నిర్మూలించి వారి పునర్వివాహప్రాప్తికి సమకట్టెను. తొలుత తనమేనగోడలికి పునర్వివాహముకేసి, తాను ప్రథమకళత్రమును గోల్పోయినతరువాత నాతడే విద్యావతియైనవితంతువును వివాహముజేసికొని సంఘసంస్కరణమును క్రియారూపమున నాచరించెను. ఈవిషయములో బెనర్జీ యనుభవించినకష్టములు వర్ణనాతీత

ములు, భరింపశక్యముకానివి. తనజీవితములో నాతడు సుమారు ముప్పది విధవావివాహములజేసెను. అట్లు కొంతకాలమునకు బెనర్జీగృహము వితంతుశరణాలయముగామారినదనిన నతిశయోక్తికానేరదు.

బెనర్జీ గ్రుడ్డినమ్మకములనన్నిటిని ద్రోసి, పూర్వాచారములకు వర్ణాయాచారమును రూపుమాపుటలో కొంతవరకు జయమునుబొందెను. దేవునియందు భక్తి యమితముగానుండుటచేతనే యాతనికంతటను జయ మెందెను.

పందొమ్మిదవశతాబ్దమంతమువరకు వంగదేశములో, దురభ్యాసములలో నగ్రస్థానమువహించిన త్రాగుడధికముగానుండెను. హీనదశకువచ్చుచున్న తమదేశగౌరవముగాపాడనెంచి యప్పటినాయకులలో ముఖ్యులగు కేషబ్‌చంద్రసేన్ మొదలగువారు మితపానసంఘమునుస్థాపించి పనిచేయుచుండగా బెనర్జీకూడ నాపనిలో భాగమునుబంచికొనెను. అచిరకాలముననే యితడాసంఘకార్యదర్శిగా నియమింపబడెను. పత్రికలలో త్రాగుడు-నష్టములగూర్చి వ్యాసములవ్రాసియు, మంచివ్యాసములవ్రాసి ప్రకటించినవారికి బహుమానములొసంగియు, మితపానోద్యమకార్యక్రమమును సంపూర్తిగావించి భారతదేశమునందును, ఇంగ్లండునందును మెప్పువడసెను.

1866-వ సంవత్సరమునుండియు వరుసగ వంగదేశములో కరవులు, గాలివానలు, మహావ్యాధులు బయలుదేరి ప్రజలను నాశనమొనర్చునపుడు బెనర్జీ స్వకీయశరీరము నేమరచి, కష్టసుఖములనారయక బీదవారికిని, గాలివానలవలన నష్టమునుబొందినవారికిని వ్యాధులవలన పీడితులగుచున్నవారికిని యుచితరీతిని, తనసంఘముతోగూడ వెడలి సాహాయ్యమునుజేసెను.

తనగృహమునుగురించిచెప్ప నవసరమేలేదు. మగ, యాడుయను వ్యత్యాసములేక వారివారికితగినవిద్య నభ్యసింపజేయుచుండెను. ఆడుబిడ్డలకు నాంగ్లభాషాపరిచయమునుగల్పించెను. తనబిడ్డలు దేశసేవాధురంధరులగుటయే యాతనికోరిక. నిత్యము గృహమునందు శాంతము, సంతోషము, సౌఖ్యము, నిరాడంబరమును గాపురముచేయుచుండెను.

విశ్వమానవసమాదరణమే యాతనిమతము. ఈమతప్రచారణమునకై యాతడు "దేవాలయ" మనునొక ప్రార్థనమందిరమును కలకత్తాలో 1908 లో స్థాపించెను. ఆస్థాపనార్థమై కారన్‌వాలిస్‌వీథిలోనున్న 210/3/2 నెంబరుగల స్వగృహమును దేవాలయమునకిచ్చివేసెను. అన్నిమతములవారును దీనియందు సభ్యులుగా జేరియుండిరి,

వీరికుమార్తెలలో నొకయామెను, బొంబాయియాంధ్రులకు నాయకుడై పేరెన్నికగని, ఇంజనీయరుపని చేసి స్వర్గస్థులైన గంటి లక్ష్మీనరసింహముపంతులుగారు వివాహముజేసికొనిరి.

శ్రీశశిపదబెనర్జీగారిసేవలనుజూచి శ్రీవిక్టోరియామహారాణికూడ హర్షించెను. అట్టి బెనర్జీగారి యుత్కృష్టనామము ఘనులగు పెద్దలనామధేయములతోబాటు చిరస్మణీయముగా నీవసుధను వెలయును.

## ప్రకృతి

శ్రీమతి పాకల చంద్రకాంతామణిగారు

కరుణావిదూరులౌ నరహంతకుల కీజ
గంబెల్ల నిబిడాంధకారమయము!
మధురవాగ్ధనులైన పృథుకవీంద్రుల కీవి
శాలవిశ్వము సుధాసాగరంబు!
రాగశూన్యంబౌ విరాగిలోకమున కీ
ప్రకృతి మిథ్యామనోభ్రాంతియుతము!
స్వైరసంచారశృంగారవర్తనుల కీ
సకలంబు ముత్యాలచంద్రశాల!
శ్రీగుణోన్నతనిశ్చలచిత్తవృత్తి
జగన్నాథు దర్శనం బాత్మగోరు
అకలుషాత్ములైన భక్తాగ్రణులకు
సకలబ్రహ్మాండగోళ మీశ్వరమయంబు.

# ధీర

కాశిరాజు రామమోహనశర్మగారు

౧

వీరస్వర్గమలంకరించిన
వీరవరుఁడగు యోధుశవమును
వీరులందరు తెచ్చియిచ్చిరి
వీరపతియగుధీరకున్.

౨

అట్టెనిలువంబడియెమానిని
కట్టెయైనిస్తబ్ధయగుచును
చుట్టునుండినవారికెల్లను
పట్టుమనియాశ్చర్యమొదవన్.

౩

"ప్రాణమేనియునిచ్చుమిత్రుడు
వీనిబోలినవారుగలరెట?"
నానుడువుచును పొగడిరందరు
కాని యాస్త్రీ కదలకుండెన్.

౪

శవముపై ముసుఁగువైచిన
ధవళవస్త్రముదీసివైచిన
ను, వనితకదలదు, ఏడ్వదెంత
యు, వణకుచునునిలుచుండెన్.

౫

ముద్దులొలికెడియామెతనయుడు
గ్రద్దనను పరువిడుచువచ్చియు
యుద్ధమునచనినట్టిజనకుని
యాయుధంబులచేగొనెన్.

౬

"వైరివరులనుచెండివచ్చెద
భూరియశమునుగూర్చెదను మన
భారతాంబిక" కనుచుబాలుఁడు
ధీరయగుతల్లితోననెన్.

౭

చేతులల్లనచాచిబాలుని
పూతచరితునికౌఁగలింపఁగ
నాతరుణినేత్రద్వయంబుల
జల్లుమనియశ్రువులురాలెన్.

౮

"అవిగొరమ్మనిపిలుచుచున్న
కవియబొమ్మాశత్రుసేనల
భావికాలపుస్వాతంత్ర్యభారము
నీపై నగలదోయీ!

౯

పోయిరమ్మిక వీరబాలుఁడ!
పోయిరమ్మిక జయముఁగాంచుమ
పోయిరమ్మిక పోయిరావో
యీ!" యనుచు దీవించిపంపెన్.

౧౦

సమసిపోయెను వీరబాలుఁడు
సమసిపోయెను ధీరమాతయు
సమసిపోయిన వారిచరితము
సమసిపోయెనె నేటికిన్.

౧౧

ఆపత్సమయాలనైనను చపలచిత్తులుకానిధీరులు, న
చపలులగుయువతు లుంటనె భారతావని ధన్యయయ్యెన్.

## ఫ్లోరెన్సు నైటింగేలుకన్య

ప్రొఫెసరు యం. వి. మూర్తిరాజుగారు

1820 లో ఇటలీదేశమునందున్న ఫ్లోరెన్సుపట్టణములో నైటింగేలుకన్య యొకగౌరవకుటుంబములో జన్మించెను. ఈమె యింగ్లాండుదేశములో డర్బీషైరునందున్న లీహర్స్టుగ్రామములో తనతండ్రియొస్టేటులో పెరిగి పెద్దదాయెను. ఆమెచిన్నతనమునందే యొకనాడొకగొల్లవానికుక్క కాలువిరుగగా కట్టుగట్టుటలో, డాక్టరునకుచేదోడుగానుండి సహాయముచేసెను. ఆమె హృదయ మత్యంతదయతోగూడుకొన్నదై పరోపకారమునందే కాలముబుచ్చుచుండెను. నైటింగేలుకన్యకు 18 సంవత్సరములయీడువచ్చినప్పుడు శ్రీవిక్టోరియా రాణీగారికి పరిచయముచేయబడెను. ఆమెయుదారస్వభావమునకుతోడు మిక్కిలి సౌందర్యవతియగుట బంగారునకు సువాసనయబ్బినట్లుండెను. ఆమెనిరంతరమును గొప్పగొప్పవారితోనె మెలగుచుండెడిది. అందుచే నామె వివాహమునుజేసికొనసంకల్పించియున్నయెడల నెవ్వనినోనొక్కగొప్పవానినే పరిణయముజేసికొనియుండెడిది. కాని యామెహృదయమంతయును ప్రజాసేవకై వినియోగింపనిశ్చయించుకొని యాసుపత్రులనుగూర్చి తెలిసికొన మొదలిడెను. ఆమెవసించుచున్నభవనము మహావైభవముతో గూడియుండినదైనప్పటికిని యామెకదిరుచింపక ప్రజాసేవయందేనిమగ్నయై స్విట్జర్లాండుదేశములోనున్న రైన్ నదీప్రాంతములందున్న ఆసుపత్రులకును, ప్యారీస్‌పట్టణములోనున్న యాసుపత్రులకును దాదిగాపనిజేయుటకై వెళ్ళెను. ఆకాలములో పెద్దకుటుంబములలోని స్త్రీలు దాదులుగాపనిజేయుట మిక్కిలి విపరీతాచారమును లోకవిరుద్ధముగనుండెను. ఆమెకు 34 సంవత్సరములయీడువచ్చుసరికి తిరిగి యింగ్లాండుదేశమునకువచ్చి రోగులకు చికిత్సాలయమును నూతనపద్ధతులపైనిర్మించిన కొలదికాలములోనే పెద్దపెద్దవైద్యులకేగాక తదితరులకుగూడ నైటింగేలుయొక్క దయాస్వభావము వెల్లడియాయెను. ఇంతలో 1854 లో నల్లసముద్రమునకు ఉత్తరభాగమున క్రిమిన్ యుద్ధము ప్రారంభమాయెను. ఆయుద్ధములో రష్యావారితోపోరాడుచున్న టర్కీవారిసహాయమునకై యాంగ్లేయులు తమసేననొకదానినిబంపియుండిరి. అచ్చట యింగ్లీషువారిసేనలు జ్వరాదిబాధలచేతను, గాయములచేతను మిక్కిలిబాధపడుచున్నారని యీమెకు తెలియగానే తాను దాదిగాపనిజేయుదునని గవర్నమెంటువారికి తెలియజేసెను. అనుమతినిబడసినవెంటనే 37మందిదాదులను సమకూర్చుకొని యోడపైనెక్కి స్కూటరీ రేవునకుచేరెను. ఇంగ్లీషువారియుద్ధచరిత్రలోచదువదగిన ముఖ్యవిషయములలో నైటింగేలుచరిత్ర విడువదగినది కాదు. నైటింగేలుకన్య 37 మందిదాదులతోకలసి యుద్ధస్థలమునకు వెళ్ళునప్పటికి యద్భుతధైర్యశాలురును, వివేకవంతులునుఅగు పెక్కుమందియాంగ్లేయులు యీగలవలె లెక్కకుమిక్కిలి చనిపోవుచుండిరి. ఇదియంతయుమజూచి నైటింగేలు మిక్కిలి విచారమొంది యపారపరిచారమునుజేయ మొదలిడి యచిరకాలములోనే మరణసంఖ్యను తగ్గునట్లుజేయగల్గెను. ఆమెకష్టసుఖములకు లెక్కజేయక నిరంతరకార్యనిమగ్నురాలైనందున జ్వరపీడితురాలాయెను. కాని యామెయుత్సాహమునువీడక యుద్ధసైనికుల గాయములకుమందువేయుట, కట్లుగట్టుట, యౌషధములొసంగుటమాత్రము యథావిధిగ నేజరుపుచుండెను. పగటిపూట ఎంతశ్రమపడియుండి యుపచారములుచేసియుండినప్పటికిని బద్ధకించక రాత్రులయందొకదీపమును చేతనుంచుకొని రోగుల మంచములవద్దకువెళ్ళి చిరునగవుతో వారినిపలుకరించి సంతృప్తికరమగుమాటలను జెప్పి వారినోదార్చుటమాత్రము మరచెడిదికాదు. రోగు లందరు నామెను మాతృభావమున యపారమైనప్రేమతో జూచుచుండెడివారు. ఉత్తమగుణములనెవరు దాచగలరు? నైటింగేలుకన్యయొక్కసుగుణములన్నియు లోకమున నలుదెసలవ్యాపించెను. 1855 లో యుద్ధముముగియగానే నైటింగేలుకన్యను యింగ్లాండుతీసుకొనివచ్చుటకై యింగ్లీషువారొక నావనుపంపించిరి. కాని యామె యెవ్వరికిని తెలియకుండనే ఫ్రెంచివారియోడలో నెక్కి యింగ్లాండుచేరెను.

నైటింగేలు చేసిన యపూర్వమైన సేవకు చందాలమూలముగా ధనములుజేసి 7 లక్షలరూపాయిల నామెకు బహూకరించిరి. ఆద్రవ్యమును తానుగైకొనక "నైటింగేలుహోము" అను దాదులశాలను నెలకొల్పుటకై వినియోగించెను. ఆహా! యెంతటియుదారస్వభావురాలో తిలకింపుడు! ఆమెయొనర్చిన నిరంతర సేవవలన నారోగ్యము చెడినప్పటికిని యామె 90 సంవత్సరములవయస్సువచ్చువరకును జీవించెను. జబ్బుతో బాధపడుచుండినప్పటికిని ఆసుపత్రులయొక్క విధానములను, అందుపనిజేయువా రాచరించవలసినధర్మములనుగురించి పెక్కు ప్రఖ్యాత గ్రంథముల వ్రాసి మెరచించి వైద్యలోకమునకు మహోపకార మొనర్చెను. ఈమె శరీరశాస్త్రమునుగురించియు, యారోగ్యశాస్త్రమునుగురించియు మిక్కిలి శ్రద్ధనుజూపుచు సాధ్యమైనంత శాస్త్రపరిశ్రమనుజేసి విశేషజ్ఞానమునుసంపాదించి లోకమున కత్యంతోపకారమును గావించెను. పరిశుద్ధమైనగాలిపీల్చుటయందును, మురికిలేని వస్త్రములనుధరించుటయందును, రుచియే ప్రధానముగాక బలముతోగూడిన యాహారమును భుజించుటయందును, నియమితకాలము ననుసరించుటయందును మిక్కిలి శ్రద్ధనుజూపి తానట్లాచరించుటయేగాక లోకమునకు కర్మపాఠమును బోధించెను. ప్రతిమనుజుడును నైవిషయములందు జాగ్రత్తజూపవలెనని యామె యాశించుచుండెను. 1832 లో నామెకు 72 సంవత్సరముల వయస్సువచ్చియుండినప్పటికిని తాను ముదుసలి నైతిననితలంచక యారోగ్యాభివృద్ధివిషయములో బక్కింఘ్హాముషైరులో సామాన్యజనులకుసైతము తెలియుటకై, పరిశుద్ధమైన ఆహారపానీయములనుగురించియు, గాలిపీల్చుకొనువిధానమునుగురించియు, మురుగుకాలువల యేర్పాటులనుగురించియు పెక్కు విషయములను బోధించెను. 1907 లో జర్మనుచక్రవర్తి మున్నన్నదును స్త్రీలకొసంగనట్టియు, బ్రిటను దేశములో 24 గురికంటె యెక్కువమందిపొందుటకు వీలులేనట్టియు గౌరవచిహ్నమును నైటింగేలుకన్యకొసంగెను. 1908 లో "ఫ్రీడమ్ ఆఫ్ ది సిటీ ఆఫ్ లండన్" అను యోగ్యతకు గూడ పాత్రురాలాయెను. 1910 ఆగస్టు 13 తేదీనాటికి కామెకు 90 సంవత్సరములునిండెను. అపుడే యామె యీశరీరమునుచాలించెను. లండన్ పట్టణములో వాటర్లూఅనుచోట నైటింగేలుదివ్యవిగ్రహమును శాశ్వతముగానుండునట్లునిర్మించిరి. ప్రస్తుతప్రపంచమున నాగరిక దేశములలో దాదుల కేమైన గొప్పమర్యాదయొసంగబడుచున్నచో నదియంతయును నైటింగేలుకన్యయొనర్చిన సేవ, యద్భుతప్రబోధమేననియనుట కానంతయును సందేహములేదు. ఈమె పవిత్రనామము చిరస్మరణీయము. స్త్రీలకు దయ, జాలి, ప్రేమ సహజస్వరూపములని యనేకవ్యక్తులజీవితములవలన విదితమగుచున్నది. అందుచే స్త్రీలే దాదులుగానుండిపనిజేయుట లోకసుఖదాయకము.

## వరలక్ష్మి

శ్రీమతి దామోజీపురపు లక్ష్మీనరసమ్మగారు

సీ. పరమపావనియగు పణతియరుంధతి
పతిభక్తిచే పరంజ్యోతి కాదె
లలనావతంసమైయలరు సుమతీదేవి
పతిభక్తిచే భానురాకనిలిపె
గ్రుడ్డిని చేపట్టి మును సుకన్యాదేవి
పతిభక్తిచే పరమసాధ్వికాదె
తరుణీమణిన్ ధరణితరియింపజేయుంగ
పతిభక్తియే పట్టుకొమ్మగాదె

గీ. అత్రిఋషిపత్నియౌ యనసూయదేవి
ముగుర మూర్తుల ముద్దు బిడ్డలుగజేసె
గాన భామామణికి పతిభక్తివలన
మోక్ష మరచేతిలోనిదై మెరయుగాదె.

తే.గీ. గృహమునకు దివ్యతేజస్వరూపియౌచు
హద్దు మీరక భర్త పాదములె నమ్మ
లలన తనదైన సత్ప్రభావంబున వర
లక్ష్మియగుచును భువిని వరలుగాదె.

# అత్తకుతగ్గకోడలు

శ్రీమతి లీలావతిగారు

౧

చేన్లుగారంటే కంభాంలో చాలాప్రఖ్యాతి. కంభాంఏమిటి,—'ఆంధ్రదేశంలో యింతటివాడులేడ'ని చేన్లుగారిపేరుచెప్పని మనిషిలేడు. పెద్దఘనాపాటి. పెద్దపెద్దశాస్త్రుల్ళవారు, కుండవాలవారు, అవధాన్ల వారు చేన్లుగారంటే చేతులుజోడించేవారు. ఇక, పంతులుగారు పదిగంటలకుఅధ్దికం తెమల్చాలంటే, సంకల్పంఆరంభించి, 'మమ' అనుకోమని, అగ్ని హోత్రాదిమంత్రాలలోని కొసామొదలు ముక్క లేకరవుపెట్టి, క్రియాభోగంసమయానుకూలంగామార్చే మహానీయులు; 'ఆత్మప్రదక్షిణనమస్కారాన్ సమర్పయామి, ధూప, దీప, నైవేద్యార్థం అక్షతాన్ సమర్పయామి' యనికల్పించి పూజావిధానం పాడుచేసేపండితులు చేన్లుగారంటే చెమట్లుకార్చుకునేవారు. 'యిల్లా'లని పిలిచేవారు చేన్లుగారు భార్యను. అనిష్ట, అమడి, అరడి— కేవలం చేన్లుగారికితగిన అర్ధాంగిఅని పించుకున్నదాయిల్లాలు. చేన్లుగారిసంతానంమాటో? పుత్రికాసంతానంలేకపోయినా యిద్దరు పుత్రులు మాత్రంపుట్టేరు — అయితేర్భుఎమ్చుతగ్గులో— అంతే. పెద్దబ్బాయిని తనంతటివాణ్ణిచేద్దామని వేదంలో ప్రవేశపెట్టేరు. కాలాన్నిఅనుసరించి ఆంగ్లభాషఅంటే ఆదేమిటో ఘనతఅనుకోని, అందులో ప్రవేశపెట్టేరు— చిన్నబ్బాయిని. చిన్నప్పు డేమిపేర్లుపెట్టేరోకాని, 'పెద్దా! చిన్నా!' అని పిలిచేవాడుక—చేన్లుగారిఅబ్బాయిల్ని. ప్రాయం ముదురుతుంటే, 'తరెండు కార్యాలు మనచేత్తోటిచేద్దామని వుద్దేశంవుంటుంది కదా ముసలివాళ్ళకి. చేన్లుగారుకూడా అపద్ధతిలోనే పూర్వాచారాన్నిఅనుసరించే, తనకొడుకులిద్దరికీ కార్యాలుచేసేరు. పెద్దకోడలు భ్రమరం కిందాం కుండవాలశాస్త్రులవారికూతురు. చిన్నకోడలు ముత్తు పాలకొండ పంతులుగారిఅమ్మాయి.

అంతా బాగా జేవ్వుంది. మర్యాదో? అంతా నెత్తిని పెట్టుకునేవారు. సంపత్తా?—ఇద్దరుకొడుకులున్నారు మాణిక్యాలలాగ. పెళ్ళిళ్ళుగూడాఅయేయి. కాని ఒక్కటేకొదవ. తానైతేనేమి, పిల్లలైతేనేమి—ఇంటి దగ్గర భోజనంచెయ్యకూడదు. అదీ యిల్లాలుగారిఅభి ప్రాయం. దేశ దేశాలు తిరిగి ఆర్జించినసొమ్మంతా ఇంట్లోపడవెయ్యడమే చేన్లుగారివంతు. ఆ తెలుపు నాణ్యాన్ని పచ్చగామార్చి శరీరంమీద దాచుకోవడం యిల్లాలుపని. ఇలాగ ఆయిల్లాలుజెండా మహోన్నైభవంగా ఎగురుతోంది. చేన్లుగారికి యిదోకష్టంగా తోచలేదుకూడాను. తనపెద్దబ్బాయిని వెంటవేసు కుని దేశసంచారమే అలవాటైంది—అదే 'హాయి' అని పించింది. చిన్నబ్బాయికిమాత్రం చింతాకుపచ్చడీ, అన్నం—ఆయిల్లాలుతోపాటు—ఆంగ్లం చదవడంచేత అడుగుకదల్పడానికివీలులేక; నాఖుకీగట్రావుంటేనా? కాలచక్రం తిరిగిపోతుంది.

౨

ఇంతట్లో భ్రమరం పెద్దమనిషిఅయినట్టుకబురు. శాస్త్రోక్తంగా చేన్లుగారు కిందాంలోనే శుభకార్యం జరిపించేరు. అష్టైశ్వర్యవధిలేకుండా అబ్బాయికంటే ముందు అత్తగారే కోడల్ని కాపరానికి తీసుకు వచ్చేరు. అప్పటినుండి పెద్దబ్బాయి యింటిపద్దవుండ వల్సివచ్చింది—అపుడపుడు దేశాంతరం వెళ్ళినా. కొత్తలో సవ్యంగానే వెళ్ళింది—కొన్నాళ్ళు. అత్త గారికి బద్ధకంపుట్టింది. వనంతాకోడల్లే. వయస్సులో వున్నపిల్ల—అభోజనం సరిపడేదికాదు. క్రమంగా వ్యాపారంముదిరింది. 'కోడలుచేసేపనులకి కడాకూ తప్పులే' అనేమాట నిజమైంది. అపోటీలు—కొడుకు చేతకొట్టించడం—ఆఖరికి అత్తగారే చేయిచేసుకోవ డం అలవాటులోకిదిగింది.

* * * *

ఆనాడు అట్లతద్ది. అత్తగారు అవతలవున్నారు. చేన్లుగారు, అబ్బాయిలు చేనులోకివెళ్ళేరు. కోడ లుకి చిన్నకోరికపుట్టింది—అట్లు చేసుకుతిందామని. రహస్యంగా పనిసాగించడానికి ప్రారంభించింది భ్రమ రం. అట్లుపోస్తున్నట్లు అకట్టేరుఅత్తగారు. దారాలు తీసేరు. కూపీ పైకిలాగేరు. ముట్టుకోడానికి వీలులేక

గాని, కొట్టినంతపని చేసేరు. ఇటేడు, ఆటేడుతరాల వార్ని సొగతీసి చమకపారాయణ చేసేరు. భ్రమరం ధుమధుమలాడుతూ లోపలికినడిచింది. పెరడులో పెద్దశబ్దం చేసింది.

మట్టమధ్యాహ్నం. చేన్లుగారువగ్గిరా చేరుకున్నారు. పొద్దెక్కినందుకు మహావేగంతో నూతిదగ్గరకువెళ్ళేరు-స్నానంచేయడానికి చేన్లుగారు. పరాకుగా చేదనూతిలోదింపేరు. చేదకు ఏదో తగిలింది. తొంగిచూచేరు. 'శవమ్రో!' అన్నారుధాటీగా. నలుగురుమూగేరు. 'ఎవరిదీ?' 'భ్రమరం! భ్రమరం!!' 'ఏందారి?'... 'అత్తగారిప్రభావం'అనుకున్నారు అంతాను. క్షణంలో పోలీసువారుప్రత్యక్షం. చేన్లుగారి గుండెలుచెదరేయి. గబగబలు-లబలబలు-గుసగుసలు-ఆఖరుకి నూతులోపడడానికికారణం: బలవంతం కాదనీ, ఆమెకు మూర్ఛజబ్బువుందనీ, నీళ్ళలోడుతుండగా ఆజబ్బువచ్చిందనీ, ఏదోవ్రాసుకుని (పదిరాళ్ళు తడుముకొని) పైకిసాగేరు పోలీసువారు.

## 3

సందట్లోసందడి. ముత్తుకూడా రజస్వలాఅయినట్లు కబురు. రివాజుప్రకారం చేన్లుగారు పాలకొండ వెళ్ళేరు-కార్యంచెయ్యడానికి. (కుటుంబంతోటే) ఆమూడురాత్రిళ్ళుగడచేయి. కోడల్ని పంపమన్నారు. పౌరజయినవెంటనే కోడల్నిపంపడం ఆనవాయితీ కాదని, ఆతర్వాత అత్తారుపిలిచినప్పుడుపంపడం వారికి ఆచారమనీఅన్నారు పంతులుగారు. చేన్లుగారు ధర్మానికి కట్టుబడ్డారు-యిల్లాలికి యిష్టంలేకపోయినా.

* * * *

భ్రమరం హఠాత్తుగామరణించడానికి కారణాలు మెల్లిమెల్లిగా పంతులుగారిచెవిలోపడ్డాయి. క్రమక్రమంగా ముత్తుని కాపురానికిపంపమని వుత్తరంమీద వుత్తరం వస్తున్నాయి. ఇక్కడవచ్చిందిచిక్కు. ఇల్లాలు గుణాలుచూస్తేభయం. కూతుర్ని కడకాలం ఆమె చేతిలో పడవెయ్యాలి. పంతులుగారూ భార్యా బాగావిమర్శించేరు. ఏది ఎలాగయినాసరే, ముత్తుని ఆయిల్లాలుబ్రతికివుండగా పంపదలుచుకోలేదు. ఏవుత్తరానికీ జవాబుకూడావెయ్యలేదు. ముత్తుకిమాత్రం యిబ్బందిగావుండేది.

* * * *

ఒకనాడు అల్లుడేఅవతరించేడు అత్తారింట. జరగవలిసినమర్యాద లన్నీజరిగేయి. మధ్యాహ్నం మూడు గంటలకి తీరుబడిగా అల్లుడు వుపక్రమించేడు-పిల్లని పంపమంటూ.

పంతులుగారు రిలాప్రారంభించేరు.—

'ఇదుగో! నేనొక్కటిచెబుతానువిను. నువ్వేదో చదువుకున్నావు. నౌఖరీప్రయత్నంచేసుకో. ఎక్కడైనావుద్యోగంఅయితే అక్కడ హాయిగా మీరిద్దరూ వుండవచ్చును. కావలిస్తే అందాకా యిక్కడేవుండు. ఇక, మీయింటికి.........'

అని ఇంకాఏమిటోచెబుతుండగా, 'అయ్యో! అయ్యో! మీమాటలే వినవండి! రండీ! రండీ!!' అనే కేకలు వినబడ్డాయి. ఇద్దరూపరుగెత్తేరు యింట్లోకి. 'ఏం? ఏంవచ్చిందేమిటి?' అన్నారు పంతులుగారు. 'అమ్మాయికి తేలుకరిచింది. మంత్రం-అబ్బా ఎక్కడమ్మా! గుడ్డకట్టనా? అయ్యో! మందు!' అని కంగారు.

'ఉండమ్మా! డాక్టరునితీసుకువస్తాను.'

'నాన్నా! నువ్వుండు' అందిముత్తు కళ్ళుతెరచేసి.

'నేవెళతానండి, అయ్యరుగారికేకదూ! నాకుతెలుసును' అంటూ పరుగెత్తేడు అల్లుడు.

అల్లుడు అవతలకివెళ్ళగానే ముత్తుబాధంతా పోయింది. 'మీకేమీ తెలియదునుమండీ! ఆఅబ్బాయితో వాళ్ళింటిపోగొట్టా ఎందుకుఎత్తపోయేరు? అయినా ఆడపిల్లనిక నుక్కున్నవాళ్ళం, మనకి మంచి పట్టుకూడునా? అడగ్గానే పంపకపోతే అతడేమి అనుకుంటాడో? నాకునచ్చదునుమండీ!' అన్నాది అతని భార్య. 'నాన్నా! నాభాగ్యానికి ఎవరుకర్తలు? నావంటివాళ్ళకెందరికి కిలాంటిఅత్తలున్నారో? నాలో వుందిఅంతాను' అందిముత్తు ముద్దుగా. 'అయితే మీయిష్టం. అయినా జాగ్రత్తసుమా!' అన్నాడుఅతను.

ఇంతలో అయ్యరుగారూ అల్లుడూ చేరుకున్నారు.

'పాపం! కంగారులో మీకు శ్రమయిచ్చేం. యీ ప్రక్కాయన మంత్రంవేసేడు. బాధతగ్గింది. క్షమించాలి.'

'మనకుకావలసింది అదేకదండీ! అయినా పథ్యంగా వుండండి' అంటూ, 'ఏ మోయ్! తెలిసిందా?' అన్నారు అయ్యరుగారు—అల్లుడువైపుచూసి.

'చిత్తం! చిత్తం!' అంటూ అయ్యరుగార్ని అవతలకుసాగనంపి అంతా ఇంట్లోకిచేరుకున్నారు.

* * * *

మర్నాడు. 'అయితే, ఏమిటాలోచించేరు?' అన్నాడు అల్లుడు.

'నీయిష్టం. మేంచెప్పవల్సినమాటచెప్పేం.'

అల్లుడు ఆలోచించి 'తప్పదు.'

'అయితేసరే.'

'రేపు మంచిరోజట!'

'అలాగేకానీ నాయనా!'

* * * *

అమర్నాడు బండి వాకట్లోనిలబడింది. జరగవలసినలాంఛనాలన్నీ జరిగేయి. తల్లితో పాటు తండ్రికూడా కంటతడిపెట్టేడు. వీళ్ళనిచూచి ముత్తుకూడా రెండునీళ్ళచుక్కలుకార్చుతూ బండిఎక్కింది. బండి ఆవీథిదాటిందాకా దిగబెట్టి, 'జాగ్రత్తనుమా!' అంటూ ఇంటివైపుమళ్ళేరు ఆదంపతులు.

* * * *

'క్రొత్తప్రియం, వేడిరుచి' అంటారుపెద్దలు. ముత్తుకూడా అత్తారికిక్రొత్తే. అందుకుతగ్గట్టుగా ప్రవర్తించేదికూడాను. పైగా పట్టణవాసంపిల్ల. నవనాగరికతగలనారి. చేన్లుగారికి, యిల్లాలుకి, అన్నదమ్ములిద్దరికీ అనవచాకిరీచేసేది. అందులోనూ అత్తగారిమెప్పు పొందుదామని ప్రయత్నం. తనతోటికోడలుకీ అత్తగారికీ ఎక్కడపడేదికాదో అవన్నీ తప్పించుకునేది. ఇలా కాలక్షేపంచేయడంమొదలుపెట్టింది ముత్తు—తప్పుకి సందులేకుండా.

భ్రమరానికి యిల్లాలే అత్తగారైందికాని, ముత్తుకి ఊరల్లా అత్తగార్లే—ఆక్షేపించడంలో. అసలుపల్లెటూరు. ఆరుమూళ్ళముతుకపంచ ముణుకుమోకాళ్ళ దిగకుండ కచ్చకట్టి, ప్రతీరోజూ స్నానంచేసి, పట్టెడు పసుపుకుంకం పెట్టుకునేముత్తయిదువలకు, పాదంములిగిందాకాకట్టే అగూడారుకచ్చా, అసబ్బురుద్దుకోవడం—అవంకపాపిడా—వ్యగ్రతగకనుపించేది. అందరూ ఆక్షేపించేవారు. అందరితో పాటు అత్తగారు కూడాను. ఆఆక్షేపణే అసూయలోకిదిగింది.

* * * *

కొంతకాలమయినపిదప.

'ఈసాయంత్రం నువ్వూ మాఅమ్మా వాదించుకున్నారట! ఏం?'

'మీఅమ్మ చెప్పేవుంటారు.'

'నీవు చెప్పకూడదా?'

'నేచెప్పేదేమిటి. ఆవిడచెప్పిందల్లా వేదవదమే కదూ!'

'మనసిచ్చిమాట్లాడవుసుమా!'

'అవును. అందుకే మా వాళ్ళు పంపదలచుకోక పోయినా, 'తేలు' అని వేషంవేసి, పంపమనిపట్టుపట్టేను. మొగవాళ్ళకి మాటనిలకడలేదంటారు—యిందుకే.'

'అసలు ఏంజరిగిందోచెప్పవేం' అన్నాడు చిన్నబ్బాయి చికాకుతో.

'అసలేంవుంది? ధాన్యపుగింజలో బియ్యపుగింజ. నిన్నసాయంత్రం చెయ్యిజిడ్డయిందని సబ్బేసికడుక్కున్నాను. అదుగో! అదీ నావల్లవచ్చినఅపరాధం. అందుకు అరవై ఆరు వర్ణించుకున్నారు.'

'నువ్వేంటీఅన్నావు.'

'మీసొమ్మేంపెట్టలేదుగద!' అన్నాను.

'ఊరుకోకూడదూ!'

'బాగుందండిమీవరస. అయినదానికీ కానిదానికీ ఆడిపోస్తుంటే, ఎలావూరుకోడం? అక్కడికీ వోర్చివున్నాను. మా వాళ్ళని అంటే దుఃఖంఅపుకోలేక, వాళ్ళవూసు ఎత్తవద్దన్నాను. అయినా, మీరేంకొన్నారా? చేశారా? నేను కాపురానికివచ్చినదగ్గరనుండీ ఒక్కచిల్లిగవ్వ నాగురుంచి మీరుఖర్చుపెట్టలేదు. బట్టలు మావాళ్ళేకొంటున్నారు నాకూమీకూ కూడాను.'

'కొన్నాళ్ళు నిమ్మకాదనుకొని ఆగకూడదా?'

'చాల్లెండి! మెమ్మెఅంటే జోజోఅన్నట్టుగవుంది. ఏదో కాస్త వుద్యోగం సంపాదించకూడదా! హాయిగా బ్రతుకుదాం–దర్బారట్లు లేకుండా.'

'పిచ్చిదానా! నేనేంవూరుకున్నానా? ఆప్రయత్నంలో నేవున్నాను. వుద్యోగం ధరఖాస్తులకి దస్తాకాగితాలు తగలేసేను. కాళీవున్నాదన్నచోటల్లా ఒక్కొక్క కాగితం జారవిడిచేను. దానిసత్యంకోసం పడరానిపాట్లుపడుతున్నాను. ఈజిల్లాలో నేను చూడని అధికారిలేడు. అయితేనేం, నిండా బి.ఏలు, సంగోరుబిడ్డోలు, పదిరూపాయిల నౌకరీకోసం ప్రాకులాడేరోజుల్లో, పాతికమంది దన్నుండి మహాపురుషులు ప్రయత్నాలుచేస్తుండేరోజుల్లో, వందలకు వందలు పాదపూజలు చెల్లించే యీవిమంతులున్నరోజుల్లో, నాకు వుద్యోగంయిచ్చేవారుఎవరు? అయినా ప్రయత్నాలుమానలేదు. కాలంకర్మంకూడి రావాలి. అందాకా పౌరుషాన్ని చంపుకో.'

'కాని, పోటుకుమాటలుఅంటే వూరుకోలేనుసుమండీ! మీకుకోపంవస్తే రానీండికాని.'

'నాకు కోపమేమిటి?'

'అయితే ఆప్రాసంఎత్తకండి.'

'ఏమోమీయిష్టం.'

'అలా పరస్పరంగావూరుకోండి.'

'మాటతెచ్చేవంటేచూడు.'

'అలాఅన్నారు బాగుంది.'

* * * *

మరికొన్నాళ్ళకి. తొలిజాముదాటి మలిజాముప్రవేశించింది. చేన్లుగారూ పెద్దబ్బాయీ వూళ్ళోలేరు. చిన్నబ్బాయిభోంచేసి వీథిలోకివెళ్ళేడు. ఆనాడు అత్తగారిదేవంట. కోడలు వంట్లో సుస్తిగావుంది. అత్తాకోడళ్ళిద్దరికీవడ్డించి, 'రా! అమ్మా! వడ్డించేను' అన్నారు అత్తగారు.

కోడలురావడం ఆలస్యమైంది.

'ఎక్కడా చూడలేదమ్మా! యీనూకరాలు! నేమంతాకనలేదా. వేగుళ్ళట. అది వుమ్మడంకాదు. నేంచెయ్యలేనమ్మా. ఎవరిమెప్పులబోళ్ళగాని' అని సణుగుతూ అత్తగారు భోజనానికికూరుచున్నారు.

'మిమ్మల్నిఎవరు చెయ్యమన్నారు. నా వద్దన నేనుచేసుకుంటానులెండి. చేసినన్నాళ్ళు చేయించుకునేవారేగాని మెచ్చేవాళ్ళేరీ? ఒక్కనాడుచెయ్యకపోతే అనేవాళ్ళేగాని' అంటూ ప్రవేశించిందిముత్తు.

'ఇదంతా నీవుచేసిపడిపోయిందే.'

'నేనుకాదు మీరే. అంటే తప్పటుందేమిటి–అవసరంపడ్డాక.'

'నోటికివచ్చినట్లుపేలక, కుక్కినపేనులా భోంచెయ్యి!'

'నావంట్లోబాగులేదు......నన్ననవద్దు.'

'మాటకుమాటా ఎదురు చెబితే వళ్ళుమండుకువస్తుందిసుమా! జాగ్రత్త!' అన్నారు అత్తగారు.

'అనవసరంగాఅంటే నాకు తలకిమ్మ' అందిముత్తు.

శ్రుతిమించింది. రాగానపడవలిసిందేకాని, ముత్తుకి కడుపులోత్రిప్పినట్లయింది. వమనమవుతుందేమోఅనుకొని పెరటిలోకివెళ్ళింది. లాభించలేదు. తలత్రిప్పూ, వళ్ళుత్రిప్పూ, తలనొప్పి–ఎక్కువయేయి. నిలబడ్డం కష్టంగా కనుపించింది. చెయ్యినోరుకడుగుకొని జోగుతుంటూ గదిలోకినడిచింది.

'ఏం! ఎక్కడికేమిటి?'

'తలనొప్పి......'

'అంట్లూరెంగిళ్ళ?'

మరి వినిపించుకోలేదుముత్తు. మంచం సమీపించింది. అత్తగారికి ఆగ్రహంఎక్కువైంది. వెంబడించేరు. 'నాకుతెలుసును–ఆతలనొప్పి ఆవేషాలునాదగ్గర పనికిరావు–ఎవడుచేస్తాడనుకున్నావు–యీచాకిరీ–నీ అబ్బ!' అన్నారు అత్తగారు.

'అబ్బ' అనేసరికల్లా ఎక్కడలేనిపౌరుషంవచ్చింది ముత్తుకి. నాలుగడుగులు ముందుకివచ్చింది–ఆరోషంలో. ఏమీఅనలేక వికారంగానవ్వింది. ఆనవ్వుతో అత్తగారిశరీరం బిడిపోయింది. చటాలున మీదికి వచ్చేరు పళ్ళుకొరుకుతూ–చెయిచేసుకుందామనే. ముత్తుకి ముచ్చెమటలుపోసేయి. శరీరంవడికిపోయింది కోపంచేత.

ఒక్కక్షణం. ఎత్తినఅత్తగారిచెయ్యి దిగుతూంది. తెప్పపాటుకాలం...తలుపుమూల చీపురుకట్టచూసింది ముత్తు. సంగ్రహించింది. 'ఊరుకుంటున్నకొద్దీ...' అంటూ రెండుతగలనిచ్చింది.

'అయ్యో! నీపాపాసంకూల!'
మరెండు...
'అబ్బా! చచ్చేను!'
ఒకటిమీదొకటి.
'నిక్కేమవనే! ప్రాణాలతోవిడిచిపెట్టేతల్లీ!'
జోరుతగ్గలేదు-వర్షం.

* * * *

ముత్తని అత్తగారుకొడుతున్నారని భ్రమపడి యిరుగుపొరుగులవారంతా చేరుకున్నారు. అంతా రావడంచూసిందిముత్తు. చేతిలో చీపురు జారవిడిచింది. వెర్రి వెర్రి చూపులు చూస్తూ, జాపోన్నూ 'అయ్యో! అబ్బా!' అంటూ మూలగడంప్రారంభించింది. నోరూరుకోబట్టక పదిమందీ పదివిధాల అత్తగార్ని ఆడిపోసేరు.

'ఆకోడల్ని అలాగేచేసేవు; నెలతప్పివుందాయెను, కోపంకోపంలావుండాలిగాని, అంతచేటుకొట్టడమా! నువ్వేమిటిసహెఆనుకోగాని, బాగు లేదు సుమా!' అన్నాదొకావిడ.

'అయ్యో! అయ్యో! మీగోలెవర్రామీది. అదే నన్నుకొట్టిందర్రా! చూడర్రాయీదెబ్బలు! వీపు ఠట్లు తేరింది!' అంటూ అత్తగారిగోల.

'ఓవిడా! వేషాలుసుమా! ఆబిడ శరీరంముడుతలు తేరివుంటుంది–ముసలిదిఅవడంచేత–ఏం వంగనా చమ్మా!'

'చాల్లేవో! మా మెమ్మ లంటావు! నేనెరగనా? ఆదేమిటి చీపురుదెబ్బలుకనబడుతుంటేను...రద్దాపోదాం.'

'కాని, నామనసుకునచ్చినపనిచేసింది...శేష... అత్తకుతగ్గకోడలు.'

కర్లపాలెం కృష్ణరావుగారు

# వీరనారి

"లంచమిచ్చెదననెడి యీవంచనేల?
ధనధనేతరమందిరోద్యానవనము
లతిమనోహరచీనిచీనాంబరములు
విలువమణులాదినగలును వేనవేలు
కొల్లలుగనుండె తమదయన్ కోట్లనిండ
కోరికొక్కటి, ఫలముచేకూర్చుటొకటి,
దానసంతృప్తినా కెట్లు గానబడును?
తావకమనోజ్ఞపదపద్మదాసురాలి
ముద్దుదీర్పుము, వేవేగ, మోహనాంగ!
శూరజనకంఠనిర్గతశోణితమ్ము
వరదలుగబారు భీభత్సవాటియందు,
ఘోరరాక్షసమూక, గగ్గోలుజేయు
కుటిలయాకారముల జుట్టుకొనుచుమిమ్ము
బలిమిబడవేయవచ్చెడి బాహుబలుడు,
ధూర్త, దుర్వార, దుస్తంత్రదుర్జనుండు,
నరకుడేగతినుండునో? మఱియు, దివ్య
ప్రవిమలలలితతేజప్రభావపూర్ణ
వదనులగు, మీరలేరీతి, కదనసీమ
ప్రళయకాలయమునిభాతి, పరునెదిరి, వ
క్షమ్ముజీల్చ శూరులై సమక్షముననిల్చి
రణమొనర్తురో? గాంచయారాటపడుచు
వేచుదాననుదీననై వివిధగతుల.
అబలలగునాకువారేడ? హాహాకార
బంధురంబగురణరంగప్రాంతములను
జూడగాంక్షింపు టెడ యీజాడననుచు
దలపబోకుడు, మీరునాదండనుండ,
అనితాంతకనంద్యశౌర్యావలోక
నమున, భీతిజెందకయె, యానందమునను,
శాత్రవానీకమారణసమయమందు
తోడుపడి మీకు పరులజెండాడుదాన,
ఘోరరణమందు శ్రమనొందకుండ తమకు
బాణతతినందజేయుచు బరిచరింతు
విజయలక్ష్మిని జేపట్టువేళనరసి
దివ్యహారతినిచ్చెద దేవదేవ!—"

—సత్యాదేవి.

# అత్తలతో వేగడమెల్లా?

శ్రీమతి “శాంభవి” గారు

['అత్తలేనికోడలు ఉత్తమురాలు, కోడలులేనిఅత్త గుణవంతురాలు' అనేసామెత లోకప్రసిద్ధముకదా! ఈఅత్తాకోడండ్రతగాదా యీనాటిదా? లక్ష్మీసరస్వతులకునమేతూ తప్పలేదు. ఇది మనకేకాదు. పాశ్చాత్యులకుకూడాకలదుసు! డిక్సుఅనే ఒకావిడ–తోటిఅమ్మలక్కలకు–అత్తలతో వేగడమెల్లా అనేసంగతినిగూర్చి–కొన్నిఉపాయాలుచెప్పిందిఅని ఒక ఇంగ్లీషుపేపరులోనుంచిచదివి వినిపించారు మావారు. అవి మనదేశానికి చాలావరకు సరిపోతాయి. కాబట్టి కొద్దిమార్పులవసరమైనవిచేసి యిక్కడ వ్రాస్తాను.]

“అత్తగారంటే నీకు గర్భశత్రువనీ-ఆమెనుచూడడముతోటే నీవు ద్వేషించితీరవలసినదే అనీ, ఆమెచేసేప్రతిపనీ-ఆడేప్రతిమాట అనుమానాస్పదమనితలంచవద్దు. ఆమెతో స్నేహాము చేయబోతున్నామని, ఆమెహృదయాన్ని ఆకర్షింపగలమని నిశ్చయించుకో.

నీభర్తకుగల మాతృభక్తిచంపి-వారిద్దరిని వేరుచేయడానికియత్నింపకు-నీభర్త తన తల్లి యోగక్షేమముకనుక్కున్నపుడెల్ల, నీమీద ప్రేమ విడిచిపెడుతున్నాడనియెంచకు. 'ఆమెతో నాతడు రహస్యముగామాట్లాడినపుడు, ఆమెకేదైనా మంచీచెడ్డాచూచినపుడు-నీవు కళ్ళల్లో నిప్పులుపోసుకోకు.

తల్లిఅనేది తనసర్వస్వముధారపోసి మరీ తనయుణ్ణినిర్మిస్తుంది-కాబట్టి ఆమెయెడ నాతని 'తీరగరానియప్పు.' అట్టిమాతృఋణము అతడు శక్తివంచనలేకుండా కొంతకుకొంతైనా తీర్చడానికి అర్ధాంగివైన నీవు సాయముచెయ్యాలి. కాబట్టి ఆమెవిషయమై తగుజాగ్రత్త తీసుకుండేటట్లు అతడిని నీవే ప్రోత్సహించు. ఆమెఒకవేళ అవసరంకొద్దీ గ్రామాంతరంలో నివసిస్తూంటే, సావకాశమున్నపుడెల్లా ఆమె నాతడువెళ్ళిచూచేటట్లుచూడు. నీవుకూడా అతనితోవెళ్ళి ఆమెక్షేమసమాచారములుకనుక్కో. కాని పలుమారు అతనినే వంటరిగా వెళ్ళనీయి. ఏమంటే, నీవుప్రక్కనుంటే ఆమెమనసులోవున్నకోర్కె పెదవితెరచిచెప్పడానికి వెరుస్తుంది. నీభర్త తనతల్లియందు భక్తితాత్పర్యాలతోవున్నాడని యీసడించుకోకు-అంత మాత్రముచేత నీపై నాతనిప్రేమ కేమీ లోటురాదు-అసలు రెంటికి సామ్యమేలేదు-ఒకటి తులసీదళము, మఱిఒకటి మాచిపత్రి. తుమ్మిపూవుఒకటి-మరొకటి మల్లిపూవు.

నీఅత్తగారు 'అల్లాకాదిల్లాగమ్మా' అని పూర్వకాలపుసలహాఏదో చెప్పడంతోటే మండిపడకు. ఆమెకు ఈకాలపు నవనాగరికపు తళుకుబెళుకులు, ఆటపాటలు, ఉడుపుల వైఖరులు, పాపటలపసందులు, నగలు, నాణ్యాలు-మొదలైనవన్ని తెలియవుగామరి. కాని ఆమెపిల్లలనుకనిపెంచి, నీలాంటివారిని, నీభర్తలాంటివాళ్ళని తయారుచేసింది అనేసంగతి మాత్రంగ్రహించు. ఆమె నీమాదిరి బంగాళపాకశాస్త్రము చదివిఉండకపోవచ్చు-లవంగాల తిరగబోతపెట్టలేకపోవచ్చు-కాని, అలవాటుచేత రసవర్గాలన్నీ చూచినట్లువేసి ఒకకూరే కాదు ఒకపిండివంటేకాదు తయారుచేస్తే, ఓ! నోటఊటలూరుతుంటే,-రొట్టవేసుకుంటూ తింటావుగదా! అన్నిటికన్నా, విలువైనముక్క మరొకటిచెప్తావిను. నీఅత్తగారిని నీతల్లివతుగా చూచుకో! నీతల్లితో, నీగుట్టుమట్టుఎలాచెప్పుకుంటావో అల్లాగే ఆమెతోచెప్పు. నీఆశలు-

ఊహలు ఆమెతో చెప్పు. నీకష్టసుఖాలు ఆమెదగ్గర మొరపెట్టుకో! ఆమెసలహాఅడుగు, ఆమె గ్రామాంతరంలో నివసిస్తుంటే ఆమెను పలుమారు యింటికిరమ్మని బ్రతిమాలు. ఆమెరావాలని నీవు ఆత్రముతోనున్నట్లుండు. కాని-ఆమె నట్టె నెత్తినమాత్రమెక్కించుకోక-కాస్త ఎడగానేఉంచు. అమెను పరాయిగానేచూస్తున్నావనేసంగతి ఆమెగ్రహించేట్టుమాత్రంచూచుకో. ఆమె నీకొంపకువచ్చినపుడు తానతిథిననీ-నీవు విధ్యుక్తధర్మంగా ఆమెనాదరిస్తున్నావని ఆమె అనుకుండేటట్లుమసులుకో! అట్టె మెత్తదనముచూపేవంటే నెత్తినెక్కి పిండికొట్తుంది. జాగ్రత సుమా! ఇల్లాఅన్నాగదాఅని ఆమెను కుటుంబములోనుంచితరిమేయకు. ఆమె ఆకుటుంబములోనే పడిఉండాలని ఎంతదేవులాడుతుంటుందో ఆలోచించుకో! అష్టకష్టాలుపడి-నీమగణ్ణి క్రిందపెడితే పిల్లి-పైనపెడితే పక్షి పట్టుకపోతుందేమోనని-అతిగారాబముతోపెంచి పెద్దవాణ్ణి చేసిఉంటుంది-అంతపెంచీ, నీచేతిలోపెట్టి నీళ్లువదులుకున్నానని ఆవిడయేడిస్తే ఆఉసురు నీకు కొట్టకమానదు. అది నీకు, నీపిల్లలకు శ్రేయస్కరముకాదు.

నీభర్తఅనుకూలుడై, నీవు స్వాధీనపతికవైనపుడు, అతను సౌకుమార్యము, సత్యనిరతి, దయాదాక్షిణ్యాలుకలవాడైతే, అల్లాంటిభర్తను ప్రసాదించినందులకు ఆమెకెల్లప్పుడు కృతజ్ఞురాలవై ఉండాలనాలేదా? వీలుంటేమాత్రము అత్తగారితో కాపురముచెయ్యకుండా తప్పించుకో!దూరపుకొండలునునుపుగా!దూరముగా మీరిరువురు కాపురముంటే,పరస్పరము ప్రేమాతిశయము పెంపొందుతుంది-కాని ఏకముగానివసించడం తప్పనిసరియైనపుడుమాత్రం, ఆవ్యవహారము నీకెంతగడ్డుఅయినదో ఆమెకుఅంతే. ఆమెఅలవాట్లు, ఆచారాలు, చాదస్తాలు-సహించు. మనకువయసుముదిరేకొద్ది-అట్టిఅలవాట్లు,చాదస్తాలు కొన్ని ఏర్పడిస్థిరమైపోతాయి.

ఇక అన్నిటికీ తుదిముక్క యింకొకటిచెప్తాను-ఆలకించు-నీకూ వకవరాలతండ్రికల్గి-వాడూకాస్తపెద్దవాడైన తర్వాత-ఒకచిలకతల్లిని-తెచ్చిపెళ్లిచేస్తే-ఆవిడ నీయెడల యెల్లామసలుకోవలెనని-ఆవిడ నిన్నెల్లాఆదరించాలని-అనుకుంటావో-అల్లా నీవూవ్యవహరించు-అత్తెల్లా ఒకనాడు తామూకోడండ్రమనేసంగతి జ్ఞప్తికితెచ్చుకోవలెనో, కోడండ్రు ఒకనాటి కత్తలమౌతామనేసంగతి గుర్తించినడుచుకోవాలి.

## ప్రశంస

శ్రీమతి సామినేని హనుమాయమ్మగారు

సీ. అలరించినావమ్మ యతులసంగీతసం
తతుల సతీజననుతులు సెలఁగ
వెలయించినావమ్మ వెలఁదులయుల్లముల్
దండికవితచేతనిండికొనఁగ
మురిపించినావమ్మ ముద్దుపలుకులగతుల్
ముదితలమనములు మోదమొంద
సాధించినావమ్మ శారదవై భావి
కలవిశారదలగాఁ గ్రాలఁజేసి
గీ. పరమపావనసత్కీర్తి బరగి శాశ్వ
తముగ మావృద్ధి నీవృద్ధి ధర్మబుద్ధి
సత్యసంసిద్ధి జగతిలో సాగఁజేసి
తల్లి!గృహలక్ష్మి! వెలయుమా ధన్యవగుచు.

# మితవ్యయము

కూచిమంచి సుబ్బారావు గారు

సంసారనాటకరంగమున ప్రవేశించి, గార్హస్థ్యపాత్రఁ దాల్చిన మానవుని ముఖమునందుండి వచ్చు సువ్యయనిబంధనాహీనములగు శుష్కోపన్యాసములు, నిరర్థకనటనలు దర్శకుల మనములను రంజింపఁజేయజాలవు.

మానవుని జీవితయాత్ర గడచుటకు ముఖ్యమైనది ధనము. కానైతే భూమి రత్నగర్భయైనను దాని యుత్పత్తులు మనకూరకయే రావు. ధనమనగా నేమి? అది మనకెట్లువచ్చును? అనుసంగతి తెలుపనక్కరలేదు. మనకు జీవనమునకక్కరకువచ్చు సమస్తవస్తువులుగూడ ధనమే. ధనమునకు సొమ్ముఅని మరియొక పేరున్నది. పూర్వకాలమున ఆవులు, యెడ్లు, మేకలు, గొఱ్ఱెలు వీనికి సొమ్ములనువాడుకగలదు. ఆజంతువులే వారికి ధనముగా నేర్పడెను. పిదప ద్రవ్యశబ్దమొకటిపుట్టినది. ద్రవ్యమనగా దినుసుఅని అర్థము. మానవులు సవ్యముగ వ్యవసాయముచేసి ధాన్యము, పెసలు మొదలగునవిపండించి, జాగ్రతచేసి ఆద్రవ్యములనే ధనముగావాడిరి. నేటికి నట్టివెల్ల ధనస్వరూపములే. క్రమముగా నాగరికత హెచ్చినకొలది డబ్బులు, రూపాయిలు, కాసులు, నోట్లు మొదలైనవి యిమిడికగానుండుటకు నొకతావునుండి యింకొకచోటికిగొనిపోవ వీలుండుటకు బుద్ధిచాతుర్యమున నిర్మాణముచేసి ధనమనుచున్నారుకాని వాస్తవముగా ప్రపంచమున నుత్పత్తియగుపదార్థములన్నియు ధనస్వరూపములే. ఏమనగా నాణెములిచ్చినచో నవివచ్చును. అవియిచ్చినచో నాణెములువచ్చును. నాణెము లవసరములేకయే పూర్వమొకదినుసిచ్చి మరియొకదినుసో లేక యనేకములగుదినుసులో తెచ్చుకొనెడివారు. దానికే సాటా పేరమని పేరు. అది నేడును నైజామురాష్ట్రమునగలదు. మనప్రాంతములో గూడ రయితులు ధాన్యమమ్మి చింతపండు, ఉప్పు మొదలగునవికొందురు.

ఆధనము మనకు పరిశ్రమమూలమునవచ్చును. ఏపెట్టుబడియులేక కాయకష్టమూలముననే ధనము సంపాదించువారు లోకమున నూటికి తొంభైమందియున్నారు. కడమవారు వ్యవసాయము, వర్తకమువలన ధనముసంపాదింతురు. కాని దానిలోను సగము పరిశ్రమ, సగము పెట్టుబడికలిసియున్నవి. కావున వస్తురూపకమైననేమి? రొక్కరూపకమైననేమి? పరిశ్రమ ఫలమంతయు ధనమే. అయితే అట్టిధనము నెట్లు వినియోగపరుపవలయుననునదియే యిపుడు చర్చింపఁబోవువిషయము.

పురుషులు ధనముసంపాదించుట, స్త్రీలు దానిని భద్రపరచి పొదుపుగా వ్యయపెట్టుట సర్వసాధారణముగా మనదేశమునజరుగు సాంప్రదాయసిద్ధమగుపద్ధతి. ఒకచోట పురుషులును వ్యయపెట్టవచ్చును; స్త్రీలును కష్టించి యార్జింపవచ్చునుకాని యది సకృతు. అయితే భేదమేమనగా నేటికాలమున రొక్కధనము పురుషులయాధీనమందును, వస్తురూపకధనము స్త్రీలయాధీనమందును దరుచుగానుండుట పరిపాటియైయున్నది. ఒకప్పుడు రొక్కముగూడనుండవచ్చును. సాయంత్రమగుసరికి వచ్చినయాదాయమునకు, వయినవ్యయమునకు నిల్వలు సరియగులెక్కవ్రాయవలయునని స్మృతిసంహితలో వ్రాయబడినది. దీనింబట్టి పూర్వము స్త్రీలకు విద్యకలదో లేదో తెలిసికొనవచ్చును. అధికవ్యయము చేయుభార్యను భర్త విడిచిపెట్టవచ్చునని అగ్నిపురాణములో వ్రాయఁబడినది. నేడు నవనాగరికతగల యెల్లదేశములందును ధనము కూడఁబెట్టుట, కాపాడుట, వ్యయపెట్టుట యనుబాధ్యత స్త్రీలపైనే విడిచిపెట్టబడుచున్నది. పతిభక్తి, ధర్మబుద్ధి, దైవభక్తి, సద్వర్తనగల రమణీమణులు డబ్బును గాపాడి దానినుచితరీతిని వినియోగించుచున్నారు. అట్టి సుగుణశాలినులు, లక్ష్మీస్వరూపిణులగు గృహిణులుగలధామము సమస్తసంపదలతో తులదూగుచుండును. అట్టి యుత్తమకాంతకుఁ బెత్తనమివ్వక నమ్మక యన్నిటికిదానే తయారగుపడు పురుషుఁ డాడుజాతిలోనివాఁడు, కృపణుడు, స్వప్రయోజనుడు, నింద్యుడు.

మితవ్యయము చేయు ఇల్లాలు తన భర్తలకు బిడ్డలకుగూడ మితవ్యయవిధానము బోధించును. పొదుపువల్ల గల్గులాభమును గ్రహించు స్త్రీ తనకుటుంబములోనివారి నెల్లరను దన దెసకు ద్రిప్పఁగోరుచుండును. అట్టియిల్లాలు గొప్పయింటిదగుఁగాక; చిన్నయింటిదగుఁగాక - తనయాదాయమునుబట్టి వ్యయము చేయవలయును. దీనివలన ధనమునకులోటు, దారిద్ర్యమునకు జోటునుండదు. అప్పుచేసి దానధర్మము లొనర్చుట తగదు. ఏమనగా నప్పు దీర్చలేకపోవుటవల్లగల్గుపాపము ధర్మమువలనవచ్చుపుణ్యముకంటె మించిపోవును.

ఉత్తమసాధ్వియగు మహిళామణి స్వల్పాదాయములోనే గృహవ్యయమంతయు దనపోడిమిమూలమున పరిపుచ్చగల్గుచున్నది. భర్త సంపాదించి తెచ్చినదానిలోనే యిల్లాలు సంతోషపడవలెను. పొరుగువారిభాగ్యము చూచి యసూయపడుట, వారివలె నింకను దమ్మని పతిని వేధించుట, అలుగుట, పనిమానికూర్చుండుట దూషించుట తగదు. మనలో ననేకులు తమ భోగవిలాసములకొఱకు మితిమీరి ధనము గడతేర్చుచుందురేకాని యొక బంధునిమాటఁగాని, యొక మిత్రునిమాటఁగాని యాపంతయుఁ దలంపరు. వీరికే స్వప్రయోజనపరులు, స్వసౌఖ్యాభిలాషులనని పేరు. వివాహాదులందు వెనుకముందుఁజూడకుండ వేలానవేలు వెచ్చపెట్టువారు తమభావిసంతతి వారికి మట్టిచెంబు చేతికిచ్చుచున్నామనుసంగతి మఱచుచున్నారు. ఒకనాడు మహారాజుపత్నివలె నీటుగోటులతో మెలఁగి వెయ్యారేనినగలు, పదవికిమించిన వలువలుదాల్చి ధనము దుర్వ్యయమొనర్చుగృహిణి మరియొక కాలమున నిరుగుపొరుగిండ్లకేగి, పిండిపప్పువిసిరి జీవించవలసినయవస్థపొందును. దుర్వ్యయము, దుబారాఖర్చువలన గొప్పముప్పులోబడి తిప్పలుబడుచున్నవారింగాంచియు నది మానఁబూననివాఁడు కండ్లుండియు గ్రుడ్డివాఁడు. కావున బాగుగాఁ జర్చించి, జాగరూకతగా యోజించి శక్తియున్నంతలోనే యుచితరీతిని వెచ్చపెట్టుకొనుట శ్రేయముగాని తలకుఁదగని పర్వులెత్తుచో నోడిముడుకుగుజ్జమువలె గోతిలోబడకతప్పదని యెల్లరు గ్రహింపవలెను.

పరోపకారమునకై తమ ఆదాయములోనుండి కొంత యుచితవ్యయము చేయ నేర్చినట్టియు, క్షుధాతురుల కన్నమొసంగుటకై తమ భోజనములోనిదే కొంత తగ్గించుకొన్నట్టియు, నొరులసౌఖ్యమునకై తమసౌఖ్యముం గొంత వదులుకొనునట్టియు మనుష్యులే మహాత్ములు, మహామహులు ననబడుచున్నారు.

పాశ్చాత్యదేశములందు విఖ్యాతనీతిజ్ఞుఁడగు స్మైల్సు - 'ధనము నుచితరీతిగా నుపయోగపరుచుటకంటె నది సంపాదించుటయే సులభతరము' అని వ్రాసెను. అనగా సంపాదించుటకంటె దానిని సార్థకముగా వ్యయపెట్టుటయే కష్టతరము అని తాత్పర్యము. పెక్కురుమానవులు ధనముసంపాదించుట కెన్నియేని యుపాయములెఱుఁగుదురు; కాని, యుచితరీతిని వినియోగించు విధానమెఱుంగరు. సామాన్యముగా డబ్బు కాపాడుట, పొదుపుచేయుట యిల్లాండ్రపనికాని, పాపకర్మమున నేటికాలపు మహిళామణులు బహుముఖ్యమగు నిట్టివిషయమునందు లక్ష్యముంపకున్నారు. కుటుంబము పెద్దదైనను, చిన్నదైనను వ్యయముతప్పదు. ఒక యింట నిత్యము నొకరూపాయయగుచో నింకొకయింట నైదు, పదియగును. అయిన నీయెల్లవిధములగు సంసారముల యజమానురాండ్రును దమతమయాదాయమును గమనించియే వ్యయము చేయవలసియున్నారు. మన యింటిఖర్చు అనగా నెంత? దీనికి లెక్కయొక టెందుకని కొందరును, లెక్కవేసినమాత్రమున వ్యయము తగ్గునా? యనికొందరును దలంచుచున్నారు. ఇవి మిక్కిలి తప్పభ్రాంతియు దురాలోచనయునైయున్నవి. ధనికుఁడగు పెద్దసంసారులకంటె మితాదాయముగల సామాన్యకుటుంబీకులే సాధకబాధకము లాలోచించుకొని వెచ్చపెట్టవలసినవారగుచున్నారు.

రూపాయిలు వస్తువులుమార్చుకొనుటకు కేవలసాధనమాత్రములు. వాస్తవముగుధనము వస్తువే. నిత్యము మన కగత్యమైనది దినుసే. నిజముగా రూపాయి వ్యయమైపోవదు. ఒకవస్తువుకొనుటకై చేయివిడిచిమాత్రము

చెడలున్నది. దానిస్థానే యంతవిలువగలవస్తువువచ్చి నిలుచుచున్నది; కావున అదే వ్యయమైపోవుచున్న కావున వట్టివస్తువులను ధనమనియేభావించి యంతకంటె జాగ్రత్తగా కాపాడవలసియున్నది. ఏమనగా రొక్కధనము, నాణెము చెడదుకాని దినము దాచి భద్రపరచుకొనకయున్నచో జెడిపోవును. సాధారముగా స్త్రీలచేతులలో నాణెములుండవు. వస్తురూపకధనమేయుండును. అదిచెడిపోవుచో రొక్కధనమ పోయినదనియే అర్థము. ఏమనగా మజల రొక్కధనము తెచ్చియిచ్చిననేకాని యాపదార్థమురాదు. కావు నిల్లాండ్రు ధాన్యము, పెసలు, కందులు, మినుములు, చింతపండు, కుంకుడుగాయలు, ఊరుగాయలు మొ లగునవి పుగాసిపుచ్చిపోకుండ, బట్టలు ముక్కిపోకుండ, పుస్తకాదులు చెదతినకుండ, నేయి, నూనె మొదలగున యెలుకలు, పిల్లులు, కుక్కలుత్రాగి పాడుచేయకుండ తలుచు చూచుకొని బాగుచేసి జాగ్రతపరచుట విధి ప్రపంచమున ధనికుడు, దరిద్రుడునను నిద్దరుగలరు. వీరిలో వాస్తవముగసుఖవంతు లెవరని తెల్పుటకష్టము ఏమనగా మనశ్శాంతియే వాస్తవసౌఖ్యము. మనస్సులో శాంతిసుఖములుగలవాడే నిజముగ సుఖవంతుడు తనరాబడినిబట్టి ఖర్చుపెట్టుకొనుచు ఋణముచేయనివాఁడు ముందునకై నిలువజేయకున్నను సౌఖ్యవంతు డనఁదగును. ఏమనగా నున్నమట్టుకు హాయిగాదినును. ఋణమెట్లుతీరునను బెంగలేదు; కలతలేదు. చీటి మాటున వారువచ్చి బాధింతురనుభయములేదు. నిత్యము దనరాబడిలో గొంతమిగిల్చి నిలువచేయగలవాఁడు మొదటివానికంటె నింక నధికసుఖవంతుఁడు. వానికి ముందు చింతకూడానుండదు. కోటీశ్వరుఁడైనను తన ఆస్తికంటె మించినవ్యయముచేయువాఁడు, ఋణముచేయువాఁడు నిజముగ సుఖశాంతులులేక తుదకు జెడిపో వకమానఁడు. కాలమెల్ల నొకలీలగానుండదు. ప్రతిమానవునకును గష్టము, రోగము వెంటనంటియుండును. ముందురాబోవు నవస్థ తనకేమితెలియును? నేడు మంచి యారోగ్యవంతుడై సర్వసౌఖ్యానందములలో దేలు చున్నవాఁడు రేపే గ్రహచారవశమునను రోగగ్రస్తుడగుటయో, ఆకస్మికఘటనలవలన నశక్తుఁడగుటయో సంభ వింపవచ్చును. అట్టియవస్థలో వానికి రాబడితగ్గిపోయినను, గృహవ్యయముమాత్రము తప్పదుగదా? అపు డా పురుషునియిల్లాలు సంసారముగడపుటకై యెట్టియిక్కట్లుపడవలసియుండునో కొంచెము నిదానముగా యోచించిచర్చించికొన్నచో బోధపడఁగలదు. పెండ్లికాకమునుపు పురుషునకు భార్యకొఱకై వ్యయముండదు. తరువాత నామెకేకాక బిడ్డలుకూడా కల్గుచుందురు. కావ క్రమక్రమముగా ఖర్చు హెచ్చిపోవుచుండును. కాని దానింబట్టి రాబడికూడ హెచ్చుట నమ్మకములేనివిషయము. అట్టియెడల మొదటినుండియుఁ గొంచెము సంగ్రహముచేయక యెప్పటిదప్పుడే కడతేర్చి తట్టదులిపి కూర్చున్నవారు పిదప గొప్పచిక్కులపాలై యెన్నియో యకార్యములకు బాల్పడవలసివచ్చును.

రాబడి హెచ్చుగానున్నప్పుడే కూడిక చేయఁబడునమాట మిగులఁ బొరపాటు. రాబడికి హెచ్చేమి? ఖర్చునకు మితియేమి? రాబడి యెక్కువైనను తక్కువైనను వ్యయవ్యాపారము బంధించనంతవరకు వచ్చినదంతయు ప్రవాహమువలె బోవుచు నేయుండును. మిగులుటయేయుండదు. కావున ముందరియుపయోగమునకై కొంత మిగుల్పఁదలంచినవారు మొట్టమొదటనే కొంతదీసి జాగ్రత్తపెట్టుకొనవలయును. కడమదే సర్దుకొని గడప వలెను; కానిచో నిత్యాదాయమువచ్చువారైనను కొంచెమైన మిగుల్చుకొనుటయే సాధ్యపడదు. అట్టిపద్ధతి యవలంబించు యెడల నేస్థితిగతులుగలవాడైనను గొంచెము సంగ్రహింపగలడు. తుదకు భిక్షాటనవల్ల జీవించు వారుఁగూడఁ జేయగలరు.

మనజీవనమున కేవస్తువు లవసరములు? ఏవి అనవసరములు? అనువిషయము నిశ్చయించుటకష్టము. ఒకనికిబనికిరానివస్తు వింకొకని కవసరమగుచున్నది. దరిద్రునకు గంజిలోనికుప్పెంత యవస్యమో భాగ్యవంతునకు పాలలోనికి బంచదార యంతయవస్యమే. అయితే వారివారిస్థితిగతులను ఆదాయమునుబట్టి అవసరవను

వుల నెన్నుకొనవలెను. కాని చూచునప్పుడు దమ కవసరమనితలంచువారు తా మెట్టిపదవిలోనున్నను కొంచెమును మిగుల్చుకొనలేరు. కావుననే వేయిరాబడిగలవానికి బదివేలు, లక్ష వచ్చువానికి బదిలక్షలుబుణము అగుటకు కారణము. రాబడిలో నెంతమిగిల్చి యెంత వ్యయపెట్టవలయుననువిషయమునుగూర్చి ఆర్థికశాస్త్రవేత్తలలో భేదాభిప్రాయములున్నను, మిగుల్చుటమాత్ర మవసరమనువంశమునుగూర్చి యెల్లరఅభిప్రాయ మొక్కరీతి నేయున్నది. ప్రతివానికిని దప్పని సరియని నిశ్చయమైనదానికిమాత్రమే ధనము వ్యయపెట్టి మిగిలినంతమట్టుకు మిగుల్చుకొనుట మంచిపనియని తీర్మానింపఁబడినది. అయితే నేటి మనగృహస్థులెంత రాబడిగల్గినను సగము మూడవవంతుబోరెు; నాలుగవవంతునైనను అధమాధమము పదియారవవంతైనను మిగుల్చుటకు వీలుగనపడినంత యనవసరప్రణాళికలోఁ గట్టఁబడిపోయినారు; డంబాచార మధికమైనది; సౌకుమార్యము హెచ్చిపోయినది; సోమరితన మావహించినది; డబ్బుయందు నిర్లక్ష్యబుద్ధిప్రబలినది. ఒక్కయడుగు కాలినడకనుబోవుట కష్టము, అవమానము; ఒకవస్తువు స్వయముగాదెచ్చుట శిరచ్ఛేదమె; ఒకదానినిమించినదిం కొకభోగవిలాసపదార్థములుగొనునభిలాష దినదినము వృద్ధియైపోవుచున్నది. పిడకలమ్మువాడది సోడాలెమనేడ్లు త్రాగుచున్నది. కావడిధాన్యము పది మైళ్లు మోయగల పామరుడు నాల్గుమైళ్లూరికేనడలక మోటారెక్కుచున్నాడు; ఒంటెద్దుబండిపోయి జట్కా గౌరవమైనది; అది హీనమై గుఱ్ఱపుసార్టుబండివచ్చినది; అది పోయి యూరిలోనే మోటారుప్రయాణమువచ్చినది. ఇఁక గాలిలోనెగురునవికూడ బజారునకు క్లబ్బుకు వెడలుటకు సాధనముకాగలదినములు వచ్చుచున్నవి. ప్రతిపామరుడు బీదవాడు, ధనికుడు, నుద్యోగికూడ చేతికందినది నోటికందించి చేయిదులుపుటయేకాక పైగా నప్పుగూడ తడుముచున్నాడు. అట్టివాడు తాను పకీరై తనసంతతివారినిగూడ భిక్షుకులంజేయుచున్నాడు.

కొందరు స్త్రీల కొకదురభ్యాసము బట్టుకొనుచున్నది. భర్త 50 రూప్యములార్జించుననుకొందము. అపుడామె పదిరూపాయలు ముందుగా దీసి దాచికొనును. కడమనలుబదిలోనే గృహకృత్యము నడచునా లేదో యను విషయముతో నామె కగత్యములేదు. తాను వానిలో బొదుపుగా గడపదు. పిల్లలకు పాలుచాలవు, తనకు బట్టలులేవు, ఇంట్లోబియ్యముచాలవు, నేనేమిచేయుదు? యింకను దెచ్చి నీవే సర్దుబాటుచేయుమని బండసాచి కూర్చొనును. లేదా పోపులేని కూర, కూరలేని అన్నము పెట్టి యిగిరింప జూచును. మరియొకఆమె యింటిలోనిబియ్యము మొదలగునవి యెల్ల నిరుగుపొరుగువారికమ్మి అయిపోయినవి. తెచ్చెదవా పండెదను లేదా పస్తుండుమని నిర్మొగమాటముగా నిర్దయాపూర్వకముగా జెప్పును, ఆమెమట్టుకుఁ బొదుపుచేసికొని జాగ్రత పడుచున్నది. కాని భర్తను గష్టము పాలుచేసి మనసువిసికించి చాలినంత సొమ్ము ఆర్జించుటకై యూతడన్యాయవృత్తి అనగా లంచమో, మోసమో చేయునట్టి స్థితికల్పించును. అట్టివార లిహపరములు రెంటికి జెడవలసిన వారగుచున్నారు. అట్టివారిని నమ్మి భర్త ధనమివ్వఁడు, అనుమానము విడువడు. కావున ప్రేమాభిమానములుగల్గి పేరుప్రతిష్టలు సంపాదింపవలెనను నిల్లాలు నియతమగు నాదాయమున గృహవ్యయము వెల్లజేసి దుబారాచేయక మిగుల్చుటకై యత్నింపవలెను. ప్రపంచమునఁ బనికిరాని వస్తువొకటియును లేదు. కావున నెట్టిస్వల్పవస్తువునైనను బారవేయక భద్రపరచినచో నది సమయము వచ్చినపుడు రొడుములాడకుండ బనికి వచ్చును. ప్రతివస్తువును దనకుఁజుట్టున నందుబాటులోకి వచ్చునటుల నియతస్థలమున జ్ఞాపకముగా మాత్రము పెట్టవలెను. ముందు చిన్నచిన్నవి జాగ్రత్తచేయుట యలవడినచో పెద్దపెద్దవియు భద్రపరచుట అలవాటగును.

తనచేతిలోనున్న ధనమేదో యదియే లెక్కలోఁజేర్చుకొనవలసినది కాని ముందేదో వచ్చునని యాశ పెట్టుకొని దానిపై నాధారపడి దానికి సరిపడిన మొత్తము ముందే యప్పుదెచ్చి వెచ్చపెట్టువారు తమకది రానియవస్థలో గొప్పచిక్కులపాలైన గాథ లనేకములున్నవి. దానికే నువుగింజసామ్యమని పేరు. మనదేశ

## మితవ్యయము

మున బారసాలు, వడుగు, పెండ్లి, శోభనము మొదలగు వానివిషయమై పట్టిడాంబికముగా హెచ్చువ్యయ
చేయుపరిపాటి మితిమీరిపోవుచున్నది. ఇందువల్ల నెన్నియో కుటుంబములు సర్వనాశనమైనవి. వివాహమ
లేరగా విని పోవువారికి బాణసంచాలు, పందిరిముస్తాబునకు భోగముమేళములకు సంభావనలకు వందలు
వ్యర్థము చేయు దురలవాటుఁదప్పించుటకై చాలమంది పాటుపడుచు దావుపలంబించి యొరులను మందలిం
వల్ల గొంతమట్టుకు దగ్గినది. కాని యింకనుచాలచోట్ల నాపిశాచము వదలక పిల్చి పిప్పి చేయుచున్నది. అ
దెచ్చుపద్ధతి గొప్పహానికరమై సంసారవృక్షము వర్ధిల్లకుండ కుప్పింపఁజేయుటకుఁ జీడపురుగై యున్న
రొక్కము బేరమునకంటె నరువు బేరమున రూపాయికణా బేడో తేడాయుండక తీరదు. తక్షణమే చేతి
నివ్వనక్కరలేకుండా నేరగా వచ్చుటవల్ల నవసరము లేనివి కూడఁ దేబుద్ధి పుట్టును. ఒకచోటనే ఒకయ
ఖాతా పెట్టుటవల్ల వారుచెప్పినవెలకే కొనక తప్పదు. పాపము గోదావరిజిల్లాలోని పామరజనమునకు
త్సరమునకు బట్ట లరువిచ్చి కెట్టింపుఖరీదుపద్దువ్రాసి యింటిమీద ధరానా కూర్చుని వీసరాలు చేయు గుంట
వర్తకు లెంతలాభము పొందుచున్నారో, యీపాటకప్రజన మెంత నష్టపోవుచున్నారో కాంచుచో గొ
యాశ్చర్యవిషాదము లొక్కమారుగల్గుచుండును. మంచిసరకు నికార్సైన వస్తువు చవకధరకు పొందవలెనన్న
వాని నాయాతరుణములందు నొక్కమారకొని నిలువయుంచికొనుట యుత్తమతమము. లేదా జీతములందగా
స్వయముగావెళ్ళి బేరమాడుకొని మంచిదిచూచుకొని వెలకుసరిపడున దంతయు గొనుక్కొనుట రెండవప
లేదా తానేవెళ్ళి అరువైనా తెచ్చుకొనుట కనిష్టపద్ధతి. అది యేదియుఁగాక యేనౌకరునో పంపి యొ
కప్పుడు ఖాతాలో పద్దువ్రాయుమని తెప్పించుట అధమాధమమగు నికృష్టపద్ధతి. దీనిలో నట్టివారు చెరిసగ
కంటె నెక్కువ నష్టపడుచున్నామని గ్రహించవలెను. అట్టియంగడివాఁడు పాడు సరుకంటగట్టును. తక్కు
తూచును. వెల యధికముచెప్పును. వ్రాసినపద్దే మరలవ్రాయును. మధ్యవాడు దానిలో గొంత తస్కరించు
ఇంట అమ్మలు వీసెకో, వదలమేకో యొఱుగక తెచ్చినదేపుచ్చుకొని ఖర్చుపెట్టి యొలుకలకు బిల్లు
నర్పించి మరల తెమ్మనుచుందురు. పాపము నెలరోజులుచెమటయూడ్చి తెచ్చినరూపాయి లెల్ల నాఖాతా
జమకట్టి మరలనరువు ప్రారంభించును. ఎవ్వడేది తెచ్చినదియు నెంతఁదెచ్చినదియు గ్రహించుట కాధార
లేదు. ఖాతాలెక్కప్రకారము కిక్కురుమనకుండ నోరుమూసికొని సమర్పించవలసినదే.

ఇంకను గొన్ని యింటిలోనే తయారుచేయించదగ్గ పిండి, పప్పు మొదలగునవి కూడా దుకాణములో
పద్దువ్రాసి పుచ్చుకొని కూరలకు, బల్లలకు, తమలపాకులకు రొక్కముగూడ నచట నేయడిగి కష్టార్జితమెల్ల వా
సమర్పించి భ్రష్టులయిపోయిన సోమరిపోతులను వారి వెచ్చమువాడుకవల్ల నైభాగ్యవంతులై ధనములు కట్టి
మాన్యములు కూడ గొన్న వణిజుని మాపురముననే నేను స్వయముగా గాంచియున్నాను.

వేర్వేరు తరగతులవారికి వారివారి స్థితిగతులంబట్టి వ్యయములు భేదించినను సామాన్యజీవనోపయో
మునకగు ముఖ్యవస్తువులెల్ల నొక్కటిఅనగా భోజనము, బట్టలు, ఇల్లు, పన్ను, విద్య, మందులు, పథ్యమ
పుస్తకములు, ధర్మము, గృహోపకరణములు, ప్రయాణవ్యయములు, దాసీదాసాదుల జీతములు ఇవిగాక కుట
బములోని వేర్వేరు వ్యక్తుల యభిరుచులకు సంబంధించిన ప్రత్యేకవ్యయములు కొన్ని ఇట్టిబాపతులెల్లఁజేర
సంవత్సరమొత్తమున కొకయుజ్జాయింపులెక్కఁ(బడ్జెట్టు) వైచికొని దానికిఁదగిన యాదాయమున్నదా లేద
చూచికొని లేనిచో నందులోగొన్ని తగ్గించికొని లెక్కవ్రాసికొనుచు నిత్యము నట్టివ్యయము తీసివేయా
నైనది కానున్నది స్పష్టముగాఁదెలియును. దానింబట్టి కడమపనులు సరిపుచ్చుకొన వీలగును.

ఉద్యోగులు లేరు నేనేస్వయముగా వ్యయపెట్టుచుంటినిగదా లెక్క యెందుకుఅని యనుట విమర్శావి
నతదే, మానవు దేవరికి జవాబుచెప్పక పోయినను దనవర్తనగూర్చివలెనే తనవ్యయమునుగూర్చికూడ దన నియం

ముగు బరమేశ్వరునకు సమాధానము చెప్పుటకు బాధ్యుఁడైయున్నాడు. నేను విధాయకము నవసరమునగు వ్యయమే చేయుచున్నాను. కాని యే యితర దుష్కార్యములకును వినియోగించుటలేదని తెలియఁజెప్పుటకే గాక తనస్వరూప మద్దమందుగాంచి యేవికారములు మరకలులేకుండా సవరించికొనవీలగునటుల లెక్క, దానిపనిని దానుపునర్విలోకించి దానిలోని యుక్తములగుపద్దులం గ్రహించుటకు సాధనభూతమగును.

ప్రపంచవ్యవహారములందు లెక్క యొక ప్రధానవిషయమని యెల్లరు నంగీకరించినదే. లెక్కలేని వ్యవహారము చుక్కానిలేని నావికాయానమువంటిది. లెక్క యెఱుగని స్త్రీలనేకులు పాలు పెరుగు వాడుకల పద్దుకి గోడలమీద గీతలుగీచి లెక్కపెట్టుకొనుచుందురు. లెక్కలేనిచో నెవరికెంత యివ్వవలెను, ఎవ్వడివ్వవలెను అను సంశయమెల్ల నోటిని జ్ఞాపకముండదు. అపు డెవరో అబద్ధమాడు నవస్థపట్టును.

పెక్కురు స్త్రీలు పట్టినవలలు నాటకములు కథలు చదువుటయే కాని లెక్కలువ్రాయుపద్ధతి బొత్తుగా నెఱుంగకయున్నారు. ప్రపంచికజ్ఞానముగలుగని శిక్షణవిధానము నేర్పఱచి మనయిల్లాండ్ర నిటుల వంచన చేయుట విచారకరము. ఒకమారువ్యయము హెచ్చిపోయినపిదప మరల దానినిఁదగ్గించుట కష్టము. గృహిణి రాణివలె వ్యయము చేయఁగలదు కాని రాణి తనవ్యయముతగ్గించి సామాన్యగృహిణివలె మసలనేరదు. అన్నవస్త్రములు, అశనవసనములు ననుద్వంద్వములుగనుడు. అన్నము, బట్ట-యిల్లు, బట్టయని మానవమాత్రునికెల్ల నవసరములు. అట్టివిలేనివారెందరో నిత్యము మనకంటఁబడుచుందురు. మనదుర్వ్యయములో గొంతతగ్గించి యట్టివారికిం గొంత దోడ్పడుచో నెంతయో పుణ్యముండును. మనమేచుట్టమునైన యాదరించి గౌరవించి మనయింటనిలిపిననే యుండును కాని అతనివిలువ గ్రహింపక తృణీకారముగాఁ జూచినచో నాత డొక్కక్షణము మనయింట నుండడు. ధనము మహాలక్ష్మీస్వరూపము. ఆమెవిలువ గ్రహించి మనము గౌరవించి భద్రపరచిన నేయుండును. లేనిచో వీరింట నాకేమిపనియని లేచిపోవును.

మితవ్యయమునకు మానవత్వమునకు చాలదగ్గర సంబంధమున్నది. పెక్కురు గృహిణులు పైయెల్లవ్యయములు మానుట కొడఁబడుదురు; కాని తమ బనారసుచీరలకు గట్టుకానుల పేరులకు మాత్రము లోటురానియ్యరు. ఇంకను గొందరిల్లాండ్రు ఒకపూటరైన బస్తుపడియుండవచ్చును కాని నగలులేనిదే పదిమందిలోకి వెళ్ళడమెట్లు, రెండుదినములుపవాసమైనం జేయవచ్చును కాని పిల్లవాని బారసాలకు బాజాలులేకుండే నేలాగు, అమ్మాయి పెండ్లికి బ్యాండువాద్యము మేళములేకున్న నింకేమిటిఅని మూర్ఖపుపట్టుపట్టుటవల్ల పెక్కురు గృహస్థులు పోరుపడలేక మాన్యమో, యిల్లో—తెగనమ్మియో, తాకట్టుపెట్టియో కొన్నివేలు తెచ్చి పిదప సర్వనాశనమగుట యనుభవవేద్యమే.

పూర్వపద్ధతులలోనుంచి క్రమముగా నవనాగరికతబడయు విలాసవతులు కంటెమార్చివాను, వాను చెరిపి దొరుగళ్ళు, అది కరిగించి గడియారపుగొల్సు, మురగులుకరగించి పోచీలు, అవిమార్చి గాజులు యీవిధముగా తట్టబుట్టిబుట్టిగంపచేయించి వాటివాటికి గొంతబంగారము, మసాగత్తు బంగారపుపనివాళ్ళ కర్పించుచున్నారు.

కొందరుస్త్రీలు కంటబడుటయేతడవు అది అవసరముమాలినదైనా సరే కాని మూలబడవైచు దురలవాటు గలిగియున్నారు. ఇంటిలోలేనిదే కాదు ఇదివరకున్నను మరియొకటిగూడ గొనుచుందురు. ఇందువల్ల పనికిరాని వస్తువులక్రింద యెంతయోడబ్బు వ్యర్థమై పోవుచున్నది. అనవసరవస్తువులు ముందుగొని అవసరమగు వస్తువులేక కష్టపడువారు పెక్కురున్నారు. రు 10 లు పెట్టి నిలువుటద్దము కొనుమని మగని బాధించునిల్లాలికి నీళ్ళుగాచికొనుడేగిసా చిల్లిదే.

ఇట్టి యక్రమములెల్ల వారించవలయునని దేశశ్రేయోభిలాషులగు మహనీయు లనేకులు సభలలో గొంతుచించికొని యుపన్యసించి తీర్మానములు చేయుచున్నారు. పత్రికలలో నెక్కించుచున్నారు. అయితే నాచరణలేని చదువు అనుసామెతగా కార్యరూపమున బరిణమింపజాలని శుష్కతీర్మానముల మూలమున నవగా నింట దాని నాచరింపవలసిన మహిళామణులు దానియందు ధ్యానముంచనంతవరకు నెవ్వియుం బ్రయోజనకారులుగావు. గ్రంథవిస్తరభీతితో నింతవ్రాసి విరమించినాను. కాన నోసోదరీమణులారా! గృహరూపరాజ్యమునకు నధినాయకలు, పాలకలునగు మీరు మీకుగల బాధ్యతను గుర్తెరింగి పొదుపు, మితవ్యయమునను విధానముల నవలంబించి మీరుసుఖించి మీభర్తలనుసుఖపెట్టి భావిసంతతికిమప్పి మీగృహములు సర్వవస్తుసంభరితములుగా, ఋణరహితములుగా నుంచుదురుగాకయని కోరుచున్నాను.

## పుష్పగుచ్ఛము

దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు

పూలలోనున్న గుణమెల్ల ప్రోవుచేసి
గంధవాహకుమారుడు విందుసేయ
భ్రమరకులమెల్ల మెల్లగా పాడదొడగె
చారువనవీథులందు విషాదగీతి.

చివురుటాకులనన్నియు గవిసిమేసి
కోకిలముచూడుగొంతెత్తి కూయదొడగె
చిట్టి! నీవీణశ్రుతి సరిసేయుమమ్మ
శ్రుతికిననువగుగీతి రచించునేమొ?

శీతకిరణాలలోన నాసీనుడైన
చందురుడు ధౌతకిరణాలసాహచర్య
కారణమ్మున దెల్లనికాంతులిలకు
విసరుచున్నకుజగమెల్ల వెలసిపోవ.

చిన్నిసెలయేటిపరిసరసీమలందు
దాగికొనియెను నిశ్శబ్దతాగుణమ్ము
తెల్లవెన్నెలకెరటాలపిల్లతరగ
లేకమైపోవమరతు నన్నింటినేను.

కమలములుమూతవడు తమకనులవిప్పి
కొత్తకళమొగమందు దళ్కొత్త, కుశల
ప్రశ్నముంజేయుచుండ ప్రభాతలక్ష్మి
వేడుకంగూర్చు గ్రీష్మంపువేళలందు.

చిగురుటాకులలో నివసించునట్టి
రక్తిమంజూచి పిక మనురక్తమగుచు
మెల్లమెల్లగహృదయమ్ము కొల్లకొనగ
పాడుచున్నది పంచమస్వరముతోడ.

సరసనుమనోజ్ఞసౌరభోత్కరము వెలికి
జిమ్ముపూగుత్తుకలకడ ఝుమ్మటంచు
గానవిద్యావినోదసంగతులజూపి
రసవశత మోవినిమ్మని కొసరుచుండు
దేటిగమి మెప్పు పువ్వులతోటలోన.

బాల! నీగొంతులోన రత్నాలగూర్చి
వైచిరెవ్వరొనీవొక్క పాటపాడ
ఒకటివెంబడినొకటిగ నొరసికొనుచు
నేల? వేలకొలందిరత్నాలురాలు.

చక్షురగ్రాహ్యవస్తువిస్తారరూప
మెరుగగలభావనయనాల దెరుపుమమ్మ
హృదయచిత్రవిచిత్రతాత్మేశురూప
వైభవముదృష్టిపథమున బడునొయేమొ?

వింతవింతసువాసనల్ వెలికిజిమ్ము
రకరకమ్ములపూల నేర్పరచి నీకు
గుచ్ఛమును: గృహలక్ష్మి! నే గుచ్చినాడ
బెట్టుకొనుమమ్మ! వేణి పుష్పించునటుల.

## రాటపు పాటలు

## శ్రీమతి ఇనగంటి రత్నమ్మగారు

౫౭

అందముచందములేని అడకూతురుకి
అందమేరుపరుచు అప్రత్తిచెట్టు.

౫౮

వెన్నెలకాలాన రాత్రోయిదొంగ
వేదవంతుడుఅన్న వీధినున్నాడు!

౫౯

మల్లివారమునాడు మాంచాలపెండ్లి
మకరతోరణాలు మాఅరుగుమీద.

౬౦

సానమీదగంధమ్ము చల్లారిపోయె
సానివాడలుబోయి అన్నేలరాడు?

౬౧

సీతమ్మచిత్రకథ చెప్పనప్పుడు
అడవిలోవచ్చిఆకు అడెభగ్గుమనును.

౬౨

పచ్చిపాలుత్రాగినాడు హెచ్చినాడెగొల్ల
వ్రతముజెచేచినాడె బావనక్కలని
అక్కా! ముత్యాలక్కా! నీవుకట్టినచీరె
నిలువెల్లబంగారు నీలికోలుకోల్లు.

౬౩

నల్లన్నినల్లన్నికొండలల్లవిగో
నాతికన్నావారి గోవులల్లవిగో
గోవులగాచేవు గొల్లెలపిలిచేవు
గొల్లవారిండ్లలో యిల్లెటమా? కృష్ణ!

౬౪

కృష్ణమ్మపుట్టిన్నా అష్టమినాడు
గొలుసులూడిపడును గొళ్లెములుగదలు
తలుపులూడిపడును తాళములుగదలు.

౬౫

చిక్కుడుచెట్టుకి తీగెలందమ్ము
చిన్ననాడబ్బాయి తిరుమలందమ్ము
కాకరచెట్టుకి కాయలందమ్ము
కన్నతల్లులెట్టిన సొమ్ములందమ్ము.

౬౬

ప్రొద్దున్నే నాకొక్క బుద్ధిపుట్టింది
పొన్నల్లపుట్టిల్లు పోదామయని
పొన్నలక్రిందది నాదిపుట్టిల్లు
పోయివచ్చినదాక పొందదేమనను.

౬౭

కన్నతల్లివినీవు కావుగాబోలు
మారుతల్లివలె మాటలాడేవు.

౬౮

మాటల్లునేరని మానవతిరాలు
మరదిదేవుడని మరివేడుకొందు
మరదిమరదియందు మత్స్యమనియుందు
సారల్లపులియందు చందమామందు.

౬౯

బాలల్లుబాలల్లు కూడియాడంగ
యేబాలనోటొచ్చుమేలువార్తల్లు.

౭౦

ఆటప్రాయమునాడు అత్తింటికిబోతే
మాటలకుకోదువంటె మాంచాలమనకు.

౭౧

ఇంతప్రొద్దుబోయి విభుడెందురాడు?
కాంతుజనకుడురాని కారణమేమి?

౭౨

జనకునింటబుట్టి జగమింటజొచ్చి
లోకనిందాలకు లోనాయెసీత.

# రాలినపూవులు

తుమ్మలపల్లి వేంకటసీతారామారావుగారు

## ౧. విశ్వమాత

విశ్వమాత ఉన్నతాసనమును అధిష్ఠించినది. సూర్యమండలము రక్తరంజితమై భయంకరముగా ఉన్నది. అమాయకుడగుపుత్రుడు మాతృదేవినిచూడగానే గడగడలాడిపోయినాడు. జీవితము దోషభూయిష్ఠమై ముక్కలుపోయింది. పశ్చాత్తాపము ద్రవించి నేత్రకాసారములలోనుంచి స్రవిస్తూంది. 'మన్వు చేసిన ఘాతుక కృత్యాలు యివిగో' అని ఒకరు వేళ్లుమడిచారు. ఇంకొరు తీక్ష్ణవీక్షణములుబరిపారు. ఇంకొకాయన పండ్లు బిగించి 'వధ' అని గర్జించాడు. పుత్రునిఆరాటము హెచ్చింది. భయము ఒక్కమారుగ ముంచెత్తింది. బలిపీఠముదగ్గరఉన్న మేకపిల్లవలె విధికి తలయొగ్గి నిలుచున్నాడు. 'నేనుకూడా నిందించలేను' అంటూ పెదవులు చప్పరించింది మాతృదేవి. ఆమెనేత్రాలలోనుంచి ప్రేమ ఉట్టిపడుతూంది. అందరు అమాయకుణ్ణి దూషించారు. లోకమంతా కండ్లుఎర్రచేసిచూసింది. ఎవరికీకలిగింది దయ? 'వధ! వధ!' అని ఘోష పుట్టింది. ఏకాకిఅయినాడుపుత్రుడు. అందరు దృఢనిశ్చయులైనారు. అంత్యఘట్టము ఆసన్నమైంది. విలయకాలగర్జనములోనుంచి 'వధ' మారుమ్రోగింది. మాతృదేవి కంటతడి పెట్టింది. కంపితుడగుపుత్రుడు అస్పష్టముగా గోచరించినాడు. అందరిచూపులు పుత్రునివైపు గురిపెట్టబడినవి. విశ్వమాత సింహాసనముమీదినుంచి దిగినది. 'సర్వోత్కృష్టమైనక్షమనాది. నాపుత్రునిదోషములను క్షమించాను. నేను వధించనీయను' అని గంభీరముగాపలికింది. పుత్రుని ఆశీర్వదించినది. పుత్రుడు సాష్టాంగపడ్డాడు. అందరు భక్తితో తలలువంచారు.

## ౨. దుఃఖమయప్రపంచము

ముక్కాల్యముదుసలి తండ్రి. దృష్టితప్పినది. ఆశలన్నీ ఆఏకపుత్రునిమీదఉన్నవి. కొడుకుచేతిమీదుగాదాటుటకు క్షణములు లెక్కపెడుతున్నాడు. దీర్ఘవ్యాధిగ్రస్తుడు పుత్రుడు. జవసత్వము లుడిగినవి. స్వరము హీనము. నోటమాటలేదు. మౌనముద్రుడు. అది యోగనిద్రయా? భగవచ్చింతనమా? నేత్రకమలములు వికసించినవి. తిరిగి ముకుళించినవి. మరల వికసించలేదు. కంకటిపార్శ్వమునకూలినాడు తండ్రి. ఒక్కమారైనను చూడలేదు. పిలువనైనను లేదు. పుత్రవతియిల్లాలు. బిడ్డడుబొట్టెడు. పితృసందర్శనమెట్లు? దారుణానలములో కుములుచున్న ఆమెకు భర్తృదర్శనమేది? జీవములతో దర్శనప్రాప్తి లేదు. వృద్ధుడు పాషాణమైనాడు. గతభర్తృక అగునామె దద్దరిల్లుచున్నది. నిశ్చేష్టుడైవీక్షించినాడు అమాయకుడగు బుడతడు వీరివైవర్ణ్యముగని తల్లియొడినుండి మెల్లగజారినాడు. కళేబరమునైపు ప్రాకుచున్నాడు. ఆమె వాతనిరెక్కలుపట్టి లాగుచున్నది. వృద్ధుడు దుఃఖమునుదిగమ్రింగి బిడ్డనుపట్టుకొనినాడు. మరలదుఃఖసముద్రముపొంగినది. బిడ్డడును ఏడ్చినాడు. రెండుఉచ్చైస్స్వరములు సృష్టినికలచివైచినవి. కిన్నరస్వరమొకటికూడ బయలుదేరినది. ఆరెంటిని మధురగతుల నడిపించుచున్నది.

## 3. ఇద్దరు

వారిభోజనం ఒకపాత్రలోనే. వారిశయనం ఒకపర్యంకంమీదనే. వారిది శబ్దార్థసంబంధము. కార్పాససూత్రం వారినిజతగూర్చింది. అతడు అసూయలో ఆమెనుబంధించాడు. దోపిడిసలుపకుండా పట్టుకొన్నాడు. ఆమె కనీనికలు కాంతిని ప్రకటిస్తూ ఉన్నవి. వీక్షణాలు విశుద్ధప్రేమచిలుకుతూన్నవి. అతనికి సంతృప్తి కలగడంలేదు. ఆమె రసపాయి. జీవితామృతాన్ని మృణ్మయభాండంలోనుంచి గుటకలు వేస్తూన్నది. అతనిదృష్టి భాండముమీదనేఉన్నది. ఆమె భాండాన్ని నిశ్శేషంచేసింది. భాండం విచ్ఛిన్నము, అతనిచూపులు శూన్యభూమిపయి ప్రసరించినవి. అన్వేషణలో జిజ్ఞాస, ఆత్రము ప్రతిఫలించినవి. అతని దృక్పథానికి ఏమీ గోచరించలేదు. ఏది ఆమె? మధురసాన్ని గ్రోలి ఆనందమరీచికలలో తేలిపోయింది. సంతృప్తిగా విధినినిర్వర్తించి కృతకృత్యురాలైంది. కలతచెందినమనసుతో అతడు దిక్కులు కలయచూశాడు. బాధా సంకలితమైపోయినది. అతని సంకుచితదృక్పథము. ఈర్ష్యవిస్మృతిమహోదధిలో లీనమైనది. కవోష్ణబాష్పధారలు విస్మృతిని వెలువరించినవి. నూతనోద్రేకముతో తనవిధిని నిర్వర్తించడానికి ఉద్యుక్తుడైనాడు.

# ఆత్మార్పణము

(కావ్యవిమర్శనము)

అంద్ర శేషగిరి రావుగారు బి. ఏ.,

(సారస్వత సమాజము)

"కలదే యిమ్మెయి పౌరుషంబు జగతింగారుణ్య మేపార ని
ష్ఫలుఁగట్టిమ్మునె నేను నాదుచరితంబుల్ నిందకుంబట్టులై
తలఁపన్ వచ్చిన నింతకీడగునె యేతత్క్రూరశాఘోరచే
ష్టలు మానంగలవాఁడఁ బక్షి గురుఁడై సంధించె సద్బోధమున్."

—కవిబ్రహ్మ.

కథ ఒకదివసము ఒకరాత్రములో సమాప్తమైనది. 'అక్కటికంబులేని కలుషాత్ముఁడొకానొకబోయవాఁడు వేకువను వేటకు బయలుదేరుచున్నాఁడు. రాత్రిముగియుసరికి 'పావనదేవత్వంబువడసి వన్నియకెక్కి'నవాఁడైనాఁడు. వేకువను బోయ 'ధనుశ్శాతాశుగవాగురాదిసాధనుఁ'డగుచు వేఁటకుఁ జనినాఁడు. 'అహస్కరుఁడేపునడిమింట మండు టెండలఁగాయునికి' అతని "కలుషహింసావ్యాపార" మగ్గలమైనది. మఱి "రెండుగడియలకాలము"నకు "మిన్నెల్లనీలమేఘచ్ఛన్నము". "అబ్జబాంధవుఁడు స్తమించు" నరికి వాన, నంగుడు, ఈదర, ఇనము. "కొంతవడి కజ్జడిమెల్లనతగ్గెన్". ఇక్కడనుండియే కథయొక్క నిగ్గు.

మూఁడేపాత్రలు. బోయఁడు, కపోతము, కపోతి. బోయనిమనఃపరిణామప్రదర్శనముపైనే ఈకావ్యమునందలికళ ఆధారపడియున్నది. బాగుండెనైనఁ గరగింపఁగఁజాలు పరిస్థితులు. "దుర్గమారణ్యము"; "అదిగాక దుర్దినంబు"; "నెంజీయుంజడివాన"; "పైపెచ్చుమాస"; అన్నిటికిఁదోఁడు ఆకలిబాధ.

"అక్కటనుపలుకుదోర" యుల్లంబుకూడఁ దల్లడిల్లినది. అయినను

"ఇచ్చవచ్చినపుల్గువచ్చి చెచ్చెరివచ్చి
పాలసు మెక్కెడుగీఁత తోలఁగునొక్కొ?"

అనియే అతనిచింతనము. "జీడిమామిడిపప్పు", "కల్‌సారాయి", "కూర్మిబిడ్డ", "ప్రియురాలు" వీనియన్నిటికంటె "పచ్చిపాలసు"నేఅతఁడు తొలుతఁ బేర్కొనినాఁడు. కాని యంతలో అతనిమనము క్రమపక్వమునకు రానారంభించినది. "ఇన్ని కంతులు కోసి తినిగాని నాకంతయుంత నొప్పిలేదు" అను తత్త్వములోనికి వచ్చినాఁడు. తనదృష్టితో నితరులనుగాంచు ఈక్షుద్రగుణమునుగూడ నాతఁడు త్వరలో విడనాడఁగలిగినాఁడు. "పాపపుంద్రోవలఁ ద్రొక్కమి మెమ్ము పుడాఁద్రుంచుదురాత్ముని నన్ను నిట్లు సుభావనఁజేసి మంతే?" అనిపక్షితోనని ఇతరుల దృష్టితోఁ దన్ను చూచుకొనుటతో నాతనిహృదయపరివర్తనము పూర్తినొందినది. తనకుఁగాఁ బక్షి మంటఁబడుట చూచి

"లోకు లీకరణిం బ్రాణిలోకమునకు
మేలుగావించుచుంద్రు కాఁబోలునకట

బుట్టునందొట్టి యుపకృతిపొంతఁబోని
కట్టెఁడిని నేను నా కట్టిగతులుగలవొ?"

అనుటతో నాతఁడు ప్రాణములతోడ జన్మాంతరమునొందినాఁడు. ఇఁక నాతని జన్మాంతరము సంగతి తడవనేల? బోయఁడు కథలోఁ దొలుతఁ బ్రవేశించుచున్నాఁడు. తుదిని నిష్క్రమించుచున్నాఁడు.

కపోతము రెండవపాత్ర. అర్ధాంగియెడ నీతని అనురాగము అవధిమెఱుఁగనిది. భారతదేశకావ్యములందు భర్తలకొఱకు విలపించిన భార్యలు పెక్కుఱుగలరు. భార్యలకొఱకువిలపించినభర్తలు మిక్కిలి తక్కువ. ప్రమద్వరకొఱకురురునివలె నీకావ్యమునందలి కపోతము కపోతికొఱకు విలపించుచున్నది:

"కలిమిలేములలోన భాగంబుఁగొనుచు
మంచిచెడ్డలలోనఁ బాల్పంచుకొనుచు
మెలఁగునర్ధాంగి దూరమై తొలఁగెనేని
మగని కాధారమెవ్వరో మగువ! చెపుము."

మగువ మగనికాధారమనిన ఈమగపిట్ట తన భార్యయందు దేవీస్వరూపమును గాంచుటలో ఆశ్చర్యములేదు. అతిథిసేవలో కపోతమునకు కపోతి ఉపదేశకర్త్రి. వానకారున కట్టెలు లేకపోఁగా నిల్లుపడఁగొట్టించి యింటి దూలములు చీల్పించి వంటలుచేయించి సంతర్పణములుసాగించిన మహాదాత కర్ణునివలె నీకపోతము గూఁటిచితుకులను బోయవాని చలిమంటకిచ్చినది. ఇట్లు వానిచలిమంటకు గూఁటిచితుకుల నిచ్చుటలో లెక్కయేమి? వానికడుపుమంటకుఁదానే బలివోయెనుగదా? అతిథిసేవకు భార్యవలన ఆదేశమునందిన ఈ ఆదర్శకభర్త తాను అగ్నియందు దుముకుటకును భార్య ఆదేశము నర్థించినాఁడు.

"నీసహాయంబు లేక నాచేసినట్టి
గట్టికర్జంబొకండేనిఁ గానఁబడునె?"

అనిబ్రతికిఉన్నప్పుడు కపోతము కపోతిని గూర్చి అన్నమాటలు.

కపోతి—మొదటినుండి తుదిదాఁక భారతసతీత్వమును గుబాళించుపాత్ర. మగఁడు తన్నుగూర్చియనిన వాక్యములు వాగురాబద్ధమైనవి కపోతిపొందిన సంతోషమునకు మితిలేదు.

"మగనిసెమ్మదికి నిమ్మడి కెక్కుటయకా
కులకాంత సతతంబుఁ గోరుచుండు
నింకపలసినదేమి? నాకీభవంబు
సార్థకతఁజెందె సద్గతిప్రాప్తిదప్పె."

ఉసురులు తొలఁగువేళ తలవనితలంపుగా మగనిదర్శనము దొరకినందులకు కపోతి ఆర్తజనబాంధవునకు జోహారొసర్చినది. కపోతికి భారతాంగనకువలె దాంపత్యమెడతెగనిది; ఉత్తరలోకము కలదు; వైరాగ్యభావము హెచ్చు; "దుఃఖంపువాకిలి మూయుటకు ధైర్యకవాటము" కలదు. ఈకపోతి స్త్రీహృదయము బాగుగాఁబ్రదర్శించు వాక్యములు:

"మగఁడు నేఁడు రాక మసలెనదేమొకో
దైవమా! యటంచుఁదల్లడిల్లి
రొలుకునింతి యింట నెళ్లెడ్చుచున్నదో
జాలిఁగొల్పు దీని చరితమకట?"

అనుదానికష్టము అనుదానికిఁదెలియును. తనపుత్రులను చంపిన అశ్వత్థామనుపట్టితెచ్చి యెట్టయెదుట నిలువ ద్రోణకుటుంబిని "పుత్రశోకజనితాకులభారవిషణ్ణచిత్త" కాకుండుట కాతనిని విడిపించి తన సుస్వభావమును

చూపిన ద్రౌపది ఈసందర్భమున జ్ఞప్తికివచ్చుచున్నది. భారతభూమి సహగమనములకు సారక్షేత్రము. ఈక్షేత్రమున జనించిన పక్షులకుఁగూడ సహగమన మాచారమని ఈ కపోతిచూపినది.

ఈకపోతియు, కపోతమును దాంపత్య గూర్చి ఉత్కృష్టాదర్శము గలవారు.

"శబ్దార్థములభంగిఁ జంద్రచంద్రికల య
ట్లన్యోన్య మైత్రి నొప్పారుచున్న
మనకాఁపురంబు"

అనికపోతము.

"రమ్యకుసుమంబవీవు సౌరభమ నేను
నిండు వెలవీవు పండువెన్నెలను నేను
పదమవీవు తదర్థ సంపదను నేను"

అని కపోతి. ఇట్టి "వెలితియెఱుఁగని" పిట్టలదాంపత్యము మూలముననేగదా "కపోతదాంపత్యము"అను కవిసమయమేర్పడినది?

ఈ లుబ్ధక కపోతోపాఖ్యానము ఆర్యవాఙ్మయమునకుఁ గీర్తిఁదేఁగలకల్పనలలో నొకటి. పశువులను, పక్షులను పాత్రలనుగఁ జేకొని కథలను నిర్వహించుట ఆర్యసాహిత్యమున చిరంతనసంప్రదాయము. క్రౌంచపక్షులమూలమున వాల్మీకి కవి యయ్యెను. పక్షులకు ప్రత్యేకభాషకలదని కేకయమహారాజు చరిత్రచాటుచున్నది. నలదమయంతులకు, ప్రభావతీప్రద్యుమ్నులకు సంధానము పక్షులమూలముననే. ఇట్టి నిదర్శనము లనంతముగఁ జూపవచ్చును.

పంచమవేదముగా ప్రఖ్యాతమైన సంస్కృతభారతమున శాంతిపర్వమునం దీకథ గలదు. తిక్కన తెనిఁగించియున్నాఁడు. దానిని ప్రబంధశైలిని పెంచి శ్రీతుమ్మల సీతారామమూర్తిచౌదరి గారిట్లు క్రొత్త వెలయించినారు. చౌదరిగారు బహుద్రష్టలగుట ఘట్టుప్రభువు, పోతన్న, నన్నయ మొదలగు ఆంధ్రకవుల పోఁడిమిపోకడలిందుఁబొసఁగినవి. సీసపద్యమును వీరు ప్రబంధకవులవలె ఒక్కవర్ణనాంశమునకేగాక పురాణకవులవలె కథానివేదనమునకుఁగూడ వాడియున్నారు. సందర్భముపొసఁగినపుడెల్ల ప్రపంచవిషయ ప్రస్తావముచేసి వారు కావ్యమునకు ప్రయోజనమును కలిగించినారు. కపోతము కర్షకజనమాన్యతనుగూర్చి చెప్పినవాక్యము లిందుకు నిదర్శనము.

విమర్శకమణులు శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఈలుబ్ధకకపోతోపాఖ్యానమును గూర్చియిట్లుచెప్పినారు. "ఆర్తరక్షణార్థమై యాత్మత్యాగముచేయువారి మహోత్కృష్టప్రాభవమును, అట్టివారినడవడి కెట్టికఱకురాగుండెవానిఁగూడఁగరగించి సద్వర్తనుఁగావింపఁగాఁగల సామర్థ్యమును నీకథ ప్రతిపాదించుచున్నది." ఇట్టి ఉత్తమకథనము అన్వయకాఠిన్యము, పేలవము అనుదోషములేని సరళసుందరరచనమున ఈకావ్యమునఁ జిత్రింపఁబడియున్నది. "శరణాగతరక్షణప్రశంసాపరమైన ఈకబ్బము" బాలురును, బాలికలును ఎట్టి సంకోచమును లేక చదువఁదగినది. విద్యాశాఖాధికారులు ఇందలిమేలెంచి విద్యార్థుల కరకమలములకు దీనినందిచ్చి వారి బుద్ధికి పదార్థప్రవణమును, వారిజీవితమునకు ఉన్నతాదర్శమును హత్తుటకు అవకాశము కల్గింతురుగాక!

# జాతీయారోగ్యము : స్త్రీలకర్తవ్యము

శ్రీమతి పాలపర్తి సరస్వతిగారు

భవిష్యత్ భారతసంతానముయొక్క భావిభాగ్యోదయము ఆధునికనారీప్రపంచముపై నాధారపడి యున్నది. ఇది చాల మహత్తరమైన బాధ్యత. దీనిని నిర్వహించుటలో మన క్షేమమాత్రమును అజాగ్రతగ నుండుటకు వీలులేదు. మన జీవితములో ప్రతిక్షణమును ప్రతికార్యమును ఈమహదాదర్శమునకు అనుగుణ్యమైనదిగా నుండవలెను. మన సంరక్షణలోనున్న బాలబాలికలను మంచి శరీరపాటవముగలవారిగను, ఆరోగ్యవంతులుగను, విద్యావంతులుగను, సద్వర్తనులుగను, జాతీయాభిమానులుగను చేయవలసియున్నది. కుటుంబాదాయములో ప్రధానాంశము బిడ్డలకొరకై వెచ్చింపబడవలయును. బిడ్డలలో అనుకరణస్వభావము సహజము, కనుక వారు అనేకవిషయములను మనకు తెలియకుండగనే మననుండి గ్రహించుచుందురు. దీనినిబట్టిచూడ మనము కేవలము సర్వస్వతంత్రులము కామనియు, మనజీవితము చాల బాధ్యతలతో కూడుకొన్నదనియు స్పష్టము. మరియు స్త్రీసృష్టికి మూలకందముగా నుండియున్నది. ఆమెయొక్క ఆరోగ్యము, శరీరపాటవము, విద్యాబుద్ధులు, మానసిచిత్తవృత్తులనుబట్టి భావిసంతతియొక్క స్వరూపస్వభావాదులు నిర్ణయింపబడును. ఇదియు అన్నిటికంటె మిన్నయైన బాధ్యతయే కనుక పురుషులకన్న స్త్రీలే యెక్కువగ ఆరోగ్యశాస్త్రములను, విధులను తెలిసికొని ఆచరణయందు పెట్టవలసియున్నది. స్త్రీలలో ప్రారంభమైన యేసంస్కరణమైనను నిరాటంకముగా కొనసాగగలదు.

ఆరోగ్యవిధులలో ప్రధానమైనది ఆహారమునకు సంబంధించినది. చాలగృహములలో ఉదయమున నిద్రనుండిలేవగనే కాఫీ, టీ, కోకో, ఓవల్ టిన్ తయారుచేయుట ప్రధానకృత్యమైయున్నది. వీనిని త్రాగుట దురలవాటని ఆరోగ్యవైద్యశాస్త్రములన్నియు ఉద్ఘోషించుచున్నవి. ఇది దుర్వ్యయముతో కూడుకొన్న దుర్వ్యసనము. దీనిసంకెళ్ళలోనుండి విద్యాధికులైనవారే తప్పించుకొనలేక సందర్భశుద్ధిలేని హేతువాదనలతో దీనిని సమర్థింపచూచుట మిక్కిలి శోచనీయము. ఈవ్యయభారముచేత అనేకసామాన్యకుటుంబములు క్రుంగిపోవుచున్నవి. ఈపానీయములలో అవంతైనను శరీరపోషణశక్తిలేకపోవుటయేకాక శరీరారోగ్యభంగకరమైన విషపదార్థములుండియున్నవి. ఈదురభ్యాసము పురుషులలో ప్రారంభమై స్త్రీలకును, పిమ్మట బిడ్డలకును వ్యాపించుచున్నది. ఈదుర్భరదారిద్ర్యదినములలో దీనిని మనము ఇక నేమాత్రమునుసహింపకూడదు. కనుక స్త్రీలు దృఢచిత్తలై దీనిని తమగృహములనుండిపారద్రోలి దానివల్ల చేకూరెడి ఆదాయముతో తమబిడ్డలకు తాజాపాలను, పండ్లను, ఫలరసములనొసంగుట సర్వవిధముల శ్రేయస్కరము.

మనఆహారము చాల లోపభూయిష్టముగానుండియున్నది. దీనిలో కొన్ని ముఖ్యమైనసంస్కరణములు చేయవలసియున్నది. మనఆహారములో ప్రధానద్రవ్యములు:-వరియన్నము, కూరలు, పప్పు, పులుసు, పచ్చడులు. మాంసాహారములలో మాంసము, చేపలు, కోడిగ్రుడ్లు మొదలైనవి.

వరిఅన్నము:—మరబియ్యము చాల అనారోగ్యమైనవని ఆరోగ్యశాస్త్రజ్ఞులయొక్క అభిప్రాయమైయున్నది. ప్రతిఆహారపదార్థములోను విటమిన్లని చెప్పబడు కొన్నిసూక్ష్మమైనపదార్థములు కూడియున్నవి. వీనితోకూడ ఆఆహారపదార్థముభుజించినపుడే అది శరీరమునకుతగినశక్తిని, ఆరోగ్యమును ప్రసాదించును. మరబియ్యములో ఈవిటమిన్లు లవణములుగల పైతవుడుభాగము పాలిష్ చేయుటలో తీసివేయబడుచున్నది. అట్లు తీసివేయబడుటచే మిగిలియున్న తెల్లనిపిండిపదార్థము శరీరమునకు ఉష్ణమును శ్లేష్మమునుకలిగించు అనారోగ్యపదార్థమగుచున్నది. కనుక మన వరిఅన్నము ఆరోగ్యమైనపదార్థముగానుండవలెనన్న చేబియ్యముగా

వండుకొనుటయే సర్వవిధముల మంచిది. దంపుడుబియ్యముకూడ దీనికి కొరతపడియేయున్నవి. వరిఅన్నములో కండరాభివృద్ధినికలిగించు ప్రోటీన్ పదార్థము చాలతక్కువగానుండుటచేత ఆహారశాస్త్రజ్ఞులు దీనికి గోధుమ రొట్టె జతచేయుట చాలమంచిదనిచెప్పినారు.

కూరలు:—కూరలయొక్క ప్రాముఖ్యత చాలమంది గ్రహించుటలేదు. రుచివిహీనమైన వరిబియ్యపు అన్నము రుచికరముగా చేసికొనుటకు సాధనముగా నెంచుచున్నారు. ఇదిచాల పొరపాటు. ఈకూరలలో చాల సూక్ష్మమైనటువంటిలవణములు, విటమిన్లుకలవు.

శరీరనిర్మాణమునందు, ఆరోగ్యసంరక్షణమునందు అతిసూక్ష్మమైన ఈపదార్థములయొక్క విలువ చాల హెచ్చుగానున్నది. కనుక కూరలు మనఆహారములో అన్నముకన్న చాల ప్రధానమైనటువంటిస్థానము నే ఆక్రమించుచున్నవి. ఈపదార్థములులేనియెడల మనముభుజించినఆహారమంతయు పంటబట్టకపోవుటమాత్రమే కాకుండ రోగమునుసహితముకలిగించును. కనుక ముఖ్యముగా ఆకుకూరలు, కాయకూరలు మనము చాల ఎక్కువగావాడవలసియున్నది. ఈకూరలను వండివార్చివేసినయెడల వానిలోనున్న విటమిన్లు, లవణములు నీటితోకలిసిపోవును, కనుక వీటిని సన్ననిసెగమీద వాటినీటితోనే అవి తయారగునట్లుచేయవలెను. నీటి యావిరిమీదవండుట అత్యుత్తమమైనపద్ధతి. ఈకూరలను నేతిలోకాని నూనెలోకానివేయించుట చాల అనారోగ్యకరమైనపద్ధతి. దుంపకూరలలో బంగాళాదుంపలు పొట్టుతోకూడవండుకొనుట చాలమంచిది. ఇతరదుంపకూరలనుసయితము పైవిధమునవే వండుకొనిభుజించుట మంచిది. కాయకూరలు, ఆకుకూరలు ఎక్కువగాభుజించుటవలన మలబద్ధముతొలగుటకు ఎక్కువ అవకాశముకలదు.

పప్పు:—మనఆహారపదార్థములలో చాల ముఖ్యమైనదిగా సేవించబడుచున్నది. ఈపప్పులను కాయ ధాన్యములనుండి ఎప్పటికప్పుడు తయారుచేసికొనుటమంచిది. బజారులో నిలవయుండుపప్పులనువాడుట మంచిదికాదు. పెసలు, సెనగలు, బఠాణీలు నానబెట్టి కూరలలోవాడుకొనుటలో ఎక్కువగుణముకలదు. వండిన ముద్దపప్పు అనారోగ్యహేతువైనది. మధ్యవయసుదాటినవారు ఈపప్పునతిను టంతఆరోగ్యమైనదికాదు. పిల్లలకైనను వారియొక్క జీర్ణశక్తినిబట్టి పప్పును వాడుచుండవలెను. పిల్లలయొక్క కండరాభివృద్ధికి పప్పులలో కంటె పాలలోను గోధుమలలోనుగల ప్రోటీను శ్రేష్టమైనది.

పచ్చడులు:—మన ఆంధ్రదేశములలో ఊరగాయలవాడుక చాల హెచ్చు. ఇవి చాల అనారోగ్యమైన పదార్థములు. వీటికిబదులు ఎప్పటికప్పుడు తాజావాటిని ముఖ్యముగా పచ్చికాయలతోను, పండ్లతోను తయారుచేసికొనుట అనగా దోసకాయ, కొబ్బరిపచ్చళ్లుమాదిరివి మంచివి.

పులుసు:—ఆధునికఆహారసూత్రమునననుసరించి పులుసుపదార్థము అన్నమువంటి పిండిపదార్థముతో కలిపిభుజించుట ఆరోగ్యమునకు భంగకరము. కాబట్టి ఆహారపదార్థములలో పులుసు చాలమట్టుకు తగ్గించి వేయవలెను.

మాంసాదులు మానవునికి సహజమైనఆహారములుకావు. ఇవి క్రూరవన్యమృగములకే తగును. ఆవులు, మేకలు, గొఱ్ఱెలు మొదలగునవి శాకపదార్థములనుభుజించియే కండరాభివృద్ధిచేసికొనుచుండ, వివేకవంతుడైన మానవుడు వానినిచంపిభుజించుట చాల క్రూరకార్యము. క్రౌర్యమామాట యెటులున్నను మాంసముభుజించినప్పుడు ఆమాంసములోని విషపదార్థములనుసయితముభుజించుట తటస్థించుచున్నది. అందుచేత అవి నిషేధము లగుచున్నవి.

సుగంధద్రవ్యములు:—జీలకఱ్ఱ, మెంతులు, ఆవాలు తదితరమసాలాదినుసులు మనము చాల హెచ్చుగా వాడుచున్నాము. ఇవి జీర్ణక్రియను ఉద్రేకపరచునని కొందరు సమర్థించుచున్నారు. వీనిలో కొంత ఉద్దీపన

శక్తియున్నమాట వాస్తవమేకాని ఈఉద్దీపనశక్తి అసహజమైనఆకలిని, రుచిని కలిగించుటచేత మనము మితిమీరి భుజించుటచే తటస్థించుచున్నది. ఇది ఆరోగ్యమునకు ప్రబలశత్రువు. సామాన్యకుటుంబములలో సంభవించు చాలవ్యాధులు ఈకారణమువల్లనే కలుగుచున్నవని తెలియుచున్నది. కావున అస్వాభావికములగు రుచులను మసాలాదినుసులవల్ల ఆహారపదార్థములకుకలిగించకుండుట మితాహారమునకు చాల సహకారిగా నుండును.

ఈపైనవివరించినసంగతులతో నాసోదరీమణులు చాలమంది ఏకీభవింపరని నాకు తెలియును. సాధారణముగా చాలమంది ఈప్రకారముగా మామూలుభోజనము చేయువారందరు వ్యాధిపీడితులై చెడిపోవుచున్నారా యని ప్రశ్నించెదరు. కేవలము వ్యక్తులయొక్క జీవితమువదలివేసి జాతియొక్క సమగ్రఆరోగ్యస్థితిని పరిశీలించినచో నానాటికి ప్రజలలో శరీరపాటవముతగ్గిపోవుటయు, నిస్తేజులగుటయు, రోగనిరోధకశక్తి తగ్గుటయు, ఆయుఃక్షీణమగుటయు మనము చూచుచున్నాము. ఈదుస్థితి మనజీవనఫలితముకాక మరియేమి?

శరీరవ్యాయామము:—వ్యాయామము పురుషులకెంతయవసరమో స్త్రీలకుకూడ అంతయవసరము. సృష్టిలో ఏజీవియు శరీరకష్టముచేయక సంపాదించుకొనుటలేదు. ఒక్క మానవులలోమాత్రము ఎవరోకొందరు పండించుటయు ఇతరులు వానినికొని తెచ్చుకొని భుజించుటయు తటస్థించుచున్నది. ఈదుస్థితి స్త్రీలలో చాల హెచ్చుగనున్నది. పూర్వకాలమున స్త్రీలు ముడిపదార్థములను తెచ్చుకొని వానిని పచనమునకుపీలగునట్లు తయారుచేసికొనుటలో కొంత శరీరశ్రమ చేయవలసియుండెడిది. నేడాస్థితియు తప్పిపోయినది. ఆకారణమున స్త్రీలలో సోమరితనముఏర్పడినది. దీనివల్ల అనేకమైనవ్యాధులుకలుగుచున్నవి. శరీరములోని అవయవములకు పనిలేకున్నచో అవి నిర్వీర్యములగును.

అవి సహజచైతన్యములో దీప్తిమంతములైయుండవలెనన్న కొంతశరీరపరిశ్రమ అవసరమైయున్నది. ఈ పరిశ్రమ గృహనిర్వాహకకార్యములద్వారాయేర్పడుట సర్వవిధముల ఉత్తమమైనది. దానికిబదులుగా శరీరమందలి సకలఅవయవములకు పరిశ్రమకలుగచేయు వ్యాయామమునైనను చేయవలసియుండును. స్త్రీలలోకల అనేకవ్యాధులు ఈవ్యాయామమువల్లనే నివారణకాగలవు. పైన వివరించినసంగతులనుబట్టి జాతీయారోగ్యమును స్త్రీలు ఎవ్విధమునసంరక్షింపగలరో ఆవిధానము విదితముకాగలదు. జాతికి కుటుంబముపునాది. కుటుంబమునకు స్త్రీ సంరక్షకురాలు. కనుక కుటుంబముయొక్క ఆరోగ్యమునుకాపాడుటకు ప్రతిస్త్రీయు పూనుకొనినచో అత్యల్పకాలములోనే జాతీయాభ్యున్నతి చేకూరకలదని నిస్సందేహముగా నేచెప్పవచ్చును. దీనికన్న ఉత్తమమైనదేశసేవలేదని నాసోదరీమణులు గ్రహించెదరుగాక యని ప్రార్థించుచున్నాను.

## పల్లెటూరి యుపాధ్యాయిని

సిరిపి ఆంజనేయులు గారు

సీ. ఎల్లరమనముల నీడ్చిపట్టఁగఁజాలు
విమలానురక్తి మూలముగఁదనర
వక్రగతిఁదార్చు వైలక్ష్యమడుగంటఁ
గ్రమశిక్షణము ప్రకాండముగఁబర్వ
సత్ప్రవర్తనము మేల్స్కంధమై విలసిల్ల
నయగుణతతి పత్రచయముగాఁగ
భవ్యంపుఁగళలు పుష్పములుగాఁజెలువాఱ
విజ్ఞాననిధి ఫలవితతిగాఁగ
అమరభూజమునకుఁ దుల్యమై తలిర్చు
పల్లెటూరికి దివ్యసౌభాగ్యలక్ష్మి
యనఁగ నెప్డు తదీయవృద్ధినిగణించి
నెగడవలయు నుపాధ్యాయినీమతల్లి.

# రుక్మిణీ లేఖ

విద్యార్ణవ, సాహిత్యసరస్వతి నూతలపాటి పేరరాజుగారు

"భువనైకసుందరా! పురుషాగ్రగణ్యా!
భవదీయసుందరపదపద్మములకు
భక్తితో నొనరింతు వందనశతముఁ
గొనుము దయాస్ఫూర్తి గోపాలబాల!
పుట్టినదాదిసముజ్జ్వలత్కుంద
తారహీరసమాఖ్యఁ దనరారెదంచు,
భవ్యమంజులమృదుభాషి. వీవంచు,
మునిజనచిత్తాబ్జముల నుండెదంచుఁ
గమనీయతరరూపకలితుండవంచు,
నిరతోదితకరుణానిధివీవటంచు,
లావణ్యసర్వస్వరమణుఁడవనుచు,
నిన్నె వరింపంగ నెమ్మదిందలఁచి,
వాంఛఁ బెంచితి నిన్ని వత్సరంబులును;
నేఁడు వ్రాసితి లేఖ నీతియే లేక
మదవతియలిఖించె మందాక్షమీఁగి
యని నిరసింపక యరయుము కమ్మ.
నాజనకుండు నన్నర్మిలి నీక
పరిణయవేళ వైభవమునంగూర్తు
నానిర్ణయించిన నాయగ్రజుండు
తండ్రినిర్దేశంబు తగదుకాదంచుఁ
చైద్యున కేనిత్తుఁ జంపకనాస
ననిమూర్ఖుఁడై కమ్మననిపె నాతనికి;
పాణిగ్రహణవేళఁ బ్రబలుఁడై చేది
ధరణీధవుం డరుదార కుండినముఁ
జేర నేతేరఁగాఁజేరి-కంసారి!
మదసామజమ్ము పద్మముఁబట్టుకరణి
మృగశాబకముఁగొట్టు వృకముహరువును
చైద్యుండు నాపాణిజలజ ముద్వాహ
వేళ గ్రహింపంగఁ బ్రీతిఁబెట్టుటయు
నొకటియా నెంచ నేతోయజ కంజాక్ష!
నీపదాంబుజసేవనేఁ బాయఁగలనె?
మన్నించి కొనిపొమ్ము మానితాకార!
కల్యాణపూర్వంబు గౌరీనివేశ
మందునేనుందు నమందభక్తిఁ గను
నార్యాసమర్చనాధ్యానలీననయి
విలసిల్లుతఱిఁగాంచి, విమతనికాయ
మాజనిర్జించి, సమ్మానంబున ననుఁ
గొనిపోవుభాతి వాకొంటి మానాథ!
ఆఁడుకుయ్యలు మన్ననార్హంబటంచు
మదినెంచికృపయుంచి మద్ధితుండవయి
చరియించిచెలఁగనే శరణంటి, దీని
వల్లభంబుగఁ గొనఁ బ్రణుతి. —రుక్మిణి."

# హైందవసతి

యండమూరి వేంకటరమణగారు

సీ. పతిపదద్వయి మనఃపద్మపీఠిని నిల్పి
భజియించు నిర్మలభక్తురాలు
భర్తృజీవితకావ్యభవ్యరసాస్వాద
నాయత్తచిత్తయౌ ప్రాజ్ఞురాలు
స్వార్థవిరహిత మనంత మేకాగ్రమౌ
ప్రేమమైత్రియుఁ జన్ను ప్రేమమూర్తి
భవయాత్రయందు సంభవమైనకష్టముల్
ధృతినోర్చు వెలసెడి ధీరురాలు
గీ. బహుళలౌకికవ్యాపారభారమునను
నలసి పొలయుపూరుషహృదయాబ్జమునకు
నవ్యశోభ నిత్యమొసంగు దివ్యశక్తి
యతులితాధ్యాత్మబలవతి హైందవసతి.

# సుప్రియ

ఆకుండి వేంకటశాస్త్రి గారు

బౌద్ధయుగమున తనత్యాగముచేతను సర్వసంగపరిత్యాగముచేతను మానవసేవనొనర్చుటకు తనశారీరక మానసికసంపత్తులనుధారవోసిన సుప్రియ హైందవనారీలోకమున నాదర్శప్రాయయఁజనునుగదా!

సుప్రియనుగూర్చి తెలిసికొనుటకుముం దామె యేమహనీయుని సమకాలీనురాలో యామహనీయుని గూర్చియు తెలిసికొనవలసియున్నది. భోగాలవాలమగు రాజకుటుంబమునబుట్టి, ఐహికభోగభాగ్యాదుల నెడి తల్లియుత్సంగముపై కూర్చుండి, భోగములననుభవించుచు జీవితమును మహావైభవమున గడుపవలసిన వాడు, తాను త్యాగస్వరూపనిర్వచనముచేసి లోకమునకు చూపుటకై, ఆదర్శకమగు సర్వసంగపరిత్యాగమునుజేసి మోక్షోపాయమును వెల్లడించిన బుద్ధమహనీయునికాలమున నీసుప్రియ సుప్రకాశముతో తన యోపిన కొలంది మానవసేవగావించిన ధన్య. హిందూదేశచరిత్రపఠనాసక్తుడగు విద్యార్థి బౌద్ధయుగమునుగూర్చి చారిత్రకవిషయములనుజ్ఞప్తికి తెచ్చుకొనునవసరమున సుప్రియయు, యామె బౌద్ధమతప్రచారసందర్భమునచేసిన సేవనుమాత్రము మరచియుండఁజాలడు.

ఇక బౌద్ధమతము ప్రపంచమునకు సందేశరూపమగు గొప్పప్రబోధమును జేసియేయున్నదిగదా! మనుజుని దేహచ్ఛాయ, జాతి, మతము అనువ్యత్యయములనెడుసంకెలలనుండి విడివడి సర్వమానవసౌభ్రాతృత్వమును, అందును జన్మముచేత ఛండాలుడైనను గుణముచేతను త్తముడైనను కాకపోయినను తోడిమానవుడను భావముతో వానిని ప్రేమించుటను ఈ బౌద్ధమతమేగదా ప్రబోధించినది!

సుప్రియ వైశాలీనగరమున (ఉత్తరబీహారురాష్ట్రము) పుట్టిపెరిగినది. సుప్రియతండ్రిని బౌద్ధమతము నందుజేర్చుటకొరకు లాతనియింటికి వచ్చుచుపోవుచుండిరి. ఈమెతండ్రికి యీమెయొక్కతెయేకుమార్తె. ఈమె తండ్రియాస్తికి యధికారిణిగా, తండ్రివలనఁ జేయఁబడకపోయినను, యీమె యనర్ఘగుణమణిగణములకై, యీమెను పెండ్లాడ నెందరో యువకు లాశగొనియుండిరి. ఈమె చక్కదనాల చుక్కయని చెప్పదగును. నవనవోన్మేషయౌవనమునకును, విదుషీత్వమునకును ఈమెయొక్క. సౌందర్యాధిదేవతగా మనునొందెను. బాల్యమునందే యామెకు భౌతికప్రపంచము నందలి భోగములు, వానియందు మానవుని లాలసత, భోగముల యస్థిరత్వము; భిక్షుకజీవితమును గడపుచు ధర్మమును ప్రజలలో ప్రబోధమొనరించుచు జీవితమునుధన్యమొనరించుకొనుటలోగలఘనతను నాదర్శనిర్వహణకాంక్షయు నామెహృదయమును కలవర పఱచెను.

చిత్రదత్తుడు పదిమి వయస్సుగలవాడైయున్నప్పుడు గౌతమబుద్ధుని యున్నతధర్మసూత్రముల యౌత్కృష్ట్యము నెఱింగి భౌతికభోగములత్యజించి, తీవ్రమగు నియమములకాలవాలమగు బౌద్ధభిక్షుకుడయ్యెను. తానునిలువఁజేసిన పలుపదిలక్షలబంగారునాణెముల ధనమును బీదల సంరక్షణకై వ్యయముచేసెను. బౌద్ధభిక్షువులసంఘము, చిత్రదత్తుని తమసంఘమునఁజేర్చుకొని యితనికి సార్థకమగు "అనంతపిండద" అనుబిరుద నామము నొసంగి యతని యపూర్వమగు యౌదార్యమును యాదర్శముగను స్మరణీయముగను అగునట్లుగనుజేసెను. వర్తక జనచక్రవర్తియగు నీతడు బౌద్ధభిక్షుకసంఘమునఁజేరి బౌద్ధసంఘమునకు పన్నెండువాసీయము గలుగఁజేసెను. చిత్రదత్తుడు బౌద్ధధర్మములను లోకమున ప్రచారముగావింప తటాలున ప్రబోధితుడై తనసర్వస్వము నట్టె విడిచిపెట్టిపోవుటలో కుమార్తెయగు సుప్రియ కట్టియాస్తియు జాగ్రత్తపెట్టియుండలేదు. ఇట్టిత్యాగశీలికావేళ

మున సంసారమునుత్యజించిన బుద్ధుడును, గౌరాంగుడును నిట్టిపరిస్థితులలోనే తమసర్వస్వములనుత్యజించి లోకమునకు జ్ఞానభిక్షనిడి యద్భుతమైన ప్రబోధమొనర్చిరి.

సుప్రియ తనకు గలిగిన నిరాధారస్థితికి వగవలేదు. తనతండ్రి, కుటుంబమును, అధికముగ ప్రేమించు తన్ను యటులవిడిచిపెట్టిపోవునని తలచియుండలేదు. చిత్రదత్తుడు బౌద్ధమతస్వీకారము చేయకముందు ఎందరెందరో తనతండ్రియింటికివచ్చి బుద్ధునిగూర్చియు నాతని మతప్రాశస్త్యమునుగూర్చియు ప్రసంగించుచుండగా, సుప్రియ వినుచు నుండెన్నడో తానుగూడ స్త్రీయైనను తనతండ్రి వెనువెంటనే భిక్షుకియగుచు బౌద్ధమతప్రచారము సలుపనెంచెను.

తండ్రియు, కుమార్తెయు బౌద్ధమతము నవలంబింపక పూర్వము, సుప్రియకుతండ్రి వివాహముచేయ నిశ్చయించెను. అంతఃపురస్త్రీలామెను వివాహమునకై యలంకరించిరి. వివాహకాంక్షలుగాని, భావిసంసార సౌఖ్యములను గూర్చిగాని యామెహృదయము తహతహపడలేదుగాని, తానెప్పుడు భిక్షుకియై దుఃఖాలకాల వాలమగు లోకమును సంస్కరించి దుఃఖకారణములను తొలగింప బౌద్ధమత ప్రబోధమొనరింప వేగిరపడు నామె యొకనిశీధమున గృహమువిడచి వెడలిపోయెను. బంగాళాదేశమున నుత్తరభాగమునమన్న శ్రావస్తి పురమున నొకగొప్పక్షామము పట్టెను. ఆవత్సరముపంటలు పండనందున జనులు తిండిలేక యల్లాడుచుండిరి. బుద్ధుడు తనయనుచరవర్గమునుపిలచి "మీరు శ్రావస్తిపురజనులకు క్షామబాధనివారించి మానవసేవ చేయుడు" అనిబోధించెను. అతని యనుచరులలో పురుషులందఱును తమతమ యసమర్థతలను ప్రకటించుచు తామట్టి పనిచేయజాలమని యెవరికి వారేతప్పించుకొనిరి. అంత బుద్ధుడు యనుచరస్త్రీవర్గము వంకఁజూచి మీలో నెవ్వరైన శ్రావస్తిపురజనుల బాధనివారింప సేవనొనర్పగలరాయనియడుగ సుప్రియ ముందునకు, భిక్షునికితగిన వస్త్రధారణముతోవచ్చి బుద్ధునిసమీపించి "స్వామీ! నేను శ్రావస్తిపురజనులకు భోజనమిడి సేవఁజేయుదును. ఆశీర్వాదపూర్వకముగ యాజ్ఞయిం"డని వేడెను. బుద్ధభగవానుడు "ఈయగ్నిపరీక్షలో నీవు నేరి యాదర్శక మగు మానవసేవ యొనరింతువుగాత"మని యాశీర్వదించెను. పలుపురుపురుషులామె తెగువను తెగడిరి. సుప్రియ వారిపరిహాసవాక్యములనువినెను. కాని పరిగణింపలేదు. మానవసేవానిరతిచే యామె పునీతయై తనధర్మమును జయప్రదముగ నిర్వహించెను. బుద్ధుని బోధాబీజములు చవిటినేలపై పడలేదు. బుద్ధునికాలమునుండియు మనదేశమునందు పురుషులయందేమి, స్త్రీలయందేమి మానవసేవానిరతి, మతప్రబోధవాసక్తి (Missionary Spirit) వెలకొనియున్నది.

## రాధాకృష్ణ

కోలమూరి వేంకటరామయ్యగారు

శ్రీమనఃకాంతుడై నట్టి శేషశయను
డెల్లలోకంబులకునాన యేలికౌట
పాపపుణ్యంబులెల్లను బరగజూచి
దానధర్మంబులెల్లను దరచితరచి
ముక్తినొసగుట భక్తులకక్తిగనుట
తనకువిధియౌటచేతనే ధరణిమీద
నవతరించుచునుండును నాదిదేవు

డిలను కృష్ణావతారుడై నెలసియుండ
రాధయనియెడిగోపికారమణి కృష్ణు
డవతరించెనుభూమిపై నతనుతండ్రి
గాకయున్నను యామహౌఘనునునరుసు
గాడటంచును సకళంకగాఢభక్తి
పూజలొనరించుచుండె నాపూవుబోడి
అమ్మహాసాధ్విపూజలునాత్మగొనుచు

కృష్ణుఁ డొకనాఁడు పయనమైగోపబాల
రాధగృహమునకుఁ బోయె రమణిరాధ
కృష్ణుజూడంగ నెనలేని కోర్కెలొదవ
నెదురుగాఁబోయి కేల్వట్టి యింటిలోని
కపుడు దోడ్కొనిపోవుచు నధికభక్తి
నుచితయాసమును దెచ్చి యుత్పలాక్షి
యమ్మహాత్మునిగూర్చుండ నాజ్ఞ వేఁడ
మోముసందునచిరునవ్వు మొలకలెత్త
హృదయకమలంబు వికసింప హృద్యముగను
యాసనాసీనుడయ్యెను భాసురముగ
నంత రాధామహాకాంత సంతసమున
జలముఁగొనివచ్చి పదజలజములనపుడు
కడిగి యానీరు శిరముపై గలయఁజల్లు
కొనియు పుష్పంబులను దెచ్చి కుధరధరుని
పాదములుపూజసేయుచు పడతివలికె
"ఓంనమోదేవ లక్ష్మీశఓంస్వరూప
ఓంనమోదేవ గోవింద ఓంస్వరూప
నిన్ను దలచినపాపముల్ నిలువవయ్య
నిన్ను పలుమారుస్మరియింప నిలుచుసుఖము
నిన్నుజూచినమాత్రాన నిందతొలగు
నిన్నుదైవమటంచును నెన్ను నరుడు
నరకమొందఁడు నిక్క మోనీరజాక్ష"
యనుచువందనములు జేసి యబ్జవదన
అరటిపండ్లనుగొనివచ్చి యధికమైన
భక్తిసంద్రంబుననుమున్గి భామయంత
తనువుమరచెనుతాఁజేయు పనియుమరచి
గుజ్జువర్జించి చర్మమే కోమలాంగి
కృష్ణునోటను బెట్టుచు కలుకుచుండ
సర్వమునుజూచుచుండి యాసర్వసాక్షి
నగుచుదినుచుండె మదిలోననాహాయనుచు
సగముదిన్పించె నీరీతిచానకంత
మదికిదోచెను నీచేత మైవడంక
నయ్యవోయేమి నావెర్రియమ్మహాత్ము
కెట్టిద్రోహంబుచేసితి కేమిసేతు
ననుచుచింతించిచింతించి యాత్మవగచి
మిగులజాగ్రతబూని యమ్మించుబోడి
త్వక్కువిసరుచుగుజ్జునే తక్షణంబ
గృష్ణునోటనునిడినంత గుజ్జునపుడు
నుమిచివైవగ నదిగాంచి యువిదయనియె
దేవదేవులదేవుడ దీనరక్ష
నీదుచరణంబులెప్పుడు నెమ్మిగొలుతు
దప్పుచేసితిదండించు తప్పులేదు
నేరమొనరించవెంటనే చేరదీసి
శిక్షవిధియింపదగుగాని శ్రీనివాస!
తప్పుసవరించుకొనువేళ తప్పుదలచు
నిరసనాభావమేలనో నీరజాక్ష
యనినమాధవుడిట్లను నాదరమున
నీవుత్వక్కును ముందుగా నొసగువేళ
నిష్కళంకముగానుండె నీదుమనసు
యపుడెరుచియించునాకేదియైనగాని
గుజ్జదినిపించుసమయానకుదురులేని
మనసుతోబెట్టనాకేమి మంచిదోచు
భక్తితోనన్నుగొలిచెడి భక్తులకును
భక్తునౌదును పడతిరో! ముక్తినిత్తు
నంతియేగాని ధనవాహనాదులిడిన
విషముగాదోచు మదిలేనివిషమపూజ
అన్యమెరుగనిభక్తిలో నైక్యమగుచు
నన్నుత్రుటికాలమైనను నమ్మియున్న
జీవి ననయంబుబ్రోతును జేర్చుకొందు
నన్నువానిని నొకటిగా నంబుజాక్షి!

డాక్టరు కే. ఎస్. కేసరిగారి బంగారు పతకము బహుమానము పొందిన వ్యాసము

# ఆంధ్రరాష్ట్రము : స్త్రీలు

శ్రీమతి కొప్పర్తి కృష్ణవేణిగారు

[నెల్లూరు ప్రోగ్రెసివు యూనియనువారు ప్రతివత్సరమును ఆంధ్రస్త్రీలకు వ్యాసరచనమున పోటీపరీక్ష నొకదానిని నిర్వహించుచున్నారు. ఈపరీక్షకుగాను పంపబడు వ్యాసములలో నుత్తమమగుదానికి డాక్టరు కే. యస్. కేసరిగారు ఒకస్వర్ణపతకమును ఇచ్చుచుండుటవాడుక. ఈవత్సరము పోటీవ్యాసము 'ప్రత్యేక ఆంధ్రరాష్ట్రమువలన, ఆంధ్రస్త్రీలకుగలుగులాభములు' అనువిషయమునుగూర్చి. ఇందుకు అయిదుగురుస్త్రీలు పోటీచేసిరి. శ్రీమతి కొప్పర్తి కృష్ణవేణమ్మగారురచియించిన క్రిందివ్యాసము బహుమానార్హమని పరీక్షాధికారులు నిర్ణయించిరి. దానిని యథామాతృకముగ ప్రచురించుచున్నాము.

—సంపాదకుడు]

"నాభాష, నాసంఘము, నాదేశము" యని యనుకొని గర్వమునొందని దేశీయుడు ఈనాటి ప్రపంచమున నుండడు. ఈయుగమునకు యంత్రయుగమని కొందరును, భావయుగమని కొందరును, మఱి యనేకవిధములుగ పేరులనిడుచున్నారు. నాయభిప్రాయము ఇది దేశీయభావయుగమనియును, మున్ముందు *ఈదేశీయభావయుగము †అన్యోన్యదేశీయభావయుగములోనికి మార్పుచెందుననియును. నేను తెల్లవాడను, నాతెల్లవారు నాసోదరసమానులు అని విర్రవీగని పాశ్చాత్యుడులేడు. నేను మాట్లాడునది జర్మనుభాష, నేనునివసించునది జర్మనుదేశము, నాభాషమాట్లాడునాదేశీయులు నావారేయని గర్వపడని జర్మనుడులేడు. ఇట్లే ఫ్రాంసుదేశీయుడును; ఆంగ్లేయుడును. ఇట్టి దేశభక్తినికలిగి దేశౌన్నత్యముకు పాటుపడు ఆంధ్రుడును.

ఆంధ్రరాష్ట్రము! దేశభాషలలోనికెల్ల లెస్సయై, పాశ్చాత్యులచే 'తూర్పుదేశముల ఇటాలియను' అని వేనోళ్ల పొగడబడిన యాంధ్రవాణిని దేశభాషగాగల మనమాంధ్రులము! ఇతిహాస, పురాణప్రసిద్ధికలిగి, పూర్వచరిత్రమున యపూర్వచరిత్రమునుకలిగి, మహావీరులకును, వీరవనితలకును పేరుపొందిన ఆంధ్రదేశము మనఆంధ్రుల సమానసామాన్యమాత. జాతిమతవివక్షలులేక, ఒకేచరిత్రనుకలిగి, ఒకే ఉద్దేశ్యములతో ఒకేఆశయములకు పాటుపడుచున్న మనయాంధ్రరాష్ట్రము. మనస్పర్థలులేక, లోలోనకక్షలు పెట్టుకొనక, మనసంఘములు, మనక్షేత్రములు, మనవేషములు, మనవ్యవహారములు, మనగౌరవము, మనపరపతి, మన కష్టములు, మనసుఖములు, మనభాగ్యము, మనస్వప్రయోజనములు, మనశ్రేయస్సు, మనక్షేమములు, మనశుభములు, మనయభివృద్ధి, మనసహజమహోన్నతియని "మన" యను సామాన్యఆశయపూరితమైన ఆంధ్రుల ఆంధ్రరాష్ట్రము! అనఘమైన, కృత్రిమరహితమైన, నీతిపూరితమైన దేశభక్తితో, ప్రాపంచికజ్ఞానమునకు సహకారిఅవబోవు మనయాంధ్రరాష్ట్రమనిన ఏఆంధ్రుడు పురుషస్త్రీవివక్షతలేక మనోగర్వమును పొందడు?

* Age of National ideas, † Age of International ideas.

— అట్టి ప్రత్యేకఆంధ్రరాష్ట్రము మనకు రాఁగోరుచున్నాము. నేఁడో, రేపో పొందుదుము. తత్పూర్వము, మనరాష్ట్రము నెట్లునిర్మాణము చేయవలయును? మన రాష్ట్రవృద్ధికి ఎట్లు ప్రయత్నింపవలయును? మనరాష్ట్రమహోన్నతి నెట్లుతేఁగలము? అను ప్రశ్నలు మన మున్ముందున్నవి. అనేకవిషయములు విశదపఱచుకొనుట, అనేకమగుచిక్కులు విడదీయుట, అనేకప్రశ్నలు సమాధానముచేయుట రాష్ట్రనిర్మాణకర్తల విధియైయున్నది. వీరిబాధ్యతలలో విఘ్నేశ్వరపూజ ననుసరించునది, ముఖ్యమైనది, ఉత్కృష్టమైనది స్త్రీప్రశ్నయని నే వేఱుగఁజెప్ప నక్కరలేదు.

ప్రత్యేకఆంధ్రరాష్ట్రమున స్త్రీలకు ఎవ్విధములగు బాధ్యతాయుతహక్కులను ఇవ్వవలయును, ఎట్టిప్రత్యేకసౌకర్యములు స్త్రీఔన్నత్యవృద్ధికి కలుగఁజేయవలయునుయను మన స్త్రీవిషయములు. ఈవిషయములు రాష్ట్రనిర్మాణకులకంటె మనమే మున్ముందు తేటతెల్లముజేసికొనుట ముఖ్యము. మనమే వారిముందు హక్కులనుపెట్టుటవలన మనసమర్థత తెలియవచ్చును.

ఈచర్చకు నేనొకసంగతిని విశదపఱచెదను. పురుషులలో, "స్త్రీలు సహజసమర్థులు కారని," ఒకగొప్పతప్పు అభిప్రాయముఉన్నది. నెపోలియను అంతటి మహారాజ్యతంత్రవేత్తకూడ స్త్రీవిషయమున పొరపడియున్నాడట. అతఁడు అతని దేశచరిత్రయే యెఱుఁగఁడు కాఁబోలు—తన దేశమును ఒకానొక సందిగ్ధవిపత్తునుండి స్త్రీవాచకమగు వ్యక్తికాపాడి దేశస్వాతంత్రమును పునరుద్ధరించినదని! ప్రపంచములో ఏదేశచరిత్రయైనఁజూడుఁడు. పురుషులతో సమానముగను, ఒకానొకస్త్రీ పురుషునికంటె ఎక్కువగనుకూడ తనవ్యక్తిత్వమును జూపిన సమయములు లెక్కలేనన్నియున్నవి. అప్పుడు నెపోలియను, ఇప్పుడు సీనియరు మసోలినీ వీరు రాజ్యతంత్రజ్ఞులుకావచ్చుకాని వీరు స్త్రీవిషయమున నిందునున్నలుఅని వక్కాణింపవలయును. ఈఅభిప్రాయము ఇప్పుడునుకూడ ప్రజామోదమయి యుండుట చాలశోచనీయముగు విషయము. అట్టివారు స్త్రీలనినీ సహజవిరోధులయినను అయియుండనోపు, లేక వారు చరిత్రయనునది ఎప్పుడును చదవకపోయిఅయిన నుండనోపు. నిష్పక్షపాతముగ స్త్రీపురుషప్రశ్న నాలోచించువారు బహుకొద్ది. పూర్వమున దేశముల నైపుణ్యముగ నేలిన రాణులులేరా? మంత్రిత్వమునునడపిన స్త్రీమంత్రులులేరా? గ్రంథములువ్రాసిన స్త్రీకవులులేరా? వేదాంతశాస్త్రజ్ఞులగుస్త్రీలు, నీతిశాస్త్రపారాయణలగుస్త్రీలు ఎందరెందరోకలరే! దూరమోపోనేల మనదేశచరిత్రను ఎంత అజాగ్రత్తగచదివినను—పురాణస్త్రీలు మనకక్కరలేదు—మగనికి సాయమేఁగి యుద్ధముచేసిన ధీర రాణిసంయుక్త, తనరాష్ట్రస్వాతంత్రమునకై పోరాడిన లక్ష్మిబాయి మొదలుగాఁగల వారెందరున్నారు? మన ఆంధ్రమున మహాకవులలో లెక్కపెట్టనగు రామాయణమువ్రాసిన మొల్ల, రణరంగమున యుద్ధముజేసిన రుద్రమదేవి, సమయమున తన ప్రాణమునకు వెరువక స్వహత్యజేసికొనఁగలిగిన మల్లమ

దేవి. ఈవిషయమున ప్రకృతిశాస్త్రజ్ఞులలో భిన్నాభిప్రాయములుండుటకూడ చిత్రమే—పురుషుని పుర్రెకును, స్త్రీపుర్రెకును బరువుభేదమున్నదని, కనుక తెలివితేటల భేదములు కూడనున్నవనియును! ఇప్పుడిప్పుడు ఈపరిణామములు వారు సరికావని ఉపసంహరించుకొనుచున్నారు.

నవీనప్రపంచకమున చూడుడు. నిన్నటి ఆంగ్లేయలేబరుప్రభుత్వమున స్త్రీ మంత్రిపదవిని నిర్వహించినది. పశ్చిమదేశములలో అన్నివిధములగు పనులను పురుషులతోపాటు స్త్రీలు చేయగలుగుచున్నారు. రాజ్యాంగములో ఉద్యోగములలో వృత్తులలో వ్యాపారములలో సంఘమున స్త్రీలు చక్కని ప్రావీణ్యతను జూపకలుగుచున్నారు. యూరపులో పోలీసు దళములలోను, అమెరికాలో సేనాదళములలోను స్త్రీలున్నారు. కొన్నిచోట్లస్త్రీలే ఎక్కువ నిపుణతగ పనిచేయుచున్నారని గవర్నమెంటువారు ఒప్పుకొన్నారు. మొన్నటి స్వరాజ్యోద్యమములలో భారతస్త్రీలు అన్నివిషయములోగూడ పురుషులతో సమానముగ సమర్థతజూపిరని ప్రపంచకమంతయును భారతనారీమణుల సహజశక్తిసామర్థ్యౌన్నత్యములు వేనోళ్ళ పొగడబడియున్నది. అందులో ఆంధ్రస్త్రీలకుకూడ ముఖ్యభాగమున్నదని నేను ప్రతియాంధ్రునితోనూ, ప్రతి ఆంధ్రనారీమణితోను సమానముగ గర్వము నొందుచున్నాను. గర్వము నొందకుండనుండజాలకపోవుచున్నాను.

ఆంధ్రరాష్ట్రనిర్మాణకులుకానిండు, స్త్రీలుకానిండు, ఇప్పుడు చర్చ స్త్రీలు సహజముగ ఎంతవరకు పురుషులతోపాటు బాధ్యతలు నిర్వహించుకొనకలుగుదురు కాదు. ఆంధ్రస్త్రీలు ఉన్నతస్థితిలోనుండి పురుషులతోపాటు సమానవర్ధనము నొందుటకు సౌకర్యములు, వారికి కావలసినవి. సమానబాధ్యతలు, హక్కులు పురుషులతోపాటు ఆంధ్రస్త్రీలు పొందుదురు. పొందుటకు సమర్థులును. వారి జన్మహక్కులను ఎట్లు, ఎప్పుడు కలుగజేయుటమో యనునది విమర్శనీయము.

దీనికి మొట్టమొదట చేయవలసినది ప్రతియాంధ్రుడును తన ఆంధ్రస్త్రీ సమర్థతను గురించి అనుమానమును పోగొట్టుకొనుట. రెండవది స్త్రీగూడ తనతోపాటు సమానహక్కనకు సహజసామర్థ్యమును జూపగలదని. ఈఅభిప్రాయముమార్పుదలవలన అనేకములగు లాభములు ఆంధ్రపురుషులకును, స్త్రీలకును-అనిన ఆంధ్రరాష్ట్రమున కంతకును-అపారశ్రేయములు కలుగుననుట నిర్వివాదాంశము.

స్త్రీలకు గృహనిర్వాహకత్వమునందు సమానత, రాజ్యనిర్వాహకత్వమున సమానత, అనునవి స్త్రీలు పొందునట్లుచేయుట ఆంధ్రులకర్తవ్యము. రాజ్యాంగమున స్త్రీలకు పురుషులతోపాటు ఎన్నికలు, ప్రత్యేకముగ నియమితస్థానములు రాబోవు ఆంధ్రరాష్ట్రనిర్మాణమున స్త్రీల ఆశయములు. సంఘగౌరవము, ఉద్యోగగౌరవము, వృత్తిగౌరవము మొదలుగాగల సమానఉన్నతగౌరవములు ఆంధ్రస్త్రీలహక్కులు.

ఆంధ్రస్త్రీలు సరియగు భారతనారీమణులవలె సుగుణసంపత్తి కలిగినవారు. వారి ఔన్నత్యము, ప్రేమ, అనురాగము, ఓర్పు, శాంతము, ఘనత, సాహసము, తెలివి, ప్రతిభ కొనియాడతగినవి. విద్యావ్యాసంగమునందును, నాగరికతయందును ఆసక్తిగలవారు. కొన్ని దేశములలోని పాశ్చాత్యస్త్రీలవలె హద్దుమీరువారుకారు. ఆంధ్రస్త్రీల స్వభావము, నడవడిక, యోగ్యత వారిని రాబోవు ప్రత్యేకరాష్ట్రమున చక్కని పురజనులగునట్లు చేయు సులక్షణములు. కార్యదీక్షయందును, ప్రజ్ఞయందును, ప్రతిభయందును వారు భారతస్త్రీల కెవ్వరికిని దీసిపోరు. ఆంధ్రస్త్రీలలో పురుషులకు సమానమైన ప్రజ్ఞావంతులును, రాజనీతి శాస్త్రజ్ఞులును, కవులును, వాక్చాతుర్యధురీణులును, కార్యనిపుణులును ముమ్ముందు ఆంధ్రుల యదృష్టమునకు అస్థికర్తలై యున్నారు. ఈ ఆంధ్రనారీమణులు దేశసేవలో ఆంధ్రులభాగమైయుంట లోకవిదితము. ఆంధ్రప్రతిభలో ఆంధ్రవనితలకు సగముభాగమున్న దనుట గర్వోక్తి కాదనుకొనుచున్నాను.

వీరికి వీరి సహజగౌరవస్థానము నిచ్చుటయే ఆంధ్రులవిధి. ఉన్నత ఉద్యోగములును, గౌరవఉద్యోగములు ఆంధ్రస్త్రీలకు కలుగుట ప్రత్యేకాంధ్రరాష్ట్రమున తదితరప్రయోజనములు. అక్కడక్కడ స్త్రీలను గౌరవన్యాయాధిపతులు మొదలయిన బాధ్యతకలిగిన ఉద్యోగములకు గవర్నమెంటువారు నియమించుట స్త్రీలు వానిని బాధ్యతతో నిర్వహించుట తెలిసినవిషయమే. ముందు తక్కంగల డిపార్టుమెంటులలోగూడ వారికి తగినట్లు చేర్చుదురు.

స్త్రీజ్ఞానాభివృద్ధి వీనికన్నింటికిని మూలము. ఇప్పుడు బాలికలజ్ఞానాభివృద్ధికి బాలురకు ఉన్నన్ని సౌకర్యములులేవు. ప్రత్యేకాంధ్రరాష్ట్రమున స్త్రీజ్ఞానాభివృద్ధికై ప్రత్యేక సౌకర్యముల కలిగించుట. బాలురకువలె బాలికలకు పాఠశాలలు కళాశాలలు నిర్మింపవచ్చును. స్త్రీలకు ప్రత్యేకగ్రంథాలయములు పురుషులతో సమానముగ కల్పింపవచ్చును. ఇంటింటికి పుస్తకములు తిరుగునట్లు ఏర్పాటులుగావించి గ్రంథపఠనము స్త్రీలలో ముఖ్యమగు అభిలాషగా గావింపవచ్చును. ఈగ్రంథాలయస్థాపనములు నాఉద్దేశ్యములో ప్రతిస్వశ్రేయోభిలాభియగు గవర్నమెంటుయొక్క విధిఅయి ఉండవలెనని.

అందు స్త్రీగ్రంథాలయములు అనివార్యములు. "పిల్లలను పెంచుటలో పురుషులకన్న స్త్రీలది ఎక్కువబాధ్యత అనినాపూర్తితలంపు. జ్ఞానములేనిస్త్రీ పిల్లలను పెంచుటకు హక్కులేనిది. ఆమెపిల్లలు ఆమెఅజ్ఞానమును తమ జీవితములోనికి తీసికొనినతరువాత వారు ఎంత జ్ఞానము సంపాదించినను వారిచిన్నప్పటి యాజ్ఞానసహవాసమును వాసనలేకుండచేయుట దుర్లభము. పిల్లలు చిన్నప్పుడు తల్లిదండ్రులనడవడికి సూక్ష్మముగ అలవడుదురు. వారు పెద్దవారై ఎన్నివిధములుగ మార్పుచెందినను ఎంతచదువుచదివినను చిన్ననాటినడవడిమీదనే తమ నడవడికి మారుదురు." అని ఒకగొప్పఅమెరికాస్త్రీ (డాక్టరు) వైద్యురాలువ్రాసినది.

కనుక మనము స్త్రీలజ్ఞానము పెంపొందించుటకు ప్రత్యేకాంధ్రరాష్ట్రిక ర్తవ్యముగ పెట్టికొంటి మేని మనవెనుక రాబోవుసంతతిలో మనకన్న మేటియగు ఆంధ్రులను పెంచుదుము.

స్త్రీల ప్రస్తుతదుస్థితినుండి వారి యజ్ఞానమును పోగొట్టి, సౌజన్యమగు జ్ఞానమును వారికి పెంపొందించు స్థాపనములు ఆంధ్రులగు వారి ముఖ్యోద్దేశ్యమైనచో వారు ప్రాపంచిక నాగరికతలో ముందంజవేయుదురు. ఈనాడు ప్రతిదేశమునను స్త్రీఉద్యమములు మొలక లెత్తి బాల్యదశలోనున్నవి. పురుషులు వారి ఉద్యమములు ఇంకను సరియైనవి యగునా కాదాయని యనుమానముతో అవలోకించుచున్నారు. ఆంధ్రులు అట్టి ఊహారహితులై స్త్రీ ఉద్యమములను అనుపేక్ష్యములని నిజభావపూరితులైనయెడ ఆంధ్రులు అన్ని దేశములకన్నను ఉన్నతమైన పరిజ్ఞానవ్యాసంగరాష్ట్రముగ వారి రాష్ట్రమును తేగలుగుదురు. 'ఇంటికి ఇల్లాలను'రీతి ఒకదేశనాగరికతాచిహ్నములు ఆదేశీయస్త్రీసౌజన్యమే. చరిత్రలో ఏదేశము ఎప్పుడు అచ్చటి స్త్రీనాగరికతదోషరహితమై సాంఘికగౌరవము సమానమైయున్నదో అప్పుడు మాత్రమే ఆదేశము ఉన్నతస్థితిని నాక్రమించినది. ఎప్పుడు ఆదేశపు స్త్రీసౌజ న్యమునశించినదో అప్పుడు ఆదేశపు నాగరికతాగౌరవశూన్యమై అనివార్యకష్టములకు పాలై, దుస్థితికిసముద్రమునదేలి దేశదారిద్ర్యముపేరున పూర్వపుఔన్నత్యము పోగొట్టుకొని, ముక్కలుముక్కలై పేరును పోగొట్టుకొనియున్నది. చరిత్రలో ఈ ఊహ్యము అతిశయోక్తి కానేరదు. భారతకాలము ఏల ఉత్కృష్టమైనది? నాటిస్త్రీలు సంఘగౌరవము కలిగియుంట ఏల ముఖ్యకారణముకాదు? హిందూదేశపు ప్రఖ్యాతి ఎవరిమూలమున? స్త్రీల సౌజన్య కారణమునకాదా? మహమ్మదీయులు పూర్వము ఏలజనకంటకులయిరి? వారిస్త్రీలయెడ కలిగిన దురభిప్రాయములుకావా? యూరపుచరిత్రను తిలకించుడు. గ్రీసు మహోన్నతస్థితి నొందినప్పుడు వారి స్త్రీఉద్యమము గౌరవస్థానముననున్నది. రోముదేశమునగూడ నింతియే. ఈరాజ్యనాశముల కారణములలో స్త్రీజనదుస్థితి ముఖ్యమగుకారణముగ లెక్కకువచ్చు.

ఆంధ్రస్త్రీలు ప్రత్యేకసౌకర్యము కోరిరన అనుచితలాభముల బొందుటకనికాదు; వారు వారిజన్మహక్కులను ఉచితరీతిని స్వరాష్ట్రమున అనుభవించుటకు మాత్రమే. స్త్రీలకు కానివి స్త్రీలకిమ్మని మాకోరికలుకావు. దేశభక్తిని, దేశసేవకును, దేశీయఉద్యమమునకును ఆంధ్రపురుషులతో, ఆంధ్రస్త్రీలు సమానముగ తమ దీక్షాప్రజ్ఞలు చూపుటయే మాఆశ యమైయున్నది. సమానగౌరవమునకే మాఉద్యమము. ఏరాష్ట్రము ధైర్యసాహసవంత మైనదో జ్ఞానసంపదకొరకై ఏదేశము దీక్షావ్రతయగునో ఏరాజధాని జాతిమతకక్షలులేని దగునో, ఏరాజ్యాంగము స్త్రీపురుషవివక్షతారహితమైనదో అట్టి ప్రత్యేకస్వాతంత్ర్య ఆంధ్ర రాష్ట్రనిర్మాణము మనమనోరథమై, ఆంధ్రులము స్త్రీలము, పురుషులము గమ్యస్థానముగ నెంచికొని మనోవాక్కాయకర్మలతో పాటుపడుదుముగాక.




౧

[ఇద్దరుబాలికలు రెండుమూడుగజాలదూరంలో ఎదురుగాకూర్చుంటారు. ఒక బాలిక ఆకూర్చున్న బాలి కలచుట్టూ తిరుగుచూవుండగా, యింకో అమ్మాయి యీపాటలనుపాడుతూ ఆఅమ్మాయినితరుముతుంది.]

అగిచీ—బుగిచీ—జాండాల
బుగిచీ, బుగిచీ, బుగిచీ దగ్గులూరుదవనంకట్టా
నీకోకకట్టా—నాకోకకట్టా, కట్టా—కట్టా.
విశాఖపట్నం—వీశెడుబెల్లం
నీకోకపదలం—నాకోకపదలం
పదలం —పదలం.

బిందెనిండా కందులూ—
రంగసాని బొందులూ—
బొందులూ—బొందులూ.

సూరీగుమ్మడికాయ—సూరప్పతలకాయ
తలకాయ—తలకాయ.

అనపకాయ—అచ్చమ్మతలకాయ
తలకాయ—తలకాయ.

అక్కలక్రా—ముక్కలపీట
కూర్చోవదినా—వదినా—వదినా.

ఉసిరిచెట్టుకింద
పసిరిపాలు లే—లే.
మామిడాకు—మంచినీళ్ళు—
మామిడాకు—మంచినీళ్లు.
ఆకు—అల్ల—సూది—సుద్ద—ఆకు—అల్ల.

౨

[బాలికలు జట్లుజట్లుగా చెట్టాపట్టాలువేసుకొని ఎదురుగా నిలబడతారు. ఒకజట్టు ముందుకువస్తూవుంటే, యింకో జట్టు వెనక్కి వెళ్ళుతూవుంటుంది. ఈ క్రింది పాటను ఒకరితరువాతవొకరు వరుసగా పాడుతూ]

చిన్నిపిన్ని—చింగలగోరూ
తాడిచెట్టూ—తామరమొగ్గ.
బుజబుజరేకులపిల్లుందా?
బుజ్జారేకులపిల్లుందా?
స్వామిగండంపిల్లుందా
సౌభాగ్యవతిపిల్లుందా?
బుజబుజరేకులపిల్లుంది
బుజ్జారేకులపిల్లుంది
స్వామిగండంపిల్లుంది
సౌభాగ్యవతిపిల్లుంది.

బుజబుజ రేకులకు ఏన్నేళ్ళు?
బుజ్జా రేకులకెన్నేళ్లు?
స్వామిగండాన్కి ఎన్నేళ్ళు?
బుజబుజ రేకులకు పదారు
బుజ్జా రేకుల కేడాది.

[ఇట్లా ఒకజట్టువారు ఎన్నిఏళ్ళని అడుగుతూ వుంటే, రెండవజట్టువారు పదిఏళ్ళవచ్చేవరకు చెప్పతారు. అప్పుడు ఒకజట్టువారు మగపెళ్ళివారు. రెండో జట్టువారు ఆడపెళ్ళివారు.]

బుజబుజ రేకులకు ఏమినగలు?
బుజ్జా రేకులకు ఏమినగలూ?
స్వామిగండాన్కి ఏమినగలూ?
సౌభాగ్యవతికి ఏమినగలూ?
కంటెలు కావాలా?
బుజబుజ రేకులకు చాలావూ?
బుజ్జా రేకులకు చాలవు.
......గాజులు కావాలా?
.........చాలవు
చిన్ని చిన్ని కిచాలవు
చింగల గోరుకు చాలవు
తాడిచెట్టుకు చాలవు
తామర మొగ్గకు చాలవు.

—ఇందుకూరి సత్యనారాయణరాజు.

౩

[వానచినుకులు పడుతూంటే, పిల్లలంతా వానలో కెళ్ళి ఆకాశంవంక చూస్తో, ఆచల్లని చినుకులు ముఖం మీదా శరీరం మీదా పడుతూంటే, ఆ చల్లని సుఖం అనుభవిస్తూ గిఱగిఱ తిరుగుతూ పలికే పలుకులు.]

(ఒకరు పాడుట, మిగిలినవారు బుడుగో, బుడుగో యనుట)

వానల్లు కురవాలి మా చేలు పండాలి బు
వడ్లన్ని రావాలి మా కొట్లు నిండాలి బు
మా నాన్న తియ్యాలి మా దాసికివ్వాలి బు
మా దాసి దంపాలి మా అమ్మకివ్వాలి బు
మా అమ్మ వండాలి మా బొజ్జ నిండాలి బు

౪

[చంటితమ్ముణ్ణి బువ్వాలాటలో కెత్తిసుకెళ్ళి, పీట వేసి కూర్చోబెట్టి, పిల్లలంతా యీవిధంగా పాడుతారు.]

కోడికొక్కెరాట కొబ్బరికాయముక్కలాట
పాలోసి బెల్లమాట పంచదార చిలకలాట
మారాజీపట్టాల్ మీద మహారాజు
మా అబ్బాయి
మాయింటికి భోజనానికి.

[అబ్బాయి నల్లాగే యుంచి పిల్లలంతా లేచి ఒకళ్ళ చేతు లొకళ్ళు చరుస్తూ యీవిధంగా పాడుతారు.]

చెమ్మచెక్క చారడేసి మొగ్గ
అట్లుపొయ్యంగ ఆరగించంగ
పగడాల చెమ్మచెక్క పందిరెయ్యంగ అందు
రత్నాల చెమ్మచెక్క రంగులెయ్యంగ
ముత్యాల చెమ్మచెక్క ముగ్గులెట్టంగ
ఆపందిట్లో మా అబ్బాయి పెండ్లి చెయ్యంగ.

౫

[ఒక అమ్మాయిని ఒకచోట కూర్చుండబెట్టి మిగిలిన పిల్లలా అమ్మాయి చుట్టూ తిరుగుతూ యీ విధంగా పాడుతారు.]

ఒప్పుల గుప్ప వయ్యారిభామ
సన్నబియ్యం చాయపప్పు
గూట్లో రూపాయి నీ మొగుడు సీపాయి.

—కాశీరాజు రామమోహనశర్మ.




## రవ ఇడ్డినలు

శ్రీమతి జి. శోనాబాయిగారు

బొంబాయిరవ బాగుచేసి దాంట్లో పచ్చిమిరపకాయలు అల్లమునుతరిగివేసి ఉప్పు రవకుతగినట్టుగా వేయవలెను. కరివేపాకువేసి, పుల్లనిమజ్జిగతో చాలాపలచగాలేకుండా ముద్దగాలేకుండా కలపవలయును. పొయ్యిమీద ఇడ్డనలుపాత్రలోఎసరుపెట్టి కాగినతర్వాత ముడుగొయ్యిలుగాఉండే శిబ్బిరేకుపెట్టవలెను. బాగావాసనపీల్చకుండా ఈపిండి అరటిఆకులోవేసి శిబ్బిరేకులోపెట్టి ఉడికినతర్వాత దింపి దాంట్లో నెయ్యి వేయవలయును.

## సగ్గుస్వర్గాలు

శ్రీమతి అయ్యగారి విజయలక్ష్మిగారు

నీరుకలియనిమంచిపాలు ఎసరుపెట్టి, కాగుచుండగా సగ్గుబియ్యముపోసి బాగుగాఉడుకనిచ్చి తగినంత చక్కెరవేసి ముద్దకట్టినపిమ్మట ఏలకులపొడివేసి దించవలెను. చల్లారగనే నిమ్మకాయంత ముద్దలుగచేసి గోధుమపిండితోపులోముంచి కాగుచున్న నేతిలోవదలవలెను. వేగినపిమ్మట తీసిభుజించినచో, స్వర్గమునకు బెత్తెడులోనికి గొంపోవును. ఇది జబ్బుచేయని తేలికఆహారము.

## కేసరిబాతు

శ్రీమతి బి. మాణిక్యమ్మగారు

మంచిసన్నబియ్యమును మదరాసుపడితో కొలచుకొని బాగుగాకడిగి యెసరుబెట్టి కళపళమనియెసరు వచ్చినతరువాత ఆబియ్యమును అందులోవేసి మెత్తగాఉడికినపిమ్మట వార్చవలయును. ఆఅన్నమును చల్లార్చవలయును. పదితులములు తూనికగలముంతమామిడిపప్పును, 5తులములకుసరిపోవుద్రాక్షయును, ఈరెంటిని గలిపి యొకతులముఘృతములోవేసి వేయించవలయును. ఒకతులమునకు సరిపోవు యేలకులు బాగుచేసియుంచుకొనవలయును. ¼ (కాలు) తులం కుంకుమపువ్వు (కేసరిని) మెత్తగాపొడిచేసి కొలదిపాలలోనానవేసేది. కళాయిపాత్రలో పడిచక్కెరవేసి ఒకకప్పు నీటినిపోసి, అరఅంగుళము తీగవచ్చునట్లు పాకముచేసినానబెట్టిన కేసరిపాలను ఆపాకములోబోసి యంగుళము తీగవచ్చినతర్వాత పైఅన్నమును ముంతమామిడిపప్పు, ద్రాక్ష వాటిని పాకములోవేసి కలియబెట్టేది. అందులో 2 సేర్లనెయ్యిపోసి అడుగున సన్ననిమంటను బెట్టి ఆపాత్రపై మూతమూసి, మూతపైనిప్పులు వేయవలయును. అన్నమువేసినతర్వాత పాకము కొంచెము నీళ్ళను విడుచును. అట్లనె ప్రొయ్యిమీదబెట్టినపిమ్మట గట్టిబడును. అటుమీదట మర్దించిన ఏలకులపొడినివేసి ఆ పాత్రను క్రిందికిదింపవలయును. ఇష్టమయినచో నిమ్మకాయరసమునువేసుకొని చల్లారకముందే బాగుగా భుజించవలయును. ఈవిధముగా చేసినభక్ష్యమునకే కేసరిబాతని పేరు.

## పాలముంజలు

శ్రీమతి చవలవాడ రాఘవమ్మగారు

మొదట 1 శేరుబియ్యము నానవైచి మెత్తగాపిండికొట్టి ఆపిండిని కొలవవలయును. ఆపిండి ఎన్ని శేర్లు అయిన అన్ని శేర్లుపాలుపోయవలెను. పిండి, పాలు, 15 తులములబెల్లము మొత్తముచేసికలిపి పొయ్యిమీద ఉంచవలెను. పొయ్యిమీదనుంచిన దగ్గఱనుండి గరిటెతో గట్టిపడునంతవఱకు కలుపుచూ ఉండవలయును. గట్టిపడినతరువాత పొయ్యిమీదనుంచి దింపవలెను. అది అట్లుండనిచ్చి ¾ పావుశేర్లు శెనగపప్పు ఉడికించి రోటిలోపోసి ½ వీశెడు బెల్లము వేసి దంచవలెను. దంచినతరువాత ఉండలుచేయవలెను. ఉడకబెట్టిన వరిపిండిని దళసరి అప్పడములవలెచేసి శెనగపప్పుఉండలు అప్పడములోపెట్టి మూసివేయవలెను. తరువాత నూనెకాని నెయ్యికాని సలసలకాగునపుడు ఉండలువేసి ఉడికించవలెను. అవియే పాలముంజలు.

## బిస్కట్లు

శ్రీమతి అయ్యగారి విజయలక్ష్మిగారు

గోధుమపిండిలో మెత్తగదంచిన పంచదారనుతగినంత కలిపియుంచి, తాజావెన్నను లేతకాపుగాకాచి, ఆపిండిలోపోసికలిపి ముద్దచేసిపీటమీద మర్దించవలెను. ఆముద్దనుండి కొంతతీసికొని; మూడురూపాయల దళసరిగా అప్పడమువలె ఒత్తి దానినుండి మనకుకావలసిన ఆకారముగ బిళ్లలుకోసికొనవలెను. ఆబిళ్లలపైన ఈనెపుల్లతో మనయిష్టము వచ్చినవిధమున చిల్లులుపొడువవచ్చును. అందముకొరకు అక్షరములవలెగాని, సున్నలవలెగాని, చిల్లులురెండవపెడకుపోకుండునట్లుగా పొడువవచ్చును. ఒకబాణలమూకుడులో ఇసుకపోసి పొయ్యిమీదనుంచి దానిపైన నొకపళ్లెమును కాలవేయవలెను. ఇసుకపైనపళ్లెముకాలగనే బిళ్లలను దానిలో కలిసిపోకుండ పఱువవలెను. మూతవేసి, మాడిపోకుండచూచుకొనుచు, ఒకపెడకాలగనే రెండవపెడకు త్రిప్పి పఱువవలెను. రెండవవైపుకూడ బాగుగకాలినతర్వాత తీసికొనవలెను.

## చంద్రకాంతలు

శ్రీమతి గో. బాలాత్రిపురసుందరీదేవిగారు

సోలెడుపెసరపప్పు, పిడికెడుబియ్యమును నానబెట్టవలెను. నానినపిదప శుభ్రముగకడిగి రోటిలో మెత్తగరుబ్బవలెను. రుబ్బినపిండిని పాత్రలోపోసివుంచుకొనవలెను. ఇంకొకపాత్రకడగి సోలెడుపంచదార కొంచెము నీరుపోసి పొయ్యిమీద పెట్టవలెను. పంచదారకొంచెము పాకమురానిచ్చినతరువాత ఆపిండిని అందులోపోసి కలుపుచూవుండవలెను. గరిటెజారుగ రానిచ్చి వెడల్పయినపళ్లెమునకడగి కొంచెము నెయ్యిరాసి దానిలో ఆపాకములోవుడికినపిండిని పోయవలెను. కొంచెముసేపటికిగట్టిపడును. చాకుతో చిన్నచిన్న ముక్కలుగకోయవలెను. బాణలిలో నెయ్యిపోసిబాగ కాగనీయవలెను. కాగినతరువాత ముందుకోసిన ముక్కలను మూడేసి నాలుగేసివేయవలెను. ఎరుపుదారురాగానే వేరొకపళ్లెములోనికి తీయవలెను. వేడిచల్లారినతరువాత భుజించవలెను.

## గోదుమనూకపకోడీ

శ్రీమతి పాకలచంద్రకాంతామణిగారు

సుమారు అర్ధశేరుపుల్లటిపెరుగునందు పావుశేరు గోధుమనూకనుకలిపి తగినంతవుప్పువేయవలెను. ఉల్లిగడ్డలు, పచ్చిమిరపకాయలు సన్నగతరిగి ఈముద్దలోకలుపవలెను. బాణలిని పొయ్యిపైనుంచి దానిలో తగినంత నెయ్యిపోసి నెయ్యికరిగినపిమ్మట ఈముద్దను పకోడీలవలె బాణలిలోవదలవలెను. బాగుగావేగినపిమ్మట వాటిని వేరొకపాత్రలోనికితీసి ఉపయోగించవలెను. వేడిగానున్నప్పుడే ఉపయోగించినమంచిది.

# జోలపాటలు

౧

శ్రీమతి కాకుటూరు పద్మావతి గారు

చిన్నారిపక్షులకు చిలుకపక్షులకు
పలుమారుపక్షులకు పంజరపుచిలుక.
చిలుకల్లుమాయింటి చిన్నపిల్లలు
హంసల్లు మాయింటి ఆడపడుచుల్లు.
కోవెలలుమాయింటి కొత్తకోడండ్రు
పావురాలుమాయింటి పసిపాపలమ్మ.
ఏలపడ్చెదవుతనయ యేమికావలెర?
మేలైనగురుబోధ పాలుత్రాగర
నల్లనయ్య! నీముఖము జూపర
నవనీతచోరుడని పిలచెదరునిన్ను
పమిడిగిన్నెలో పంచదారపోసేరా
పరమాత్మ నాచేతిపండందుకోరా.
ఉయ్యాలచేరులే నొత్తుకడియములు
ఏఅక్కతమ్ముడే ఊగుఉయ్యాల?
శ్రీరామజయరామ శృంగారరామ
చారువిక్రమరామ చంద్రరఘురామ
భక్తజనదారిద్రభంజనుడ రామ
ముక్తిదాయకనయ్య! మురవైరి రామ
మత్స్యమై సోమకుని మర్దించిరామ
తెచ్చివేదములు బ్రహ్మకిచ్చితివిరామ
వరహావతారమై వసుమతిరామ
గిరి ఓకొమ్మున ఎత్తితివి రామ
వామనుడవై మూడుఅడుగులనుబలిని
అణచితివి మునితోడ అయ్యరఘురామ
కూర్మావతారమై కొరకుదేవతుల
కూర్మినమోసిన రఘుకుంజుడవురామ
కలడన్నమాత్రాన కను స్తంభమునను
కుంభినివణకగ కూల్చితివిరామ
నీవేగతియనిమ్రొక్కి నిజభక్తిరామ
కావుమనివేడితిని కరుణశ్రీరామ
బ్రహ్మలోకమునుండి బ్రహ్మమహేశ్వర్లకు
ముందుగా అభయహస్తమిచ్చితివిరామ
ధరణిఅరువదివేలేండ్లు దశరథరామ
సంతానహీనమై సంతిలెమురామ
ధాత్రిలో ధశరథుడు ధన్యుడౌరామ
పుత్రికామేష్ఠందు పుట్టితివిరామ
దశశిరస్కుని ఖండింతమనిరామ
కౌసల్యగర్భాన కలిగితివిరామ
రామ జేరామ జేరఘురామ జేతు
సకలపాపక్షయ స్వామిదర్శనము.
చిచ్చి చిచ్చీరావె శ్రీలక్ష్మిరావె
మాయింటనిలువను మహాలక్ష్మిరావె
చిట్టీతపండెరుపు చిలుకముక్కెరుపు
చిగురెరుపు చింతల్ల జీడిపండెరుపు
బాలసూర్యుండెరుపు బంగారుఎరుపు
తానెరుపుపాపాయి తనవారిలోకి.
వాకిట్ల అబ్బాయి ఆడంగజూచి
వజ్రమాణిక్యమని వాలెచిలుకల్లు.
చిలుకల్లుచెలరేగి జీడికొమ్మెక్క
హంసల్లుచెలరేగి అరుట్లకెగురు.
కోనెలలుచెలరేగి కొమ్మపై వ్రాలు
అబ్బాయిచెలరేగి మామబుజమెక్క.
మామబుజమెక్కెనో మరియేమిఅడుగు
పాల్దావగిన్నెఅడుగు పాడిఆవునడుగు.
ఆటల్లుముద్దమ్మ పాటల్లుముద్దు
అందరికిఅబ్బాయి అల్లారుముద్దు.
జోలాడుకృష్ణ! జోకొట్టురంగా!
నిద్రపో బలభద్ర! రాముతమ్ముడివి. జో జో.

## ౨

### శ్రీమతి జయలక్ష్మీ దేవిగారు

ఆయిక్కగట్టరే అరిటీయపండు
అబ్బాయికిపెట్టరె పాలమీగడలు.
చిన్న మాఅబ్బాయి సిరిముఖముజూచి
సిగ్గుబడిచంద్రుడు పొడవజాలాడు.
చిలుకావంటివాడివి నీవు
చిత్రానవ్రాసిన ప్రతిమవేనీవు.
హంసావంటివాడివి నీవు
అద్దములో చిన్న పాపవేనీవు.
చిలుకా! నువుబోయి చిత్రించిరావె
వానబోయికురువవే వరిమళ్లలోను.
వరిమళ్లువుండగ వనములుండగ
వట్టిమిట్టనుబోయి కురిసెవర్షమ్ము.
నిద్రబో నిద్రబో భద్రసేనుడా!
బలభద్రుతమ్ముడా హరినిద్రబొమ్మి.
నిద్రకు వెయ్యేండ్లు నీకువెయ్యేండు
నినుగన్న జనకునకు నిండువెయ్యేండ్లు
జోలపాడువారు జోకొట్టువారు
నిద్రబొయ్యేవారు నీయూచువారు.
నారాయణా! నిన్ను నమ్మినానయ్య
నమ్మినావారిని దరిజేర్చవయ్య!
కృష్ణజే కృష్ణజే కృష్ణమ్మజేతు
సకలపాపక్షయ స్వామిదర్శనము.
కృష్ణుణ్ణిదలచేవారు కష్టజీవులకు
ఎప్పటికి కలుగవు యమునిబాధల్లు.
ఏవ్వారు ఏదేశము ఎలికెల్లసింగి
వచ్చికూర్చుండవే వా త్తలడిగేము.
ఆకుకొనిఅమ్మాయి వచ్చెగాబోలు
అందెల్లుచప్పుడాయె అరుగూలమీద

చదువుకొనిఅబ్బాయి వచ్చెగాబోలు
పలకల్లుచప్పుడాయె పందిళ్లలోన.
కూర్చుండుమహాలక్ష్మి కూర్చుండవమ్మ
కూర్చుండుఅబ్బాయి కుడిభుజముమీద
వాలుండుమహాలక్ష్మి వాలుండవమ్మ
వాలుండుఅబ్బాయి వాలుకన్నులను
నిలుచుండుమహాలక్ష్మి నిలుచుండవమ్మ
నిలుచుండుఅబ్బాయి నిలువుటద్దములో
శయనించుమహాలక్ష్మి శయనించవమ్మ
శయనించుఅబ్బాయి తూగుటుయ్యాల
తూగుటుయ్యాలపై శయనించవమ్మా
కోరినవరమిచ్చి రక్షించవమ్మా.
ఒక్కొక్క ముత్యము వనగూడినట్లు
వరుసతోతనయులను నేతల్లిగనెను
రాసిబోసినముత్యాలు రవజల్లినట్టు
రమణిరో కౌసల్య రాములనుగనెను
ఊరేలుడ త్తమ్మ జగమేలుస్వామి
మమ్మేలు వేదగిరి శ్రీనారసింహా!
నారశింహుడివయ్య! నాదాతవయ్య
మాబాలరక్షించ మీభారమయ్య.
మాచిన్న బాలలు నీదాసులయ్య
దాసులకువెయ్యేండ్లు దయసేయవయ్య
మంచిదవుయ్యెల మల్లెలపరుపు
మహాలక్ష్మిఊచవే! పాపవుయ్యెల.
చిన్న దివుయ్యెల చిలకల్లపరుపు
శ్రీలక్ష్మిఊచవే! పాపవుయ్యెల.
ఆటమాణిక్యం పాటమాణిక్యం
అందరికిఅబ్బాయి! రత్నమాణిక్యం.

## 3

### శ్రీమతి పి. యస్. లక్ష్మీదేవిగారు

చిన్ననాఅమ్మాయి చెన్నగిరిమొగ్గ
వాచాడకల్పమే వాడన్నిమల్లె
వాడన్నిమల్లెకు పీకన్నితోడిమ
రంభవంటిఅమ్మాయికి రాజువంటిమొగుడు
కొండాలెక్కి చూతాము పదరె
కోరిమనఆవుల్లు పూరిమేయగను
రచ్చబండాలెక్కి చూతాముపదరె.
రాజుమనఅన్నల్లు రాజ్యమేలగను
కంచికిపోయేటి గాజులసెట్టి
కంచికామాక్షమ్మ యెవరాడపడుచు
శివకంచియేలేటి శివునిభార్య
విష్ణుకంచియేలేటి వరదుచెల్లెలు.
చీలమ్మచిక్కుళ్ళు లాలెమ్మజడలు
బంగారుజెడపోత అమ్మవుయ్యాల
చీకటికచిత్రాంగి వెన్నలకుపిరికి
చిన్ననాచీలెమ్మను యెవ్వరికియిత్తు
కిక్కిరిసిదవడలే కోరమీసాలు
చిన్ననాచీలెమ్మను యెలికమ్మకిత్తు
యెలికమ్మగారింట్లో యెంతబాగపెండ్లి
చీలెమ్మనుపిలవరె చిట్టిముత్తయిద
యెలికమ్మచీలెమ్మకు దండంబుపెడితె
దీవించియెలికమ్మ దిగమ్రింగివేసె
దీర్ఘాయుష్షుమంత్రములు దిగమ్రింగివేసె.
అమ్మాయినెవ్వరే కొట్టినావారు
కొట్టిగోవులపాలు కొనిపోసినారు
అమ్మాయినికొట్టినకొట్లు వూరెల్లరట్టు
అమ్మాయికితేరమ్మ ముత్యాలబొట్టు
ముత్యాలబొట్టుకు మూడువన్నెల్లు
రత్నాలబొట్టుతెత్తురు అమ్మిమామల్లు
బూచివాడారార బుట్టల్లుకోరా
బుట్టఅమ్మాయిని మాకిచ్చిపోరా.
బూచివాడికెవ్వరే బువ్వపెట్టింది
భాసురంబుగ అచటపవ్వళించాడు
చిన్నవాడుశివుడు మనకుదేవుడు
చిత్తాన గారుకు ప్రాణవల్లభుడు.
నారాయణానిన్ను నమ్మితిమయ్య
నావాండ్లరక్షించ మీభారమయ్య
మీకుసేవలుచేయ మాభారమయ్య.
చిచ్చిచిచ్చిరావె శ్రీలక్ష్మిరావె
ఆదిలక్ష్మిరావె అమ్మాయితోఆడ
అందలముకోరింది కుందనపుకుచ్చు
అతిభోగితాగోరు అత్తగారిల్లు
పల్లకీగోరింది బంగారుకుచ్చు
బాలులుఅమ్మాయి అన్నల్లుకోరి
నారు బావమఱుదుల.
బిడ్డలూలేరటే గోడ్రాలనీకు?
పడ్డావుఅప్పనికి ప్రాణాచారము—
పడ్డానులేదమ్మ పాపకర్మలకు
అడిగినాలేదమ్మ అన్యజాతులకు
అడిగినాలేదమ్మ అన్యజాతులకూ.
యిచ్చినాదక్కరే హీనజాతులకూ.
వెంకటప్పడికొండ వెలసుండవలెను.
యెప్పటికిపుట్టిల్లు కలిగుండవలెను
చిలుకచిత్తారమే శ్రీమంతునిల్లు
లక్కతోత్తాపినది పట్టెమంచమ్మ.
రామలక్ష్మణులార మీయిల్లుజొచ్చి
రావణాబాధలకు లోనాయెసీత
నీలవర్ణుల్లార. మీయింటపుట్టి

సీరాపనిందలకు లోనాయెసీత.
సీతపుట్టనేల లంకచెడనేల
లంకకువిభీషణుడు రాజుగానేల
హనుమంతుపుట్టనేల వనముచెడనేల
వనముకోతులన్ని వలసపోనేల.
చిచ్చిచిచ్చి చీమల్లమఱ్ఱి
మఱ్ఱికిందివాడు తోఱ్ఱినాగయ్య
తోఱ్ఱినాగయ్యకు తోడెవ్వరమ్మ
యేనుగులకాచేటి యెఱ్ఱడేతోడు.
ఓయమ్మగుఱ్ఱాలు ఓయిపల్లాలు.
ఓయమ్మ బడ్డెవారి దండెక్కడదిగెను
దండుపోయి ధరణికోటంగళ్ళదిగెను
వర్షపోయి పారువేటమండపానదిగెను.
చిలకా! నీవుపోయిచిత్రించిరావె
వానపోయికురవవె పరిమళ్ళలోను
పరిమళ్లువుండంగ వనములుణ్ణంగ
పట్టిమిట్టలబోయి కురిసెవర్షంబు.
పంటచేలుండంగ పొలములుండంగ
పాడుమిట్టలపోయి కురిసెవర్షంబు
అందరిమామల్లు చందమామల్లు
అమ్మాయిమామల్లు రామలక్ష్మణులు
రామలక్ష్మణులవంటి అన్నలుకలిగితే
రాకపోకలుకలవు యెల్లకాలంబు
సీతవూర్మిళవంటి వదినల్లుగలిగితె
వంచనార్థులుకలవు యెల్లకాలమ్ము
చిచ్చిచిచ్చిచీమల్లమఱ్ఱి (వెఱ్ఱి)
మఱ్ఱికింది అమ్మాయిమాటలకు.

## ౪

రచయిత్రి శ్రీమతి యన్. వి. సరళాదేవిగారు

తామరకొలనులో చిలుకల్లుపలికె
తల్లిచంకలోన అమ్మాయికులికె
అమ్మాయినవ్వితేరత్నాలురాలు
అమ్మాయిచూచితే అందాలుకురియు
రావె రావె రావె రత్నాలబొమ్మ
చేతతీసుకరావె పువ్వుల్లరెమ్మ.
రాణిమెడలోపలది రత్నాలదండ
అమ్మాయినోటిలో ముత్యాలసరము
చిన్నమాఅమ్మాయి యేడుస్తువుంటే
చిటిచిట్టిముత్యాలు చిల్లిరాలేయి
చిట్టమ్మ సెలవార నవ్వుతుంటేను
మల్లెపూవులుతెచ్చి గుప్పినట్లుండు.
రాజుగారింటిలో ఓతిమ్మరాజు
తిమ్మరాజొచ్చేని పడువకుతల్లీ
ఆడగానుముద్దు పాడగాముద్దు
అమ్మాయిమామలకు చూడగాముద్దు
అమ్మాయికంఠంబు ఎత్తితేవినుచు
జనులంతకోయిలాపాడెనంచనిరి.
చిన్నమాఅమ్మికి కోపమొస్తేను
ఎఱ్ఱగులాబీలు ఎదురొచ్చునమ్మ
రావె రావె చిలుక రత్నాలచిలుకా
మాచిట్టితోపలుక మాధుర్యమొలుకా.
పడువకుపడువకు మావెఱ్ఱిచిట్టి
కలువపువ్వులనిండ మంచునిండేను.
ఆడగానుముద్దు పాడగాముద్దు
సొగసుగానేడ్వగా అదిమొక్కముద్దు
ముక్కంటి మాతల్లి మ్రొక్కవచ్చేని
మూడవకన్నయితె మూసుకోవయ్య
కోడికుయ్యాగాన మేడిభుజమెక్క
అమ్మాయియేడుపు ఆవీధినెక్క.




## లాలి పాట

శ్రీమతి ధేనువకొండ సుబ్బమ్మగారు

లాలి నందకుమార లాలి సుకుమార
లాలి జగదాధార లాలి గుణహారా లా.

రెంటినడుమన వెలయుకంటిసూటిగనూ
వంటి స్తంభము మేషయింటిలోపలను
మింటనీలపురంగువంటి దూలమున
జంటఏనురురేకు లంటులుయ్యాలనూ లా.
పంచముద్రలనొప్పు బంగారుగొలుసు
చాంచల్యమును లేక సరిగ బంధించి
పంచకళలను పట్టుపరుపుసవరించి
పంచమాంబవుకోశ మెంచిభావించి లా.
మునుమొప్ప ఆధారమూలంబునకునూ
ప్రణవంబనెడి తాకుబట్టిప్రాపుచునూ
వినుతగల్గిన దశవిధనాదములను
వనితలెవ్వరు పాటలెనసిపాడెదరూ లా.
లాలి శుద్ధస్ఫటికలావణ్యరూపా లాలి
ఆపోజ్యోతిలక్షణకలాపా లాలి
త్రికూటాద్రిలలితప్రదీపా లాలి
సత్యాద్విందులక్షహాతపాపా లా.
జగములన్నియు నీవె జలధులునునీవె
నగములన్నియునీవె నదులెల్లనీవె
అగణితంబగుచున్న హరిహరులునీవె
గగనాదిభూతముకాలంబునీవె లా.
బ్రహ్మాండములునీవె బ్రహ్మలునునీవె
బ్రహ్మదులనుగన్న ప్రభుడవునునీవె
బ్రహ్మమూలంబనెడి భావంబునీవె
బ్రహ్మంబనెడి సచ్చిదానందమీవె లా.
చెలగివిశ్వముధ్యానచే ప్రణయమైన
వెలిలోనుగనరాక వివరంబులేక
తెలివివ్యక్తపడంగస్థిరపదంబగుచూ
నిలచియుండెడి స్వామినిదురబోవయ్యా లా.

# బాలవిజ్ఞానశాఖ

౧. పాటలు

## రోటివద్దపాట

శ్రీమతి మన్నేపల్లి సుబ్బరత్నమ్మగారు

శ్రీగురుస్వామినీ చిత్తంబులోను
బాగుగాధ్యానించి బ్రహ్మమైనారు
గురుసూత్రమందిన్న గురుపుత్రులెల్లా
తరుణిజన్మించారె దాటీమాయను
గురుకుమానవుడన్న గుణహీనులకునూ
తరుణిజన్మాదులు తప్పకయుండు
గురుడెదైవంబని గుప్టిలోపలనూ
నిరతంబుపఠియించి నిర్గుణులైరి. శ్రీ.
ఘనతగురుశుశ్రూష ఘట్టిగావలెను
అవినాల్గువిధమూల మనవలెనుమిమ్మ
ఆత్మగోరిసద్రవ్య మర్పించిగురుని
ఆత్మమెప్పించూకె ఆత్మశుశ్రూష. శ్రీ.
స్థానశుశ్రూష గురుస్థాయిగాగురుకు
భూమినివసించీన భూమీకేగుటా
అంగశుశ్రూషగురుఅభ్యంగనాది
శృంగారసేవయూ అంగనులార. శ్రీ.
ఈరీతిసేయని యిలమానవులకూ
యేరీతిసిద్ధించు యెఱుకత మాన
మూఢుదేహంబులకు మూలమైయున్న
జాడదెలియు మూఢజనులాశక్యమా
పంతమాడయిట్లు పంచకోశములు
ఎంతయెరుగకవాలె వారజులగూడి
సాధనచతుష్టయం సంపూర్ణమైతే
బోధకునుజేరితె పొందూమోక్షములు
పటుతరంబుగ మహావాక్యములునాల్గు
కుటిలాత్ములెరుగారె గురునిదయలేక
ప్రజ్ఞానమంతయు పలుకువేదములు
సుజ్ఞానమంతూలు చూచితానైరి. శ్రీ.
తరుణిఅహంబహ్మాస్మి తాత్పర్యమనుచూ
పరికించిప్రజ్ఞులు పరమూజెందీరి
హైమాత్మబహ్మమని ఆమర్మమెరిగీ
ఖైరవతులైనారు బ్రహ్మవేత్తాలు. శ్రీ.
భక్తకులదూషించి భ్రష్టమానవులు
ముక్తిజెందక మాయసత్తూలైనారు
రవిసోమహంసలు లయమైనచోట
పూర్ణభవులంటాక పూర్ణులైనారు. శ్రీ.

## ఎరుకలపెండ్లిపాట

శ్రీమతి పాకలరత్నమాలగారు

ఏలూరుపురమునగల ఎరుకలజాతివారు పెండ్లికిముందు పెండ్లికూతును, పినతల్లియో పెదతల్లియో వెంట నిడుకొనివచ్చి ఈపాటనుపాడుచు బిచ్చమెత్తుకుందురు.

గౌరికళ్యాణమే వైభోగ్యమే లక్ష్మికళ్యాణమే వైభోగ్యమే
అనుపల్లవి ప్రతిచరణముతుదినిపాడవలెను.

పెళ్ళిపెళ్ళన్నారు పెరుగుబొగ్గిళ్ళ
పెళ్ళయినమరునాడు సగ్గిబొగ్గిళ్ళ
పినతల్లిపెట్టింది పిండితోనలుగు
కన్నతల్లిపెట్టింది కంచుతోనలుగు
వడిబాలుబియ్యమేవి వోలిసొమ్మేది
తలంబ్రాలుబియ్యమేవి తాలిబొట్టేది
పెళ్ళికొడుకా!
మాబావగెడ్డమూ బవిరిగెడ్డాము
యిదిలించిచూస్తేను ఈతముల్లుంది
పాయదీసిచూస్తేను బ్రిపేనుంది
అరివేణికుండలకు అంచులేలేవు
పెళ్ళికొడుకుఅబ్బాయికి పెదవులేలేవు
తంగేడుచెట్టుక్రింద తలంబ్రాలు
బండోడిచెట్టుక్రింద బాసికాలు
ఈపరాలకంత యిడబడ్డకంత
తగులుకున్నకంతమ్మ తప్పించలేము
పెళ్లికిబావ పెరుగుతున్నాడు
కన్నమ్మబసతోటి కదలనన్నాడు.

౨. కథలు

## వేలుగానికథ

శ్రీమతి పినపాక సీతారామమ్మగారు

ఒకానొకప్పుడొక కాపువాని కొకమిరపపండ్లతోటగలదు. వానిభార్య ప్రతినిత్యము వానికి అన్నము తీసుకొని వెళ్లుటవాడుకయియుండెను. సంతానములేమిచే ఆయిల్లాలొకరోజున తోటయందుపోవుచూ మిరపకాయంత పిల్లవాడయిన పుట్టినబాగుండును అనుకొనెను. కొన్నాళ్ళకు ఆయిల్లాలికి నిజముగా ఒకవ్రేలెడి బుడుతడుదయించెను. కాపువాడువేలెడిఅంతవానితో ఏమగును అనిదిగులుగా ఉండెను. ఆపిల్లవానికి 10 సంవత్సరముల వయసువచ్చెను కానిఎదగడాయెను. ఒకరోజున తండ్రితో తోటకుపోయి అచట వాడుకొను చుండెను. ఇద్దరువర్తకులు ఆదారినిపోవుచూ యీతనిచూచి కాపువానిని వ్రేలుగానినమ్మెదవాయని ప్రశ్నించిరి. కాని అతడుసందేహించుచుండెను; వ్రేలుగాడుతండ్రిభుజమునకెగిరి తానుత్వరలో వారిదగ్గరనుండి తప్పించుకొనివచ్చెదనని చెప్పి 50 రూపాయిలకు అతడమ్ముడు పోయెను. వేలుగాడుయిద్దరిభుజముల యందెగురుచు వారలనవ్వించుచూ వారితోకొంతదూరముపోయెను. ఒకఎలుక కన్నమునుండి బయటికిపోయెను. ఇది వేలుగాడుచూచి ఒకగంతువేసి కన్నములోదూరెను. ఆవర్తకులు వేలుగాని అనేకమారులుపిలచి విసిగివేసారి, ఎంతవరకురానందున తమదారినివిచారించుచూ వెడలిపోయిరి. వేలుగాడొకగడ్డిమోపునందుదూరెను. ఆమోపునొకఅవ్వతీసుకొనిపోయి గడ్డినిఆవుకువేసెను. గడ్డితోగూడ వ్రేలుగాడు ఆవుకడుపులోనికిపోయెను. అవ్వ సాయంకాలమందు పాలుపితుకుచుండగా అవ్వా!పాలుచాలును, ఇకపితుకవలదని వేలుగాడు లోపలనుండి పలుకుచుండెను. ఆవు కేదోపిచ్చిపట్టినదని అవ్వఅనుకొనెను. గడ్డివేయబోగా అవ్వా! మేతచాలునని వినవచ్చెను. ఆవులోదయ్యమున్నదని ఆవునుమాలవారిచే అవ్వ కోయించెను. కానిఏమియుంగానక విచారించెను. వేలుగాడు మెల్లగా ఆవుపొట్టనుండి తప్పించుకొని ఒకచెట్టెక్కికూర్చుండెను. ఇంతలో కొందరుదొంగలు దొంగతన చేయుటకు ఆలోచించుచుండిరి. వేలుగాడువారిదగ్గరకుపోయెను. వారుభయపడి పుల్లవెలిగించి వేలుగాని చూచిఆశ్చర్యమొందిరి. నీవెవరవనియడుగగా నేనుమనిషినే, నాకొకయిల్లుతెలుసును, అందుచాలాడబ్బున్నది, నన్నుచటకుగొనిపొండు చాలాధనము దొరకునని చెప్పెను. వేలుగాడుచెప్పినగురుతులనుబట్టి వారు వీనిని వేలుగానియింటికిగొనిపోయిరి. వేలుగాడు కిటికీగుండా యిల్లుదూరి నాన్నాదొంగలు అమ్మాదొంగలు అనిఅరచెను. దొంగలు పారిపోయిరి. తలిదండ్రులు వేలుగానినిజూచి ఆనందించిరి. కథ కంచికివెళ్లెను. మనము యింటికి వస్తిమి.

# దాని మొగుడు

శ్రీమతి విప్పర్తి భారతమ్మ గారు

ఒకవూరిలో ఒకగొల్లవాడుండెను. వానికి ఒకపుత్రుడుండెను. వాళ్ళకు చాలాగొర్రెలు మేకలువుండెను. కొడుకు ప్రతిదినము మేకలు మేపుటకు వెళ్ళుచుండెను. ఒకరోజు వానికి దమ్మిడీదొరికినది. దానిని తెచ్చి తండ్రికిచ్చి నాయనా నాకు పెండ్లిచేయుటకు చేతిలోదమ్మిడీలేదని అంటువున్నావు. ఇదిగోదమ్మిడీ దొరికినది పెండ్లిచేయమనెను. అంటే తండ్రి అయ్యో! నాయనా! గుడ్డలు ఏనుగ ధనము పిల్లవుంటే పెండ్లిఅవుతుందిగాని దమ్మిడీతో ఏమిపెండ్లిచేసేది అన్నాడు. వెంటనే వాడు అమ్మా నాకు అన్నముకట్టిఇమ్ము పిల్లను తెస్తానన్నాడు. తల్లి, తండ్రి యెంతవద్దన్నా వినకుండా ప్రయాణమయినాడు. అట్లుపోతూవుండగా అడవిలో నుంచి మధ్యాహ్నసమయములో ఒకవర్తకుడు ఏనుగఎక్కి వెళ్తూ గొల్లవాడా మంచినీళ్ళు ఎక్కడున్నాయని అడిగినాడు. అర మైలుదూరములో వున్నాయన్నాడు. నీకు ఈనామిస్తాను. ఈఏనుగను ధనము మూటను చూస్తూవుంటావా అంటే సరేనన్నాడు గొల్లాడు. నీపేరేమని వర్తకుడు అడిగాడు. నా పేరు నిన్నమధ్యాహ్నము అన్నాడు. సరేకదా అనుకుని మంచినీళ్ళకు వెళ్ళిపోయాడు వర్తకుడు. ఇదేసమయమని గొల్లాడు పక్కవూరుకు పారిపోయాడు. వర్తకుడు మంచినీళ్ళుదొరకక్కఅవస్థపడి రాత్రికి అస్థలముచేరుకున్నాడు. అక్కడ ఏనుగ, మూట గాని గొల్లవాడుగాని ఎవరూలేరు. అయ్యోఅని ఏడ్చుకుంటూ పక్కవూరికిపోయి పోలీసులకు సంగతంతా చెప్పుకున్నాడు. వాడిపేరేమని యడిగినారు. నిన్నమధ్యాహ్నమని చెప్పినాడు. నిన్నమధ్యాహ్నమేమిటి నీమొఖము దొంగఏమిటి పిచ్చిగాలోలు పొమ్మనిరి. వాడేడ్చుకుంటూ పోయినాడు. ఈగొల్లవాడుపోతూ ఒకవూరుబయట సాయంకాలము చాకలవాళ్ళు రాజుగారిగుడ్డలువుతికి ఆరవేస్తూయున్నారు. వాళ్ళనుచూచి ఓసిచ్చిచాకలులారా నేనిప్పుడే వూరులోనుంచి వస్తున్నాను. వూరులోఅందరు ఎవరికి దొరికినది వాళ్ళుదోచుకుంటున్నారు. ఇదిగో నావద్దమూట చూడండి. ఇంకా మీకు సంగతితెలియదా అన్నాడు. చాకలివాళ్ళు అయ్యో అట్లాగనా మాకుతెలియదు స్వామి మీరు ఈగుడ్డలను చూస్తువుంటారా మేము వెళ్ళివస్తామన్నారు. సరే చూస్తాను త్వరగా రావలెను అన్నాడు. నీపేరేమని అడిగితే నాపేరు నిన్నసాయంకాలము అని చెప్పగా సరేకదా అనుకుని వాళ్ళు వెళ్ళిపోయినారు. ఇదేసమయమని మంచి దుస్తులన్నీ మూటకట్టుకొని పారిపోయినాడుగొల్లడు. వీళ్ళువూరంతాతిరిగితిరిగి ఎవరినడిగినా మాకు తెలియదనిరి. మరునాడు రేవుదగ్గరకు వెళ్ళిచూస్తే గుడ్డలూలేవు, వాడు లేడు. అయ్యో రాజుగారిగుడ్డలు పోయాయనిఏడ్చుకుంటూపోయి పోలీసులకు చెప్పుకున్నారు. వాడిపేరేమనియడిగితే నిన్నసాయంకాలము అనిచెప్పినారు. వాడిపేరుతెలియలేదు అనివూరుకున్నారు. వీడుతిరిగిపోతూవుండగా త్రోవలో ఏరుఅడ్డువచ్చినది. ఏటిగట్టున ఒకఅవ్వ ఒక పదిసంవత్సరముల పిల్లను పెట్టుకొని ఏడుస్తూకూర్చున్నది. ఈ గొల్లాడు ఏమిఅవ్వా ఎందుకేడుస్తావని అడిగినాడు. అందుకు అవ్వ నాయనా నేనుముసిలిదానను ఈపిల్లతో ఏరుదాటలేక ఏడుస్తున్నానన్నది. ఓసోయ్య అవ్వ ఇంతమాత్రానికేనా నేనుదాటిస్తాను రాఅవ్వాఅన్నాడు. అంతకంటే పుణ్యమా నాయనా నీపేరేమనియడిగినది. నాపేరు దానిమొగుడుఅన్నాడు. సరే నాయనా దాటించమని వేడుకొన్నది. ముందు పిల్లనుదాటించుతానని ఏనుగమీదపిల్లను కూర్చోపెట్టుకుని వెళ్ళిపోయినాడు. మరలరాలేదు. అవ్వ చూచి, చూచి పోలీసులకు చెప్పుకొన్నది సంగతంతా. వాడి పేరేమనియడిగితే దాని మొగుడుఅనిచెప్పినది. దాని మొగుడు దానినితీసుకుని వెళ్ళితే నువ్వెందుకేడుస్తావని అందరు అవ్వను ఓదార్చినారు. అవ్వఏడ్చుకుంటూ పోయినది. గొల్లవాడు సౌఖ్యముగా పెండ్లిచేసుకొన్నాడు. ఊకొట్టినవాళ్ళకు వుంగరాలు, కథ చెప్పినవాళ్ళకు కంకణాలు.

## చెప్పులకొండడికథ

శ్రీమతి ప్రాతూరి లక్ష్మమ్మ గారు

బ్రహ్మ ప్రపంచమునుసృష్టించి మానవకోటినంతా సృష్టించాడు. ఇక చేయవలసినదేమిటాఅనిఆలోచించి మాదిగకొండడినిపిలచి ఒరేకొండా, భూలోకంలోకివెళ్ళి "నిత్యతలగోడుగు వారభోజనము" అనిసాటించిరారాఅన్నాడు. కొండడుతనమనస్సులో "అబ్బబ్బ! యీబ్రహ్మ ఒకనిమిషమయినా నన్నుకూర్చోనివ్వడుకదా, నాప్రాణం విసిగిపోతూంది, యీవెట్టిచాకిరీచెయ్యలేక; యీాయనరోగంకుదర్చాలి. ఆయన చెప్పినమాట తలక్రిందులుగా చాటిస్తాను." అనుకుని జనులంతా, యీాదండోరామూలంగా తెలుసుకోవలసినదేమిటంటే, నిత్యముభోజనముచేసి, వారముకు ఒకసారి తలంటుపోసుకోవలసిన దోహోయి అనిసాటించేడు. తిరిగిబ్రహ్మలోకంలోకి వచ్చాడు. ఏమనిసాటించావురాఅన్నాడు బ్రహ్మ. నిత్యభోజనము వారతలగోడుగూ అనిసాటించాను బాబు అని చెప్పాడు. ఓరినీతాడుతెగా, నాకుతిరిగి ప్రతిసృష్టికల్పించావురా వీరికిభుక్తికి ప్రతిసృష్టిచెయ్యవలసిన పనోటికల్పించావు అని విసుక్కొని, నీవు భూలోకంలో నరులకు వెట్టిమూటలుమోస్తూ పాదరక్షలు కుట్టి యిస్తూవుండు అనిభూలోకంలోకి పంపాడుట. అప్పటినుంచీ పాపం కొండడికులంవారంతా అవృత్తిలోనేయున్నారు.

## లలాటలిఖితము

శ్రీమతి విశ్వనాథ అన్నపూర్ణమ్మ గారు

పూర్వమందు లోకవిద్రావణుండగు రావణుండు లంకాపట్టణంబున రాజ్యమేలుచుండెను. అతడీశునింగూర్చి తపంబాచరింప నిశ్చయించి కైలాసంబున కరిగి యందు ప్రాణాయామప్రత్యాహారధ్యానధారణసమాధినిష్ఠాగరిష్ఠుండై ఘోరంబగు తపంబాచరింప దానికీశ్వరుడుమెచ్చి ప్రత్యక్షంబై 'యోదశకంధరా! యింకనీతపంబు చాలింపుము. నీతపస్సునకుమెచ్చివచ్చినాడను, వలసినవరంబులనువేడు మిచ్చెద'ననినుడువ; నారాక్షసేంద్రుం డాగంగాధరునికినమస్కరించి 'యోదేవా! తమ యనుగ్రహంబున నాకిపుడన్ని భోగభాగ్యంబు లొదవియున్నయవి. అయిననూ నాసమానులగు రాక్షసులచేతను నాప్రతికక్షులగు దేవతలచేతను, అష్టదిక్పాలురచేతను ఇంకనితరులచేతను మరణములేకుండ నందఱిని పరాభవమొందించునట్టి వరమునాకొసంగ వేడెద'ననినుడువ నాచంద్రమౌళి యట్లగుగాకయని వరమిచ్చి యంతర్హితుండాయె. అదిమొదల్కొని యతిగర్విష్ఠుండై ఎవరినీలక్షింపక యష్టదిక్పాలురను దేవతలను చెరబెట్టి తనకుసమానులెవ్వరును నీప్రపంచంబునలేరని యహంకారయుక్తుండై అజ్ఞానంబున గాలముగడుపుచుండె. ఇట్లుండ నొకనాడు కృతస్నానుండై యలంకరించుకొని దర్పణమున దనప్రతిబింబము జూచుచు వస్త్రములందొడుగుచుండ నతనివెనుకభాగంబున గమలాసనుండు నిలిచియుండుటంగని 'నీవెవ్వడవు? నిర్భీతుండవై నాసమీపమున నిలిచియుండుటకు

గారణంబెద్ది?’ యనియడుగ నాసమీపమందుండిన మంత్రి, ‘అయ్యా! ఈతండే ప్రజాసృష్టికర్తయగు చతుర్ముఖబ్రహ్మ. ఈతనిసంకల్పానుసారముగ నీప్రపంచము జరుగును’అని విజ్ఞాపింప నాలంకాధిపు డతిఉగ్రుండై ‘వీని సంకల్పానుసారముగనే ప్రపంచము జరుగుచున్న యదియా? దానిని నేడప్పించెదను చూడు’మన, ప్రజాపతివిని ‘ఓరీ! మదాంధా! నీకువర మిచ్చి నిన్ను గర్వమనుసముద్రమునముంచిన యామృగధరుండు సహితము నాసంకల్పమును దప్పింపజాలడు. నీబోటివారలచే నేమగు’ననినుడువ మరింతమండిపడి ఘటోహారునింబిలిచి ‘ఓరీ! నీవురాజమార్గమునకుజని యందుబోవువారిలో నొక్కబాలుని గొనిరమ్మని ఆజ్ఞాపింప వాడుపోయి యొకబాలుని దోడితెచ్చి రాక్షసరాజు నెదుటనిలుప, నతడు ‘ఓశారదాపతీ! ఈ బాలునకు కన్య నెక్కడకూర్చినాడవు? ఇంకనెన్నిదినంబులకు వీనికి వివాహమగును జెప్పు’ మనియడుగ నాకమలాసనుండు ఈబాలునికి హిమవత్పర్వతము దక్షిణదెసనుండు కాశీక్షేత్రంబునంగల గంగాతీరంబున నేటికి తొమ్మిదవదినముమధ్యాహ్నంబున పండ్రెండుఘడియలకు వివాహమగునటుల నియమించినాడ, నాదినంబున వివాహమైనపిదప నీకెఱింగించువాడ’ ననినుడువ నారాక్షసుండునవ్వి తనమనంబున వేరొకవిధమాలోచించి యాపిల్లవాని నొకపెట్టె యందునిచి బీగమువేసి తానే దానికి మొహరువేసి తనసొంత ఉగ్రాణంబుననునిచె. బ్రహ్మ సంకల్పకాలము సమీపింపగా రావణునిజననికాశికిపోయి గంగాస్నాన మాచరించవలయునను కుతూహలాయత్తచిత్తయై తనకుగావలయు పదార్థంబుల నొకపేటికయందునిచి కుమారునకిం జెప్పిపోవలయునని నిజతనూజుడు శయనించియుండు చోటికరుదెంచి ‘ఓరీ! కొడుకా! నేను కాశీయాత్రపోయి, గంగాస్నానమాచరించి విశాలాక్షిని దర్శించివత్తు’ననిజెప్పగా రావణుడు బ్రహ్మతో దానుబలికినపందెము ఐశ్వర్యమదమునమరచి, యవశ్యముగాబోయిరమ్మనిజెప్పి తల్లికినమస్కరింపగా నాయమ తనచేతనున్న పెట్టెనుగ్రిందబెట్టి చరణకమలంబులకెఱగిన కుమారునిశిరస్సున రెండుకరంబులిడి ఆశీర్వదించి వెడలుసమయమున తనసొంత పెట్టెనట మరచి బాలుండుండు పేటికనెత్తుకొనిపోయెను. ఇట్లుపోయి గంగాతీరముంజేరి యందు స్నానము జేసి వస్త్రమునుధరియింప పేటికందెరువ నందుండిన బాలకుడు బయలువెడలినిలిచెను. వెంటనే యచ్చట కరంబున బుష్పమాలికనుధరించియుండు రాజకన్యక మకరందపూరితమగు పుష్పంబుచాటుకురుకు భ్రమరంబుతీరున నతిశీఘ్రముగావచ్చి ఆబాలుని కంఠసీమయందు దనకరగతపుష్పమాలిక నలంకరించి యతనిపదపద్మంబులకు నమస్కరించి చేతులుమోగిడ్చి నిలిచె. ఇట నారావణుం డెప్పటివలెనే నలంకారయుక్తుడై నిలచియుండుసమయమందు బ్రహ్మదేవుడు “తదేవలగ్నంసుదినంతదేవ”యని ఘంటానాదముజేయ విభీషణాగ్రజుం డది విని వెనుకకుదిరిగి వాణీమనోనాయకుంగాంచి ‘నీవేమికారణమున ఘంటానాదముజేసితివి’? యని బ్రశ్నజేయ దానికతండు ‘ఓరీ! మదాంధా! అపుడేమఱచితివా? ఆదినము కాశీక్షేత్రమున వివాహమగునని జెప్పిన బాలున కీదినంబున వివాహమాయె’నని ప్రత్యుత్తరమీయ

నాసురారి తనసొంత ఉగ్రాణమందుంచిన పేటికందెచ్చునటుల చారుల కాజ్ఞాపించెను. అచ్చట రావణునితల్లి వివాహఘాతుకముచేయుటకుయత్నింప నచ్చటనుండినవారలెల్ల 'అమ్మా! నీవు వివాహాటంకముచేసినయెడల మార్జాలరూపంబునంబుట్టెదవు. పుణ్యస్థలమైన ఈకాశికి వచ్చియు పాపనాశనకరమగు గంగలోగ్రుంకియు వివాహాటంకము జేయదగునా'? యని సమాధానముజెప్ప నామె ఆదంపతులిరువురిని ఆపెట్టెలోనునిచికొని వెంటనే విమానారూఢయై రాక్షసులు కామరూపులు గనుక ఆలస్యరహితముగా రావణుని యుగ్రాణమున నాపెట్టెనుబెట్టి తనయొక్క పేటికనెత్తుకొని మరల వారణాసిజేరెను. రావణునిచేపంపబడిన చారులు ఉగ్రాణముజేరి యందుండు పెట్టెనెత్తుకొనిబోయి రావణునిముందునిచిరి. అతండు దానినిపరీక్షించి తానువేసియున్న ముద్రగానక సంశయముతో పేటికందెఱచిచూడ నందులో ఆదంపతులిద్దరు గనపడిరి. వారింగాంచి యమితాశ్చర్యమునుబొంది ఆదంపతులకువలసిన వస్తువులిచ్చి వారినిబంపెను. కాబట్టి విధికృతమునుదప్పించుట సాధ్యముకాదు!

## అభ్యాసంకూసువిద్య

శ్రీమతి యన్. వెంకమ్మ గారు

అనగాఅనగా ఒకవూర్లో ఒకరాజువుండేవాడు. అయన ఒకరోజున భార్యతోకూడా వేటకువెల్లినాడు. కొంచెంసేపు వేటాడినతరువాత విశ్రాంతికొరకు ఓచెట్టునీడనుచేరి కూర్చుని వుండగా రాజుభార్య భర్తకాలిమీద తలనిడినిద్రించినది. కొంచెముసేపటికి ఆమెకనురెప్పల మీదఈగవాలినది. ఆమె నిద్రకుభంగము లేకుండగనే రాజు తనబాణముతో ఆఈగను వేటాడినాడు. కొంచెముసేపటికి ఆమెనిద్రలేవగా ఈసంగతి ఆమెతోచెప్పినాడు. ఆమాటవిని ఆమెనిర్లక్ష్యభావముతో "అభ్యాసంకూసువిద్య" అనిబదులుచెప్పినది. ఆమాటకు రాజుకు కోపమువచ్చి భార్యను ఊరుచివర ఒకమేడకట్టించి అచ్చట విడిచినాడు. ఆదినము మొదలు రాజుభార్య ప్రతిదినము ఒకఏనుగుపిల్లను చేతులలోఎక్కించుకొని గంటలకొలదిగ ఆడించుచు అదిపెద్దదిఅయినను అదేమాదిరిచేయుచు ఎవరైనఅడిగినయెడల అభ్యాసంకూసు విద్యఅని బదులుచెప్పెడిది. ఈసంగతి ఊరంతా తెలిసి తిన్నగా రాజుగారికికూడా తెలిసినది. ఈవింతచూడవలెనని రాజుగారు ఒకరోజున భార్యమేడకువచ్చినారు. భర్తను తగురీతిని మర్యాదచేసి తమాషాకొరకు తనఏనుగును తీసుకొనివచ్చి చేతిమీదఎక్కించుకొని ఆడించు చుండగా రాజు అదిఏమిఅనిఅడిగినాడు. అందుకు ఆమె "అభ్యాసంకూసువిద్య" అని బదులు చెప్పినది. ఆమాటతో ఆరాజు అందలిసత్యముగ్రహించి ఆశ్చర్యమునొంది ఆమెను బహువిధ ములపొగడి తనమేడకు తీసుకునివెల్లి మునుపటిమాదిరి కాలంగడుపుచుండెను. ఏపనిగాని ఓర్పుతో అభ్యాసంచేసినయెడల మనుష్యునకు సాధ్యముకానిదిఅనిఉండదు.




పెళ్ళాము పాదములలో నాగలిమేకులు కొట్టిన భర్త:—

బెల్గాముజిల్లా పింపిల్ గ్రామమునకు చెందిన విఠోబా కరంజాల్‌కర్ అనువానిభార్య మాహ్నీ. ఆమె వయస్సు 13 సంవత్సరములు. ఏడెనిమిదిసంవత్సరములకుపూర్వము వారలకు వివాహమయ్యెను. మాహ్నీ పుట్టింటనేయుండుచువచ్చెను. 1930 ఆగష్టుమాసమున గణేశునిపర్వమునకుముందు కరంజాల్‌కర్ అత్తవారింటికి పోయి పండుగకు తనభార్యను తనయింటికి పంపవలసినదని కోరెను. అత్తపంపుటకు అంగీకరింపలేదు. ఆగష్టు 25-వ తారీఖున అతడు తగినమద్దతుతో తిరిగివచ్చి భార్యను బలవంతముగగొనిపోయెను. కొనిపోయి ఏమిచ్చెను? చేతులు విరిచికట్టి ఆమెను ఒకగదిలో పడవైచెను. పైగా రెండు నాగలిమేకులుతెచ్చి అవి ఆమె చెరియొక పాదములోను కొట్టెను. ఈవిషయము కోర్టుకెక్కెను. మగనికి భార్యపై ఇట్టి అధికారముగలదను అభిప్రాయములో ఆతడీపనిని చేసెను గావున శిక్షవిధించుటలో ఆవిషయము జ్ఞప్తియందుంచుకొనవలయునని అతని ప్లీడరు చెప్పెను. ఈకేసు విచారించిన బెల్గాముజిల్లాజెడ్జి తీర్పులో ఇట్లుచెప్పెను. "క్రిందికులము వారిలో మగని అధికారవిషయమున ఇంకను ఇట్టిదురభిప్రాయముండుట విచిత్రము. ఈబాలికయెడ జరిగిన ఈక్రౌర్యము అపూర్వమైనది. అజ్ఞానము, అవిద్య దీనికికారణము." మేకులమేస్త్రియగు ఈమగనికి జడ్జిగారు ఆరుమాసములు ఖైదుశిక్షవిధించిరి.

—*Daily Post.*

వీరనారి:—

గౌహతినుండి ప్రచురింపబడు 'అస్సామియా' పత్రిక ఈవార్తను ప్రచురించుచున్నది: "డిబ్రూగర్‌నకు ఇరువదిరెండుమైళ్ళ దూరమునగల మోరన్ తేయాకు తోటలోని ఒకగుమాస్తా ఇంటిలోనికి అతడు ఇంటలేని ఒకనాటి యర్ధరాత్రి ముగ్గురు పంజాబీదొంగలు చొరబడిరి. ఆగుమాస్తాభార్యను, ఆమె సేవకులనిద్దరిని ఆదొంగలు స్తంభములకు కట్టివైచిరి. చంపుదుమని భయపెట్టుటచే ఆగుమాస్తాభార్య తనట్రంకుల ఇనుప పెట్టెల తాళములనిచ్చివైచెను. ఆతాళముతో పెట్టెలను తెఱచి వారు కొన్నివేలు ఖరీదుగల నగలను నాణెములను సంగ్రహించిరి. ఈలోగా ఆగదిలో ఒకమంచముపై పరుండియున్న ఆమెపసిబిడ్డ క్యారుక్యారునఏడువ దొడంగెను. పసిబిడ్డకుపాలిచ్చుటకు తన్నువదలిపెట్టవలసినదిగా ఆమె దొంగలను అతిదీనముగ ప్రార్థించెను. ఏకళతోనుండిరో దొంగలు ఆమెకట్లువిప్పిరి. అంతట ఆమెపిల్లకు పాలుఇచ్చుటకు బదులుగా తన తుపాకినండి గుండ్లుపెట్టి దొంగలపైపేల్చెను. మూడుపేల్పులు. ఒకడువెంటనే చచ్చెను. మఱియొకనికి బలమైనగాయములు తగిలెను. తుపాకిప్రేల్పుడు చప్పుడుకు తోటయజమాని వినోపియనుడు లేచివచ్చెను. దొంగలు ముగ్గురిలో చచ్చినవాడుతప్ప మిగిలినఇద్దరును పారిపోయిరి. తోటయజమాని అచ్చటిసేవకుల కట్లువిప్పెను; ఈదొంగతనమునుగూర్చి పోలీసువారికి తెలిపెను."

శాసనసభలో పొగ:—

పాట్నా శాసనసభకు చెందిన కార్యాలయోద్యోగులు ఒకనాటియుదయము లాబీయంతయు పొగతో క్రమ్మియుండుటచూచి కంగారుపడిరి. పోయి పరిశీలింపగా అందలి కాలుతుండుచుకు పేపీలు రెండు కాలి ప్రక్కనున్న చాపకూడ అంటుకొనుచుండెను. ఈఅగ్నికి కారణము లాబీలోనుండిన వారెవరో సిగరెట్టు కాల్చి ఆర్పకుండ దానిపీకెని ఇచ్చట పడవేయుటయేయని కనుగొనబడెను. 'చుట్టలు, సిగరెట్టులు త్రాగకూడదు' అని శాసనసభలో నోటీసులు అంటించవలసిన అవసరమువచ్చినదని అంగీకరింతురా?

మంచీనీళ్ళగాజుగ్లాసుకొఱకు:—

బొంబాయి. డంకన్ రోడ్డు. ఒక మహమ్మదీయ టీదుకాణముదగ్గరకు ఒకహిందూబాలుడుపోయి మంచినీళ్లు అడిగెను. దుకాణమువారు ఇతనికి గాజుగ్లాసుతో మంచినీళ్లుఇచ్చిరి. నీళ్లు త్రాగుచుండగా బాలునిచేతినుండి గ్లాసు పడిపోయిపగిలిపోయెను. దుకాణమువారికి దండుగ ఇచ్చుకొనుటను తప్పించుకొనుటకై బాలుడు పిక్కబలముచూపెను. దుకాణదారు వానిని వెన్నంటెను. ఎదురుగవచ్చుచున్న ముగ్గురు మహమ్మదీయులు ఆబాలునిపట్టుకొనిరి. ఇదిఅంతయుచూచుచున్న హిందువులకు ఇందుమీద కోపమువచ్చి మహమ్మదీయులతో పోట్లాటపెట్టుకొనిరి. లాటీకర్రలు, రాళ్ళు, సోడాబుడ్లు ఆయుధములు. ఇంతలో పోలీసులువచ్చి శాంతి నెలకొల్పిరి. మహబిందుకలహమనగా ఇట్టిదియే.

దయ్యములదుష్టచేష్టితము:—

నాగపురము. పదునాలుగువత్సరములబాలిక ఉన్నట్టుండి ఆమెముఖమున ఒకనాడు దీపపుమసిపూత కానవచ్చెను. తుడిచివేసికొనగా చెరిగిపోయినదిగాని వెంటనే మరలమసిపూత అగుపడుచుండెను. ఇట్లు ఒక పక్షముగడచెను. ఇది దయ్యముల కృత్యమని అనుమానింపబడెను. ఆబాలికబంధువులు నిరంతర మారామెను కనిపెట్టిచూచుచుండిరి. మసినితుడిచివేయుట, మసి తిరిగివచ్చుట జరుగుచునేయుండెను. ఈదుష్టచేష్టిత మింతతో ఆగలేదు. ఆమె పెట్టె మూతపడగొట్టబడి అందలిసరుకు చిందఱవందఱచేయబడి బట్టలు చింపివేయబడెను.

శవమునుతగులబెట్టినపుడువొడిబ్రాలువస్తువులుతగులబడకపోవుట:—

"మదరాసు జార్జిటవును ప్రాంతను ముత్తియ్యమొదలివీథిలో 5-వ నంబరుగృహమున వైశ్యులు నివసించుచున్నారు. పెట్టుగాల శేషాచలంశ్రేష్ఠిగారి ధర్మపత్నియును గాంధర్వకల్పవల్లిగ్రంథకర్త్రియును గానకళావిశారదయు శ్రీరాములుశ్రేష్ఠిగారి జననియును సుమంగలియునగు శ్రీమతి యతిరాజమ్మగారికి 69-వ సంవత్సరము జరుగుచున్నది. ఈమెభర్త శేషాచలంశ్రేష్ఠిగారు సజీవులైయున్నారు. ఈయన వయసు 75 సంవత్సరములు. ఈయన మంచి శరీరదారుఢ్యమునుకలిగి అనేకధర్మకార్యములలో ఇప్పటికిని నాయకత్వమువహించి పని చేయుచున్నారు. 1918 మార్చినెల 14-వ తేదీని శేషాచలంశ్రేష్ఠిగారి షష్ఠిపూర్తిఉత్సవము నారాయణమొదలివీథిలో కలిబి రామన్నశ్రేష్ఠిగారి వైశ్యధర్మసత్రమున శాస్త్రోక్తముగా జరుపబడెను. ఆపుణ్యదంపతులిరువురు చాల దానధర్మములగావించిరి. వీరికి చాలమంది పౌత్రులును దౌహిత్రులునుకలరు. కూరపాటి వంటెరు మాళుశ్రేష్ఠిగారిసంతతివారు వీరి దౌహిత్రులు. దేను రామానుజంశ్రేష్ఠిగారికి యతిరాజమ్మగారు తోబుట్టువు. ఈసాధ్వీమతల్లి యీనెల 7-వ తేదీ గురువారంమధ్యాహ్నము 12½-గంటలకు తన భౌతికశరీరమును పరిత్యజించెను. ఆర్యవైశ్యులలో స్త్రీ సౌమాంగల్యవతిగా మృతినొందినచో రవికలగుడ్డ, కొబ్బరికాయ, అరటిపండు, కుంకుమభరిణ, కాటుకడబ్బి, దువ్వెన, అద్దము, తిరుమణిగడ్డ మున్నగువస్తువులను చీరచెంగులోవేసి కట్టెదరు. దీనిని ఒడిబ్రాలుఅనియును ఒడికట్టుఅనియును పిలచెదరు. ఆరీతిగానే యీమెకు ఒడిబ్రాలుకట్టి దహనము చేసిరి. మరునాడు బంధువులు సంచయనమునిమిత్తమువెళ్లిచూడగా శవము పూర్తిగాదహనమయ్యెనుగాని ఒడిబ్రాలువస్తువులుమాత్రము తగులబడలేదు. అందువలన అస్థికలతోపాటు ఒడిబ్రాలువస్తువులనుగూడ కాశీకితీసికొనివెళ్లి గంగాదేవికర్పించుటకు వీరు నిశ్చయించిరి. ఇదిచాల ఆశ్చర్యకరమైనవిషయము."—ఆంధ్రపత్రిక.




చేపలవర్షము:—

యూరపునందలి బోర్డోలో ఈ నడుమ బ్రతికియున్న చేపలవర్షము కురిసినది. ఈవర్షము ఒక అరనిముసము మాత్రమే యుండినది గాని పడిన చేపలకు లెక్కలేదు. వందలకొలది చేపలు కార్ల క్రిందపడి చనిపోయెను. అందుమీద కొంతసేపు కార్లు ఆపుచేయబడెను. స్త్రీలు వీథులలోనికి పరుగుపరుగున వచ్చి బుట్టలకొలదిగ ఈ చేపలను ఎత్తుకొనిపోయిరి. ఇట్టి చేపలవర్షము ప్రపంచచరిత్రలో ఇదివఱకు రెండుసారులు జరిగియున్నట్లు చెప్పబడుచున్నది. 1928 మే నెలలో శెల్ ఫాన్టుదగ్గర బ్రమ్‌హిర్కు వందలి ఒకానొక బంగాళా పైకప్పుమీద ఒకానొక గాలివానసమయమున డజన్లుగ చిన్న చేపలుపడినవి. 1929 అక్టోబరుమాసమున దక్షిణరోహిడీషియాయందలి బులవేయోలో ఒక కర్షకుడు తనపొలమున ఒక భాగమంతయు అంగుళముదళసరిని చేపలతో కప్పబడియుండుట కనుగొనెను. చేపలున్న నీటిపట్టు అచ్చటికి మూడు మైళ్ళదూరముండెను.

గణితశాస్త్రమున హిందువులు దిట్టలు:—

హాంబర్గు విశ్వవిద్యాలయపు ప్రొఫెసరగు డబ్లుయు. ష్లాస్కీగారు ప్రపంచగణితశాస్త్రచరిత్రను పరికించినచో ప్రాచీనహిందువులగణితశాస్త్రపాండిత్యము ఆశ్చర్యపడదగినదిగానుండుననియు, ఆధునికకాలమున గూడ రామానుజమువంటివారి నామములు ఆకీర్తిని నిలుపుచున్నవనియు చెప్పిరి.

చిలుక జావా భాషలో మాటలాడుట:—

“హాగుమారు” అను స్టీమరులో నొక మిక్కిలి అందమైన చిలుక యుండెను. ఆస్టీమరు ఇటీవల కొలంబో రేవులోనికి వచ్చినపుడు చూడగా ఆచిలుక కనబడలేదు. పోలీసువారు దానికొరకు వెదుకగా నదిబజారులో కనబడెను. అపుడు వారు యిద్దరిని అరెస్టుచేసి వారిపైని కేసుచేసిరి. నేడు విచారణజరిగినది. అపుడాచిలుకను కోర్టులోనికి తీసికొనివచ్చిరి. మొదట నది ఉదాసీనముగానే యుండెను. కాని దానిని గుర్తుపట్టినపిమ్మట అది పెద్దపెద్ద కేకలువేయుచు జావాభాషలో మేజస్ట్రేటును తిట్టసాగెను.

విద్యుద్దీపముగల గొడుగు:—

గతవత్సరము కనుగొనబడిన విచిత్రములలో విద్యుద్దీపముగల గొడుగు ఒకటి. ఈగొడుగునుధరించి వర్షములో రాత్రివేళ పుస్తకమును పఠించవచ్చును.

### 500 సారులు వెలుగు అగ్గిపుల్ల:—

ఇపుడు సాధారణముగా మన ముపయోగించు అగ్గిపుల్ల ఒక్కసారి వెలిగించుటతో నిరుపయోగమగును. అట్లుగాక 500 సారులు వెలిగించి ఉపయోగింపగల అగ్గిపుల్ల కనుగొనబడినది. ఒక్కొక్కపుల్ల అణాకో అరణాకో విక్రయింపవచ్చునని మదింపు వేయబడినది.

### గొరిల్లాకోతి జీవితము ఇన్సూరు చేయబడెను:—

వాషింగ్టన్ జంతుప్రదర్శనశాలలో ఒక గొరిల్లాకోతిగలదు. దానివయస్సు ఆరుసంవత్సరములు. దాని జీవితము రెండువేలపౌనులకు ఇన్సూరుచేయబడెను. ఆజంతుప్రదర్శనశాలలో ఇన్సూరుచేయబడినజంతువు ఇదిఒక్కటియే. ఈకోతికి గుండెకుడిప్రక్కనుగలదు. అందుచే డాక్టరులు ఈకోతి కవలబిడ్డయై పుట్టియుండునని ఊహించుచున్నారు. గొరిల్లాకోతులలో కవలపిల్లలపుట్టుక ఇదివఱకు కనుగొనబడలేదు. ఇదే ప్రథమము. ఈగొరిల్లాకోతి ఆరుఏండ్లపిల్ల. అయినను చూపులకు బాగుగా ఎదిగినమనుష్యునివలెను, బలమునకు సగటుమానవునికంటె హెచ్చుగనుఉన్నది. ఇది ఇప్పుడు న్యుమోనియాజ్వరముతో తీసుకొనుచున్నది. దీనిరోగమును కుదుర్చుటకు న్యూయార్కుపట్టణమునుండి ప్రత్యేకవైద్యులు కొనిరాబడిరి.

### 106 సంవత్సరములు జీవించిన స్త్రీ:—

ఇంగ్లండునందలి విండ్సరుచెంతగల క్లూవరునందు అరబెల్లా బ్రిడ్జిమాన్ సతియను ఆమె జీవించుచుండెను. ఆమెవయస్సు 106 సంవత్సరములు. ఆమె క్లూవరునందు ఎనుబదివత్సరములుగ జీవించుచుండెను. నేడుఇంగ్లండునందుగల స్త్రీలందరిలోను ఈమెయే మిక్కిలి వృద్ధురాలని ఊహింపబడుచున్నది. ఏప్రియలు రెండవవారమున ఈమెమరణించెను. బ్రతికిఉన్నప్పుడీమెతనయింటియందు గాస్ లైటునుగాని, విద్యుద్దీపమునుగాని పెట్టనిచ్చెడిదిగాదు. కొవ్వువత్తి దీపములనే ఉపయోగించునది. పత్రికావిలేఖరులు పలుపురుకోరినను వారికి దర్శనమిచ్చునదికాదు. ఎప్పుడును ఛాయాపటము ఎత్తుకొనినదిగాదు. నవీననాగరికతను ఆమె బూటకముగ భావించెను. ఆమెకు 100 సంవత్సరము లుండినపుడు అనగా ఆఱుసంవత్సరములక్రితము ఒకసారి మోటారుఎక్కెను. ఆఒక్కసారితోడనే మోటారనిన ఆమెకు మొగము మొత్తెను. తరువాత ఎప్పుడుబయటికి పోవలసివచ్చినను తనగుఱ్ఱపుబగ్గీనే ఉపయోగించుచుండెను. సుప్రసిద్ధాంగ్లనవలాకారుడగు ఛార్లసుడికెన్సు తుదిసారి బహిరంగసభలో ఉపన్యసించినపుడు ఈమె లండనుపోయి ఉండెను. లండనుపోవుటకు ఈమెకదియే తుదిసారి.

### గాలివిమానముపై గరుడపక్షులు దాడివెత్తినవి:—

గ్రిఫిత్ లాయిడ్ సతి కొలరాడోలో పర్వతములపై 15,000 అడుగులఎత్తున గాలివిమానముపై ఎగురుచుండెను. దిగువను రెండుగరుడపక్షులు కొండగొఱ్ఱెలతో దొమ్ములాడి వానిని తన్నుకొనిపోవుటను చూచుచుండుట విమానమునుండి ఈయమచూచెను. ఆపక్షులీగాలి విమానమునుచూచి తమనుకాదని తమ ఆహారమును గొనిపోవచ్చిన మఱియొకపక్షిగాతలచి గాబోలును దానిపైకి దాడివెత్తినవి. వానిని భయపెట్టుటకై గ్రిఫిత్ సతి తనయంత్రమును ధ్వనిచేయునట్లుచేసెను. అయినను జడుపక ఒకపక్షి గ్రిఫిత్ సతిని పొడిచెను. యంత్రము కూడ ఒక నిమిషము ఆమెచేతినుండి జారెను. ఇక ఈపక్షుల నెదుర్కొని బాధములేదని ఆమె కొంచెము ధైర్యమును చిక్కబట్టి యంత్రమునుచేతబట్టి పడిగానడుపుకొనుచుబోయెను.

### ఒకేకాన్పునముగురుబిడ్డలు:—

అల్లగడ్డలో ఒక పంచమస్త్రీ పదమూడవసారి గర్భవతియయ్యెను. ప్రసవసమయమున ఆసుపత్రికి గొనివచ్చిరి. మొదట మొగశిశువు పుట్టెను, తరువాత వరుసగా యిద్దరు ఆడశిశువులుపుట్టిరి. ముగ్గురుశిశువులును తల్లియును ఆరోగ్యముగానున్నారు.

# గ్రంథపరిచయము

**ఉపదేశసారము:—**

భగవానులగు శ్రీరమణమహర్షులవారిచే రచియింపబడినది. సంస్కృతశ్లోకములు, తెలుగుద్విపదలు. వీనికి శ్రీరమణదాసులగు ప్రణవానందం గారిచే తెలుగుతాత్పర్యము వ్రాయబడినది. శ్రీకాశీభట్ట కృష్ణరాయ శాస్త్రిగారు గ్రంథప్రవేశమున లిఖించినటుల ఈయుపదేశము లవశ్యము భవదావతప్తులను శాంతిపఱచుననుటలో సంశయములేదు. గ్రంథమున శ్రీరమణమహర్షులవారి ఛాయాచిత్రముగలదు. క్రౌనుసైజున 18 పుటలు. వెల రు 0-1-0. చిరునామా శ్రీరమణాశ్రమపుస్తకాలయము, తిరువణ్ణామలై.

**ఆదిశేష సహస్రనామ స్తోత్రము:—**

గ్రంథకర్త భాషాచతుష్టయపండితులగు దే. సు. బాలసుబ్రహ్మణ్యశాస్త్రిగారు. ఇందు శ్రీమద్వినాయక భుజంగస్తోత్రముకూడ గలదు. బళ్ళారిలో బెంగుళూరురోడ్డుననున్న సరస్వతిముద్రాక్షరశాలలో ముద్రితము. విట్టల్ శేషప్పశెట్టిగారి సొంతఖర్చున ముద్రింపబడి, ప్రచురింపబడి స్తోత్రపారాయణాభిలాషులగు భక్తులకువలయుంచో పోస్టేజి ఖర్చులుకూడభరించి ఉచితముగాపంపబడును. చిరునామా: విఠల్ శేషప్పశెట్టి, మర్చెంటు, బ్యాంకర్, ప్రజాసంఘముగౌరవకార్యదర్శి; బళ్ళారి.

**సుదతీ సుభాషితములు:—**

కర్త శ్రీయడ్లపల్లి దేవయ్యచౌదరిగారు. 'యువతులకు సునీతివలపఱచుటయే ప్రధానాంశముగఁజేసికొని' రచియింపబడిన ఈచిన్నిపొత్తమునకు గృహలక్ష్మి స్వాగతమిచ్చుచున్నది. కవితాత్మగల శ్రీతుమ్మల సీతారామమూర్తిచౌదరిగారిచే నిది సుసంస్కృతమగుట ముదావహము. 'జననిపాదపద్మములకు' సమర్పింపబడుట యొక విశేషము. నీతులగనియగు ఈపద్యపుస్తకము ఆంధ్రబాలికలు చదువదగియున్నది. 'నెలఁతలం దిద్దితీర్చెదు నీతులెల్ల' ఇందు 'తేటగీతులతోఁ దేటతెల్లముగ' తెల్పబడినవి. ఏబదిగీతములతో గ్రంథము ముగిసినది. గ్లేజు కాగితములు: క్రౌనుసైజు 16 పుటలు. చివరనున్న శబ్దార్థములు బాలికలకు మిక్కిలి ఉపయోగముగ నుండును. చిరునామా: దాసరి శేషయ్యచౌదరి, వత్సలతాడిపర్రు, పొన్నూరుపోస్టు, గుంటూరుజిల్లా.

**శ్రీరమణమహర్షులవారి చరిత్రము:—**

శ్రీశోణాద్రివాసులును, స్కందాంశసంభూతులునగు శ్రీరమణమహర్షులవారి చరిత్రము ఇందు ఒక్కింతవిపులముగ వర్ణింపబడినది. శ్రీరమణచరణసేవకులగు ప్రణవానందులవారు రచియించినది. 1880లో పుట్టి తమ ఋషివర్తనచే లోకమున పావనతకు నిదర్శనమైయున్న ఈ శ్రీరమణమహర్షులవారిచరిత్ర సర్వజన పఠనార్హమైయున్నది. గ్రంథమున వారిపటముగలదు. చిన్నసైజున ముద్రితము. వెల 0-2-0. పుటలు 72. చిరునామా: శ్రీరమణాశ్రమపుస్తకాలయము, తిరువణ్ణామలై.

**శ్రీరమణోపదేశమంజరి:—**

శ్రీ యరుణాచలమున జ్ఞానతేజస్స్వరూపుడై వెలయు శ్రీరమణమహర్షులవారితత్త్వబోధకములగు వాక్యములిందు విచారపరులకు ఉపయోగార్థమై సంస్కృతమున సూత్రప్రాయముగ శ్లోకములలో శ్రీకేసరి వేంకటనారాయణశాస్త్రిగారు రచియించిరి. ఉపదేశప్రకరణము తెనుగువచనమునగలదు. వేదాంతవిషయములు సులభార్థబోధకములుగ చెప్పబడినవి. చిన్నసైజు. 52 పుటలు. వెల 0-2-0. చిరునామా: శ్రీరమణాశ్రమము బుక్కుడిపో, తిరువణ్ణామలై.

**బ్రహ్మేశ్వర పురాణము:—**

శ్రీవాఙ్మయవినోదినీగ్రంథమాలలో నిది మొదటికుసుమము. పద్యకావ్యము. శ్రీశైలఖండభాగము నకు తెలిగింపు. శ్రీశైలపశ్చిమద్వారమాహాత్మ్యము, శ్రీమదలంపురీస్థలపురాణము. తమకవితాలహరిచే తెనుగు దేశమునంతను ముంచివైచిన శ్రీతిరుపతివేంకటకవుల శిష్యులును, శతావధానులును, కవిభూషణులును, దోమాన్వయులునగు శ్రీవేంకటస్వామిగుప్తగారి రచనమనుటచేతనే గ్రంథప్రాశస్త్యము చదువరుల ఆకళింపుకు రాగలదు. అలంపురియందు వెలసిన శంకరునకు జోగులాంబయనబడు యోగాంబికధర్మపత్ని. తెనుగు వారి మతచరిత్రవ్రాయువారికి ఈజోగులాంబచరిత్ర మంచివిషయముల సమర్పింపగలదు. ఇందలి అయిదవ ఆశ్వాసములోని విలసద్రాజుకథ మనోహరముగనున్నది. శైలి సంస్కృతపదభూయిష్ఠముగనున్నను అతిప్రయత్న సిద్ధముకాదు. భక్తి, ముక్తి, రక్తిగల ఈగ్రంథము ఆంధ్రులవిశేషమైనఆదరణకు పాత్రమగునని నమ్మెదము. గ్రంథముద్రణాదులు అతిసుందరము. దళసరి కాగితములు. క్రౌనుసైజు. 98 పుటలు. వెల రు. 1-0-0. అంచెకూలి వేరు. చిరునామా: వాఙ్మయవినోదినీగ్రంథమాల, జి.టి. మద్రాసు.

**దేవీకాలోత్తరము:—**

దేవికాలోత్తరము ఇరువదినాలుగువేల జ్ఞానకాండములుగలవు. అందు నైష్ఠికులయొక్క జ్ఞానాచార విచారమను ప్రసిద్ధమైన అరువదినాలుగవపటలముమాత్రము ఇపుడీగ్రంథమునగలదు. “ఓపరమేశ్వరా! అందరును మోక్షము నొందుటకై, ముక్తికిదోవజూపునదియగు జ్ఞానమును, ఆచారమును నాకుదయచే చెప్పుము”అని పార్వతి పరమేశ్వరు నడుగగా పరమేశ్వరుడు చెప్పినట్లున్నది. శ్లోకము, తాత్పర్యము. కాలజ్ఞానము, జ్ఞానాచారము తెలిసికొనుటకు అనువైనగ్రంథము. ప్రణవానందప్రచురితము. చిన్నసైజు 44 పుటలు. వెల 0-2-0. చిరునామా: శ్రీరమణాశ్రమబుక్కుడిపో, తిరువణ్ణామలై.

**ఉన్నదినలుబది, నేనెవడను?:—**

శ్రీరమణమహర్షులవారి తత్త్వబోధకవాక్యములు. శ్రీప్రణవానందులవారిచే ప్రచురింపబడినవి. ఈ గ్రంథమునందలి వాక్యములన్నియు వేదాంతవిజ్ఞానమును బోధించునవిగానున్నవి. మనస్సును నియమించుకొను టను చెప్పుచున్నవి. చిన్నసైజు 40 పుటలు. వెల 0-2-0. చిరునామా: శ్రీరమణాశ్రమపుస్తకాలయము, తిరువణ్ణామలై.

**మల్లికార్జునరావు:—**

సాంఘికనవల. మల్లికార్జునరావు అనుఆంధ్రయువకుడు లలితను పెండ్లియాడి ఆంధ్రసేవగావించిన కథ యిందువర్ణితము. ఇతివృత్తము కల్పితము, రచనము స్వతంత్రము. నిజామురాష్ట్రమునందలి ఆంధ్రభాగములలోని స్థానికప్రదేశము లీకథారంగములైయుండుట విశేషము. విద్యార్థులకు సద్వర్తనములలవఱుపగల ఈగ్రంథము ప్రచారవిస్తృతి గాంచుననినమ్మెదము. విద్వాన్ కంభంపాటి అప్పన్నశాస్త్రి ప్రణీతము. పూలతోటగ్రంథ మాలాప్రచురణములు ౧. ప్రతిఒక్కంటి చందాదారులకు 0—10—0. ఇతరులకు 0—12—0. క్రౌనుసైజున 118 పుటలు. చిరునామా: పూలతోటగ్రంథమాల, హనుమకొండ, నైజాం.

**ఎరెవ్యూ ఆన్ సిలోగిజమ్:—**

ఆంగ్లమున వ్రాయబడినది. తర్కము అభిమానశాస్త్రముగగొను విద్యార్థులకు ఉపయోగింపగలదు. చదలవాడ ధర్మరాజురచియించినది. ఉచితముగ నొసంగబడును. క్రౌనుసైజున 24 పుటలు. వలయువారు గ్రంథకర్తకేర ఏలూరు వ్రాయునది.

**తొలకరిచినుకులు:—**

రాయలసీమయందలి కవికుమారసమితి వారి ప్రథమగ్రంథము. ఈకృతిని సంతరించినది ఉ.మ, ఆచార్య, మూర్తి అను యువత్రయము. ఈగ్రంథమునుగూర్చి ప్రయాగ వేంకటరామశాస్త్రులగారు యిట్లు పీఠికలో వ్రాయుచున్నారు. "పండితరాజశతకమునందువలె నిందవ్యాపదేశములుగలవు. ఆడిదము సూరకవికృతియందువలె నిందధిక్షేపములున్నవి. ఈచినుకులు కొన్ని భక్తిని, కొన్ని జ్ఞానమును జిలుకుచున్నవనవచ్చును. కొన్నిట శృంగారము, కొన్నిటవీరము, కొన్నిటశాంతము పొడచూపును." ఆర్యపుత్రఅనుగీతము పేర్కొనదగియున్నది. స్త్రీవిద్య, బాల్యవివాహములు, గోహత్య, అస్పృశ్యత మొదలగు సాంఘికదురాచారములను గూర్చిన పద్యములు గలవు. జతీంద్రుడు, రవీంద్రుడు, గాంధి, మోతీలాలు మొదలగు భారతజాతీయనాయకులను; ఖడ్గతిక్కన, బాలచంద్రుడు మొదలగు ఆంధ్రజాతీయనాయకులను స్మరించుపద్యములు ఈయువకవుల జాతీయభావమునకు నిదర్శనములు. చక్కని అనుకరణములు గలవు. 18-వ పుటలోని "మనుజులకేమిటింబనికి..." అను పద్యము పోతన్నగారి 'అడవులమేతమేసి మన మన్యుల కెన్నడు...' అనుపద్యములోడను, 44-వ పుటలోని 'తనమతమున్, స్వభాష...' అను పద్యము వసురాయకవిగారి 'తనదేశంబు, స్వభాష...' అను పద్యములోడను చాయకుబోవుచున్నవి. 'ప్రకృతిసృష్టిని మీఱు భావనాసృష్టివైభవముఁబెంచును నీదు భావబలము' అని కవినిగూర్చి పలికిన ఈయువకమిత్రయమువారి భావనాబలము 14 పుటలోని 'పుట్టునపుడు నీవింత...' అను పద్యమున కొమరుమిగులుచున్నది. ఈయువకవులకులపతులగు డాక్టర్ చిలుకూరి నారాయణరావు ఎం. ఏ. పి. హెచ్. డి గారు వ్రాసిన తొలిపలుకులో 'కాపుపాటలలోన కలదురాతిపి...' అనుటతో ప్రారంభమై 'కల్యాణవేదికి కమలపండువుగ' వఱకు సువర్ణాక్షరములనదగియున్నవి. వానిని స్థలాంతరమున ముద్రించితిమి. ఈగ్రంథముద్రణము అతిసుందరముగనున్నది. చక్కని గ్లేజుకాగితములు. క్రౌనుసైజున 52 పుటలు. వెల 0-6-0. వలయువారు సాధనపుస్తకాలయము, అనంతపురము అని వ్రాయవలెను.

**దేవుడు:—**

గీతమాలిక. చిన్నపొత్తము. స్త్రీరచనము. గ్రంథకర్త్రి శ్రీమతి జ్ఞానాంబగారు. పడమటలంక సాధనాశ్రమస్థాపకులగు శ్రీ సీతారామావధూతలవారి ధనసహాయముతో మాఘోత్సవసందర్భమున ముద్రింపబడి ప్రకటింపబడినది. చిన్నసైజు. 22 పుటలు. ఇందలి కవిత్వము శ్రీతఱిగొండ వేంకమాంబగారి కవిత్వముతో సర్వవిధముల పోల్పదగియున్నది.

**యయాతిచరిత్ర.—**

భారతాంధ్రీకరణమునకు ప్రాభవపీఠమగు రాజమహేంద్రవరమున పదునాలుగేండ్లక్రితము కీర్తిశేషులైన ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రులవారు ఆంధ్రవ్యాసభారతనవనీతమను పేర సంస్కృతభారతమును తెనిగించియుండిరి. కవిత్రయమువారు పెంచినపట్టులను కుంచించియు, వారు సంక్షేపపఱచిన భాగములను విస్తరించియు, వారు త్యజించిన భాగములను చేర్చియు పదమూడు పర్వములను ముగించిరి. అవి అముద్రితములు. అందాది పర్వమునుండి యయాతిచరిత్ర మనునీఘట్టమును వావిళ్ళవారు ప్రకటించిరి. ఆంధ్రవ్యాసులవారి కవితావిధానము తెలియుటకీ ప్రకటితకథాభాగ ముపకరింపగలదు, పరమార్థబుద్ధి, భాషాభిమానముగల ఉదారచరితులు ఈ భారతమునందలి అముద్రితకథాభాగములను యిట్లు ప్రకటించుటకు శ్రీశాస్త్రులవారి పుత్రులు ఆయాభాగములను ఒసంగుటకు పూనియుండుట లెస్స. వలయువారు ఆకుండి వెంకటశాస్త్రిగారు, శ్రీవ్యాసనికేతనము, ఆర్యాపురం, రాజమండ్రిఅని వ్రాయునది.

**విచారసంగ్రహము:—**

'భగవాన్ శ్రీరమణమహర్షులవారు క్రీ. శ. 1901-2లో తమచరణారవిందములశరణుజొందిన బ్రాహ్మణోత్తముడగు గంభీరం శేషయ్యగారను భక్తశేఖరునికి ఆకాలమున మౌనముననుండియు కరుణచే వ్రాతమూలమున ననుగ్రహించిన ఉపదేశవాక్యములు' ఈగ్రంథమున చేర్చబడినవి. శ్రీనటనానందస్వామివారు ద్రావిడభాషయందు రచియించిన ఈగ్రంథమును ప్రణవానందమను భక్తుడు ఆంధ్రీకరించెను. కర్మ, భక్తి, యోగ, జ్ఞానములను నాల్గుమార్గములసారము చేర్చబడినగ్రంథమగుట ఇదిముముక్షువులకు ఆదరణీయమైనది. క్రౌనుసైజున 44 పుటలు. వెల 0—2—0. గ్రంథమున శ్రీరమణమహర్షులవారి ఛాయాచిత్రముగలదు. చిరునామా: శ్రీరమణాశ్రమపుస్తకాలయము, తిరువణ్ణామలై.

**భగ్నమనోరథము:—**

"True Love does never run Smooth" అనుసత్యమును ప్రదర్శించు చక్కనిచిన్నకథ. రచయిత నన్నబాలకృష్ణారావుగారు. ఈచిన్నగ్రంథము గ్రంథకర్తగారి ప్రియజనకులకు అంకితమీయబడినది. ఇదిగ్రంథకర్తగారి తొలిప్రయత్నమైనను వారిభావివికాసమును చూపింప జాలియున్నది. సుజాతనుండి పునర్ముద్రితము. క్రౌనుసైజున 16 పుటలు. వెల 0—2—0 అణాలు. చిరునామా: నన్న బాలకృష్ణారావు, బట్టలువ్యాపారము, మెయిన్ రోడ్డు, కాకినాడ. ఆంధ్రాపేపరుమిల్లుకాకితముమీద ముద్రితము. యువకుడగు ఈగ్రంథకర్తకు భావియభ్యుదయము కలుగుగాకయని కోరెదము.

**బ్రాహ్మణగీత:—**

ప్రణేత పండిత బులుసు రామజోగరావుగారు. వ్యాయామప్రవీణులు వాఙ్మయప్రవీణులై భాషాయోషను రంజింపజేయుచున్నారు. శ్రీమతి చంగల్వ రుక్మిణమ్మగారీగ్రంథమును కృతినందినారు. పురుషరచితములగుగ్రంథములను గృతినందిన స్త్రీలు ఇకనెవరైనను న్నారో లేక ఇదిక్రొత్తయనుష్ఠానమో తెలియదు. గ్రంథమున శ్రీమతిగారి ఛాయాచిత్రము చేర్చబడినది. గ్రంథవిషయము కాగితమునకుఒకతట్టుననే ముద్రింపబడుట యొక విశేషము. సుప్రసిద్ధాంధ్రనాయకులగు వి. యల్. శాస్త్రిగారీబ్రాహ్మణగీతకు చక్కనిపీఠిక వ్రాసియున్నారు. "ఈచిన్నపొత్తమున వేదవేదాంతసారమంతయును, నుపదేశరూపమునఁ బ్రతిపాదింపఁబడియున్నది. మఱియును జీవబ్రహ్మైక్యసంధానమును, బరమాత్మస్వరూపమును, మోక్షప్రాప్తిసాధనములును దేటతెల్లముగా సముచితరీతినిఁ జూపబడియున్నవి. కవనము ప్రవాహరూపమై, నిర్దుష్టమై, సరసమై, మృదుపదమిళితమై, సర్వజనతానందదాయకమై యలరారుచున్నది." అని ఈగ్రంథముపై ఉభయభాషాప్రవీణులు, ఆంధ్రపండితులు బులుసు నరసింహశాస్త్రిగారు సముచితమగు అభిప్రాయమిచ్చియున్నారు. రాధాకృష్ణపండితుని ప్రశంస నందిన ఈగ్రంథమునుగూర్చి విశేషముగ వ్రాయవలసినపనిలేదు. చిన్నసైజు, చక్కనికాలికోబైండు. 32 పుటలు. గ్లేజుకాగితములు. వెల 0—8—0 అణాలు. నోబిలుబహుమానమందవలయునను శ్రీరామజోగరావుగారి ఆశయము అచిరకాలముననే నెఱవేరి ఆంధ్రకీర్తి ఖండాంతరవ్యాపనమందుగాకయని మనఃపూర్వకముగ కోరెదము.

**వివేకచూడామణి:—**

ఇందు దృగ్దృశ్యవివేకముగలదు. శ్రీరమణమహర్షి విరచిత ద్రావిడవచనమునకు ప్రణవానందాంధ్రీకృతము. వేదాంతియగుగురువు జిజ్ఞాసగలశిష్యునకు ఉపదేశించురీతిని గ్రంథమంతయు వ్రాయబడియున్నది. ముముక్షుజనులకు ప్రియముగానుండును. చిన్నసైజు 130 పుటలు. వెల 0-4-0. చిరునామా: శ్రీరమణాశ్రమపుస్తకాలయము, తిరువణ్ణామలై.

**పద్యములు:—**

చదలవాడ శ్రీరామకృష్ణరాజుగారిచే అప్పుడప్పుడు చెప్పబడిన పద్యములసంపుటి. విలాసముగా చెప్పబడినవి. ఏలూరునందలి గ్రంథకర్తగారికి వ్రాసి కలయువారు ఈగ్రంథప్రతులు బడయవచ్చును.

**భర్తృహరిప్రబోధము:—**

అయిదంకములనాటకము. దాసరి లక్ష్మణస్వామిచే రచింపబడినది. మైథిలుండగు హరిహరోపాధ్యాయ విరచితమగు భర్తృహరి ప్రబోధమనునాటకమునకిదియాంధ్రీకరణము. కన్యాశుల్క వరశుల్కాదిసాంఘికదురాచారములు, మతేరున్నియో ప్రాపంచికవిషయములు ప్రస్తావింపబడినవి. నీతిశృంగారముల మిశ్రమము. వాక్యములు వైరాగ్యజనకములు; పద్యములు ప్రబోధదాయకములు. 'ప్రాణనాథుపాదపద్మసేవ' మున్నగుపద్యములు స్త్రీలు కంఠస్థముచేసుకొనదగినవి. ఈచక్కనినాటకమును శ్రీగంపలగూడెము రాజావారు అచ్చువేయించినారు. డెమ్మిసైజు. 72 పుటలు. వెల 0—12—0 అణాలు. వలయువారు గ్రంథకర్తపేర పిఠాపురము వ్రాయునది.

**విజయవిలాసనాటకము:—**

విజయవిలాసప్రబంధము అతిరాస్యులగు ఆంధ్రులకెల్ల చిరపరిచితమైనదే. ఆశ్రవ్యప్రబంధమిపుడిట్లు శ్రీదాసరి లక్ష్మణస్వామిగారి ప్రజ్ఞాచమత్కారములచే దృశ్యప్రబంధమైనది. "ఈనాటకకర్తయచ్చుటచ్చట నాటకానుకూలముగఁ గథయందు మార్పులగావించి రసోచితములగు వేంకటకవిపద్యములనందుఁ బొందుపఱచి వలయుచోటులఁదనపద్యములరచించె. పండితలోకమునఁ జేరందిన విజయవిలాసము దృశ్యప్రబంధముగగూర్పబడుటవలన నిది సర్వజనాదరణీయము" కాగలదని శ్రీకోటగిరి వేంకటకృష్ణారావుగారు పీఠికలో వ్రాసినది సత్యము. డెమ్మిసైజున 118 పుటలు. వెల 0—10—0. వలయువారు గ్రంథకర్తపేర పిఠాపురము వ్రాయునది.

**శ్రీమచ్ఛంకరాచార్యచరిత్రము:—**

ఈగ్రంథసంపాదకులు శ్రీకనుపర్తి మార్కండేయశర్మగారు. కుంభకోణము, శృంగేరి, గోవర్ధనము, ద్వారక మొదలగు పీఠములందలి గురుపరంపరాక్రమము విపులముగ నిరూపితము. దీర్ఘపరిశ్రమనోర్చి ఇట్టిమత గ్రంథములను ప్రచురించుచు దేశమును భాషను అర్చించుచున్న శర్మగారిని మిక్కిలి కొనియాడుచున్నాము. డెమ్మిసైజు గ్లేజుకాగితము 48 పుటలు. చిరునామా: స్వధర్మప్రకాశిని, బృందావనం, కీలుపాకు, మద్రాసు.

**డిఫినిషన్ అఫ్ లాజిక్:—**

ఆంగ్లమున వ్రాయుబడినది. లాజిక్ నకు (తర్కము) సైకాలజీ (మనస్తత్వము) తో గలసంబంధము, తర్కముయొక్క ఉపయోగము ఇందునిరూపింపబడినవి. గ్రంథకర్త సి. ధర్మరాజు, ఏలూరు. క్రౌనుసైజున 18 పుటలు.

**శ్రీరమణగీత:—**

అన్నిమతములసారము నిందు శ్లోకరూపమునపొందింపబడినది. ఆంధ్రతాత్పర్యసహితము. బ్రహ్మసూత్రములు, ఉపనిషత్తులు, బైబిలు, కోరాను వీనియందలివేదాంత మిందు కూర్పబడినది. పారాయణకు అనువైనగ్రంథము. చిన్నసైజున మంచి అట్టబైండుతో గ్రంథము సుందరముగానున్నది. 144 పుటలు. వెల కిర్తాన్ బైండు 0-8-0. కాలికో 0-6-0. పేపరు 0-4-0. చిరునామా: శ్రీరమణాశ్రమపుస్తకాలయము, తిరువణ్ణామలై. ఇందు రమణమహర్షులవారియు, కావ్యకంఠ గణపతిశాస్త్రిగారియు ఛాయాచిత్రములు చేర్పబడినవి. శ్రీకాశీభట్ట కృష్ణరాయశాస్త్రులవారు ఈగ్రంథమునకు ప్రస్తావికరచియించియున్నారు. భగవద్గీత వంటి ఈప్రశిత గ్రంథమునకు ప్రచారబాహుళ్యము కలుగుగాకయనికోరెదము.

# పత్రికాపరిచయము

## ఆదిక్షత్రియపత్రిక:—

ఇది గాంగవంశ ఆదిక్షత్రియసంఘపక్షమున రాజమండ్రినుండి ప్రకటింపఁబడు మాసపత్రిక. సంపాదకుఁడు రాజవైద్య కోలా అప్పలనరసింహదేవు. 1921 సంవత్సరములగాయతు 1923 వరకు నడుపఁబడి ధనలోపముచే నింతవరకు ఆగిపోయి యీఅంగీరసచైత్రమాసమున పునరుద్ధృతమునందినది. ఈపత్రికకు మాస్వాగతము. సంఘమునకు చెందిన నాలుగైదువ్యాసములు ఈపత్రిక ఆసంఘీయులకు ఉపయోగకారిగా నుండగలదని తెలుపుచున్నవి. 1916 లో మనోరమపత్రికయందు ప్రకటితమై ప్రత్యేకగ్రంథరూపమున వెలువడిన చిలకమర్తి లక్ష్మీనరసింహముపంతులుగారి కనకకునక ప్రహసనము యీసంచికయందు తిరిగి ప్రకటించుటలో అర్థమావంతేనిలేదు. ఇకముందైనను సంపాదకు లిట్టివి విడనాడి క్రొత్తవ్యాసములకు స్థానమిచ్చెదరుగాక! వెనుక నీఆదిక్షత్రియపత్రిక ఒకసంచికలో, వేరొకపత్రికయందు ప్రకటింపఁబడిన ఆరవిల్లి నరసింహాచార్యులవారి పిఠాపురదుర్గమను పద్యవ్యాసమును చేకొని వ్యాసకర్తనామము కాని వ్యాసమునుగ్రహించినపత్రికనామముగాని చేర్కొనరైరి. ఇది మాత్రము క్షంతవ్యముకానిది. ఇట్టిదోషములపొంత ఇపుడైన పోక ఉచితమార్గమున పత్రికనిర్వహించుచు రాజమహేంద్రపురప్రతిష్ఠనిలుపుదురుగాక అని సంపాదకులనుగోరెదము. పునర్జన్మము నొందిన నీపత్రికకు మాఆశీస్సులు-క్రౌన్ క్వార్టో సైజున వెలువడుచున్నది. పాలుచందా రూ. 2.

## కృషీవలుడు:—

భారతదేశమున నూటికి డెబ్బదియిద్దరు వ్యవసాయమే వృత్తిగాగలవారని అర్థశాస్త్రవేత్తలు తేల్చిరి. అట్టి ప్రధానవృత్తియందుతగిలియున్న విశేషజనాభ్యుదయమునకై ప్రచురింపబడు 'కృషీవలుడు' నూతనాంధ్ర పక్షపత్రికకు మామనఃపూర్వకమగు స్వాగతముచేయుచున్నాము. వ్యవసాయము, రైతాంగము, రైతు మొదలగు తెలుగుపత్రికలు ఇపుడు ప్రచారమును విరమించియున్నవిగావున ఈపత్రిక విషయముచేతనేగాక సమయముచేతను పరణీయమైయున్నది. ఇది తణిజమీన్ రైతు మహాజనసంఘయాజమాన్యమున 1, 15 తేదీలయందు ప్రకటింపబడును. సంపాదకులు: రావుబహద్దూర్ కె. వేంకటరామానాయుడుగారు, ఎ.యం.ఎ.టి. ఏప్రియలు 15-వ తేదీని వెలువడిన తొలిసంచిక విమర్శనార్థము మాకార్యాలయమునకు బంపబడినది. ఇది తణిజమీన్ రైతుమహాజనసంఘచరిత్ర విపులముగ తొలుత వర్ణింపబడినది. ఈప్రజాహితసంస్థచేయుచున్న దేశసేవ ఆదర్శనీయముగనున్నది. కథావీథియను ఉపశీర్షికక్రింది 'కడకు కష్టమే మిగిలింది' అనుకథ ఒకకృషీవలుని దయనీయచరిత్రమును ప్రదర్శించుచు పఠనీయమైయున్నది. శ్రీగూడపల్లి రామబ్రహ్మముచౌదరిగారి 'యేరువాక' చక్కనికవిత్వముతో చిప్పిలుచున్నది. 'ఏమిటీన్యాయం!' అనువిషయమును, దానినిమాపుకొమ్మను రైతు అవగతముచేసికొనుటచే ఆత్మగౌరవమును పెంపొందించుకొనగలడు. గ్రామజీవనవిచ్ఛిత్తికికారణములు, నూతనవ్యవసాయవిధానములు, గ్రామపంచాయతులు: వ్యవసాయాభివృద్ధి, మలయాదీవులందలిపంటలు మొదలగువ్యాసములు ఈపత్రికకు యథోచితములై గ్రాలుచున్నవి. నాగలి, కొడవలి ఈపత్రికయందు పూజనందుటయు సముచితముగ నేయున్నది. స్వవిషయము ఆంగ్లమునకూడ వ్రాయబడియున్నది. దీనికి మాఆమోదమును తెలుపజాలము. క్రమమున ఈపత్రికకు తమిళమున అనుబంధము చేర్పబడునని తెలుపబడినది. ఈ తెలుగుపత్రికకు అరవములోడి సంపర్కముమునగొనివచ్చి తెలుగుతనమునకు కొంతలోటుకలిగించుటకంటె ప్రత్యేకము అరవమునకుకూడ ఇట్లే ఒకపక్షపత్రిక ప్రచురించిన బాగుండుననుకొందుము. నిండారు తెలుగుతనముతో ఈపత్రిక బహుకాలముపర్ధిల్లి తెనుగునునిలుపుటకు అనుకూలించునుగాక! పత్రికముద్రణము సుందరముగనున్నది. పాలుచందా రు. 2-0-0. ఆంధ్రరైతులు ఈపత్రికను తమను పాయరానిమిత్రముగ గ్రహించి అన్యోన్యాభివృద్ధికి పునాదులువైచుకొందురుగాక యనికోరెదము. చిరునామా: 'కృషీవలుడు' కార్యాలయము, నెం. 6, లాయర్ చిన్నతంబి మొదలివీథి, సౌకార్పేట, మద్రాసు.



అమరచింతసంస్థానాధీశ్వరి శ్రీ రాణి రాజ్యలక్ష్మీ దేవి:—

"శ్రీ రాణీగారు 4 ఏప్రిలు 1932 సోమవారము సాయంకాలము మూడుగంటలకు హైదరాబాదు రెసిడెన్సీలో తమవసతిగృహమునందు పరమపదించిరనువార్త ఆంధ్రదేశమునందలి కవి, పండితలోకమును దుఃఖార్ణవమున ముంచివైచుననుటకు సందేహము లేదు. నిజాంరాష్ట్రమునందలి ఆంధ్రసంస్థానములగు గద్వాల, ఆత్మకూరు [దీనినే అమరచింతయని వ్యవహరింతురు] వనపర్తి పేర్లనెరుగని ఆంధ్రు లరుదు. అందును ఈరాజుల యొక్క ఆదరణబొందనికవి యుండ నేరడు. ఈరాణీగారు వీరి భర్త గతించిన తరువాత రాజ్యభారమును పుత్రునకప్పగించి హైదరాబాదునందే నివాసమేర్పరచుకొనియుండిరి. ఇట్టితరిగూడ వీరెందరెందరో కవులను, పండితులను, విద్యార్థులను పోషించుచు, తనజీవితమును సార్థకమును గావించుకొనియుండిరి. వీరిపుత్రులు రెండుసంవత్సరములక్రితము మరణించినప్పటినుండియు పుత్రశోకముచే కుందుచుండిరనుటకన్నను సంస్థానము కోర్టుఆఫ్‌వార్డ్సు క్రింద చేర్చబడియుండుటచే పేదల బోషింపదగునవకాశము గొరంతబడినదనియే కృశించిపోవుచుండిరనియే దలంపవలసియున్నది. ధర్మస్వరూపిణుల కింతకన్న వేరుచింత యేముండగలదు? వీరకస్మాత్తుగా సన్నిపాతజ్వరములో నిమోనియా జోడించినద్విగుణజ్వరముచే మరణింపవలసివచ్చెను. వీరి కిప్పటికి యేబదేండ్లునిండినవి. భగవంతుడు శ్రీ రాణీగారి ఆత్మకు శాంతినొసంగుగాక!"

—కోమాండూరి వెంకటాచారి బి. ఏ.

కీ. శే. దేవరాజు సీతమ్మగారు:—

"రాష్ట్రీయాంధ్రుల యభివృద్ధికై తనశక్తిని ధారపోయుచు ఆంధ్రాభిమానవ్యాప్తికై పాటుబడుచు ఖరగపురములో వెలువడుచుండెడు 'రాష్ట్రీయాంధ్ర' మాసపత్రికకు ముఖ్యపోషకురాలుగా నున్నట్టియు; 'రాష్ట్రీయాంధ్ర' పత్రికానిర్వాహకులును, ఖరగపుర ఆంధ్రజనసంఘకార్యదర్శకులును నగా కృషిసల్పి, కీర్తిశేషులైన ఆంధ్రమహాశయుని మాతృదేవియైనట్టియు దేవరాజు సీతమ్మగారి అకాలకాలధర్మమునుగూర్చి తెలియజేయుటకెంతయు చింతిల్లుచున్నాను. వీరికుమారునకు సంఘసేవయన్నను, ఆంధ్రోద్యమమన్నను, యెంతయుత్సాహమో వీరికిని అజేనినని సంఘములన్నను, సంఘసేవయన్నను, సంఘోద్ధరణయన్నను కడుప్రీతి. కుమారునివలె తల్లి యనుటకన్న తల్లివలె కుమారుడు అనియనుట సమంజసమేమోయని తోచెడిని. రాష్ట్రీయాంధ్రపత్రికకు ముఖ్య స్త్రీప్రోత్సాహకురాలు యీపెయేయని చెప్పకతప్పదు. ప్రత్యేకముగ స్త్రీలనిమిత్తమై యొకసంచిక వెలువడజేయు సంకల్పము వీరికి మిక్కుటముగా నుండెడిది. అదేకారణమున ఈపత్రికయందు దాదాపు స్త్రీలవ్యాసములకు ప్రోత్సాహమిచ్చునట్లు ప్రయత్నించి వానిని అభివృద్ధికిదే ప్రయత్నించుచుండెడిది. కుమారుని యనంత

రము రాష్ట్రీయాంధ్రమాసపత్రికను వారిపేరుగా ఈమె నిర్వహింపదలంచెనుగాని, అచ్చట యెవరును పూనుకొనకపోవుటచే యుద్దేశము నెఱవేఱకపోయెను. ఆధునికకవుల ప్రబంధములు, కావ్యములు బాగుగాపరిశీలించి అప్పుడప్పుడు ఆయాకవుల విరచితములగూర్చి విమర్శించుటలో వీరు మంచియుత్సాహము చూపువారు. ఈమె బహునిరాడంబరజీవి. కుమారునిద్వారా తనయభీష్టమగు రాష్ట్రీయాంధ్రోద్యమముయొక్క వ్యాప్తిని కొంతవరకు సాగించినటులో సందియములేదు. వీరికి ఆంధ్రమందును, సంస్కృతమందును తగుపరిచయము గలిగి అప్పుడప్పుడు చిన్నచిన్న పద్యములు సహితము చెప్పగలిగెడువారు. మచ్చుపద్యములు సంగ్రహింపజాలక పోయినందుకు విచారించుచున్నాను. శ్రీవైష్ణవమతస్థులయ్యు అన్యమతద్వేషమిసుమంతయులేదు. ద్రావిడవేదము క్షుణ్ణముగా చదువను, వ్రాయను నేర్చియుండిరి. వీరిభర్తయగు కీర్తిశేషులైన మ-రా-రా-శ్రీ దేవరాజు కృష్ణారావుగారు పార్వతీపురం సమీపమునగల సంగమువలసజమీందారీవారిక్రింద కొలదికాలము పనిచేసి సుమారు 10 సంవత్సరములక్రిందటనే కాలధర్మమునొందిరి. సీతమ్మగారు 15-3-32 తేదీని స్వగృహమందు మృత్యుంజయనగరమను గ్రామమున పరమపదప్రాప్తిఁజెందిరని తెలియజేయుటకెంతయు విచారించుచు వారియాత్మకు పరమేశ్వరుడు శాంతిచేకూర్చుగాకయనియాశించుచు, యిందుమూలముగా వారి బంధుమిత్రాదులకు నాహృదయపూర్వకసానుభూతిని తెలియజేయుచున్నాను."—కాంచనపల్లి వేంకటరంగారావు.

గంగపాయలకూర :—

"గంగపాయలకూరను సన్నపాయల, పుల్లపాయలయనియు, సంస్కృతములో ఘోటికా, లోనికా యనియు ఇంగ్లీషులో స్పైనాక్ (Spnaech) అనియు అందురు. ఇది త్రిదోషహారమైనది; సంగ్రహిణీ, మూత్రవ్యాధులను జయించును; రక్తమును శుభ్రపరచును; వీర్యపుష్టిజేయును; వెండ్రుకలకు బలమిచ్చును. పైత్యవికారములను, రక్తపైత్యమును నణచును. ఇత్యాది ఉత్తమగుణములు వస్తుగుణదీపికలో వ్రాయబడినవి. ఇటీవల మద్రాసు ప్రభుత్వఆహారపరిశోధకులు పాయలకూరను పరిశీలించి దీనిలో పాలు, వెన్నకన్న చాల ఎక్కువగ, ఎ. బి వైటమినులు ఉన్నవనియు, ఆకారణముచే పాలు, వెన్నకంటె యిది ఎక్కువ జీవశక్తిని ఇవ్వగలదనియు, వీలయినంతవరకు పచ్చికూర తినుటకు నేర్చుకొనవలెననియు తెలియజేసినారు. ఇక బయోకెమిస్ట్రిప్రకారము విచారించిన దీనియందు కావలసినంత (సున్నము) ఇనుము, సిలికక, ప్లోరిక ఉన్నవి. ఈద్రవ్యగుణములబట్టి విచారింప ఎముకపుష్టి, కండరపుష్టి, జీవశక్తి దీనివలన యభివృద్ధినొందునని స్పష్టమగుచున్నది. మఱియు రక్తములోని ఆమ్లగుణము తొలగించి రక్తమును శుభ్రపరచును. దంతములను, వెండ్రుకలను గట్టిపరచును. కండరములను మృదులపరచును. రోగనిరోధకశక్తిని వృద్ధినొందించును. శరీరమునకు అందమును, కాంతిని కలుగజేయును. యూరప్ అమెరికా ఖండములలో ఈకూర చాల హెచ్చుగా వాడబడుచున్నది. పచ్చికూరనే వాడుట ఆచారమగుచున్నది. మనము దీనిని పులుసుకూర, పప్పుకూరగా వాడుకొనవచ్చును. బహుశా చాలమంది ఈకూరను ఎరుగరనియే చెప్పవచ్చును. పూర్వము పల్లెగ్రామములయందు ఆకుకూరలు ముఖ్యముగ వాడబడుచుండెడివి. వీనినిప్పుడు అందరు మరచినారు. ఆకుకూరలలో పాయలకూరతోబాటు పుదీనా, పులిచెంచలి, బచ్చలి, చుక్కకూర, తోటకూర, పొన్నగంటి, బలుసుకూర, పిండికొండఆకు, బొద్దికూర మొదలయినవి వాడుట అందరు నేర్చుకొనవలెను. గంగపాయలకూర ఎఱ్ఱనికాడలు కలిగి గజ్జేరువలె నేలపాఁకును. కాడలు, ఆకులు మందముగ మృదువుగ నుండును. ఇది పసుపుపచ్చని పువ్వులు పూయును. ఆకు కొంచెముపుల్లగనుండును. ఇది చాల సులభముగ పెరుగును. దీనిని పచ్చిదితినదలచుచో ఆకు కాడలను సన్నగతరిగి కొబ్బరితురుము, పచ్చిపెసరపప్పుతో కలిపి చిటికెడుఉప్పు చేర్చిగాని, చేర్చకగాని-తినవచ్చును. దీనిని అందరు పెరడులలో పెంచుకొని విరివిగా ఉపయోగించకోరెదను." —ధర్మసాధని.

నిరుద్యోగమున నున్న రాజులు:—

"అధికారము పోయినది. కాని ఒక్కరుకూడ డబ్బుకు చిక్కుపడుటలేదు. రాజ్యాధికారము తొలగుటచే వారికి రాజలాంఛనములు, దుస్తులు పోయినవి. అంతే ఉద్యోగపదభ్రష్టులైన ఈరాజులసంగతి చూడుడు. జార్జి: పదవినిగోల్పోయిన గ్రీకురాజు. సంఘమున విలాసముగ తిరుగుట అతని ఇప్పటివృత్తి. అతని నివాసము లండనులోను, ప్యారిసులోను—మానియోల్: పదవిని గోల్పోయిన పోర్చుగల్ రాజు. నెమ్మదియైన సంఘజీవనము అతనివృత్తి, ట్వికెన్హామున అతని నివాసము—ఫెర్డినాండు: పదవినిగోల్పోయిన బల్గేరియా జారు. వాటుపురుగులనుంచుటయే అతనివృత్తి. నివాసము కోబర్గున. సొంతధనము 19,00,000 లక్షలపౌనులు. విలియము: పదవినిగోల్పోయిన జర్మనుకెయిజరు. ఇరువదియొకరముల వైశాల్యముగల ఎస్టేటునరాజుగా ఉండుట వృత్తి. డూర్నులో నివాసము. సొంతధనము 12,000,000 పౌనులు (16 కోట్ల రూపాయిలపై చిల్లర.)"

—*Daily Herald.*

నోబిలు బహుమానములు:—

"సారస్వతము, శాస్త్రము, అంతర్జాతీయశాంతి అనువానియందు ప్రపంచమున అగ్రసరులగు వారిని ఏటేటసత్కరింప ప్రారంభింపబడిన నోబిలు బహుమానములకై అవి పుట్టినప్పటినుండి 1,027,778 పౌనులు ఇప్పటివఱకు వెచ్చపెట్టబడెను. ఈబహుమానములలో పెక్కులు వరుసగా ఫ్రాంసు, ఇంగ్లాండు, జర్మనీ, అమెరికాసంయుక్తరాష్ట్రములు, స్వీడనులకు చెందినవి. ఇంతవఱకు 135 బహుమానము లీయబడినవి. 1923లో 6, 33 పౌనులుఉండిన బహుమానము 1931లో 9, 611 వఱకు ఒక్కొక్కబహుమానము పెరిగినది. నిరుడు ఇచ్చిన బహుమానములే ఇంతవఱకుఇచ్చిన వానిలో హెచ్చుమొత్తపువి."

—*News Chronicle.*

సప్తమ ఎడ్వర్డుతో నృత్యమాడిన కన్య:—

"లండను, సప్తమఎడ్వర్డు సార్వభౌమునితో నృత్యమాడినస్త్రీ తన 94–వయేట మృతినొందెను. ఈయమ చాల లోభిత్వముగా ధనమును కుర్చీలలోను, మంచములలోను, పరుపులలోను దాచియుంచెను. ఇల్లు ఊడ్చుటకయినను ఒప్పుకొనలేదు. గత 25 సంవత్సరములనుండి కాఫీ, గంజిమాత్రమే త్రాగుచు భోజనమును నిరసించెను. ఆమె చనిపోవునపుడు వారసులెవ్వరునూలేక దాదాపు 15 కోట్లరూపాయలను విడిచిపోయెను. బహుశా యిది గవర్నమెంటుకు జెందుచేసెనోయని అనుకొనుచున్నారట."

—బర్మా పత్రిక.

శ్రీ వానుదాసస్వామి వారి యుపన్యాస సంగ్రహము:—

"తల్లులారా! నేను స్త్రీజనపక్షపాతినని అందరును దలచుచున్నారు. ఈవాదు నాకు వచ్చినపుడు నాకీర్తిగాని అపకీర్తిగాని మీమీద ఆధారపడియుండును. మీరు నాతల్లులు గనుక బిడ్డవలె నన్నియుజెప్పుచున్నాను. మీరెంతబాగుగా నడచుకొనుచుండిన అంతకీర్తి నాకువచ్చును. కాబట్టి జాగ్రత్తగానడచుకొనవలెను. స్త్రీకి గతి పతియని శాస్త్రములు చాటుచున్నవి. పతికంటె దైవములేదు. రామునిదలవుమని చెప్పుచున్నారే భర్తయుండిన దైవమెందు కనెదరేమో! భర్త దగ్గరనున్నప్పుడు ఆయనయే భగవంతుడని కొలువుడు. దైవము దగ్గరనున్నపుడు ఆయనయే పతియని తలపవలయును. మీరేవిధము చేతనైనను కామకార్యముల దలపెట్టరాదు. భర్త గ్రామములో లేనిరోజుల బ్రహ్మచర్యము నాచరింపవలయును. తలదువ్వరాదు. పూలుపెట్టరాదు. క్రొత్తది అందమైనచీర ధరింపరాదు. నేలబరుండవలయును. పరపురుషులతో సంభాషింపక భర్తనే దలచుచుండవలెను. కామోద్రేకపదార్థములను, పనులను, ఆలోచనలను వదలవలయును. సాత్త్వికాహారమునే భుజించవలెను. భర్త కిష్టమైన యాహారములను వర్జించవలెను. ఇంకను యెన్నియోగలవు. విధవలకును ఇదియేపద్ధతి. వారు భర్తలను

పోగొట్టుకొన్నామనుకొనుచున్నారు. భర్తయొక్క దేహము పోయినదిగాని ఆత్మయెచ్చటకును బోలేదు. భార్యాభర్తసంబంధము ఒకజన్మముతో బోవునదిగాదు. ముక్తి బొందువరకు వీరిద్దరికి సంబంధముగలదు. తల్లిదండ్రులు, అన్నదమ్ములు మొదలగువారు మారవచ్చును. వారు ఋణసంబంధులు కాని భార్యాభర్తలు ఏజన్మములలోను మారరు. మీభర్త పోయినాడనిన దూరమైన దేశమునకు పోయిన ఎట్లో అట్లే యింకొక లోకమునకు పోయినాడు. అతడు మరల వచ్చువరకు (అనగా ముందుజన్మవరకు) మీరు పైజెప్పిన చొప్పున బ్రహ్మచర్యమును ఆచరింపవలయును. విధవకును, బ్రహ్మచారికిని, సన్యాసికిని నియమము లొక్కటే. ఆవిధముగా విధవచరించినచో ఉత్తమజన్మను బొందగలదు. ఈవిధవాత్వమునకు కారణమేమో తెలియునా? పూర్వజన్మమునందైన సరియైన భక్తిగలిగి పతిని భగవంతుని సేవించిన మీరు యిందుజన్మమునందైనను ఉత్తమస్థితికి రాగలరు. విధురులవిషయముకూడ నింతే. వారుకూడా బ్రహ్మచర్య మాచరింపవలెను. మీరెంత శ్రద్ధాభక్తులతో సేవించిన అంతఫలముగలదు. మీలోకొందరు సంతానము (ముఖ్యముగా పుత్రులు) లేరని యేడ్చుచుందురు. సంతానమునకై తపింపవలదు. ఎవరైతే తమ్మభక్తితో సేవింతురో వారియందరికిని ముక్తిస్థానమునివ్వ దేవుడు కంకణముగట్టుకొనియుండగా మీరు ఒకపున్నామనరకమున్నదని పుత్రునికై తపింపనేల? భగవంతుని సేవించిననే సకలనరకములు తొలగును. అపుత్రుడైనను ఎట్టివాడుగా నుండవలెను? సత్యము, అహింసావ్రతము మొదలగుమంచిగుణములుగల పుత్రుడైననే వాడువిడుచునీళ్లు, పిండములు పితరులకు జెందును. కాని లేకున్నవారికి నరకప్రాప్తియే. ఇప్పుడు కలుగుసంతానములో లక్షకొకడైన అటువంటి సత్పుత్రుడు గలడా? లేడు. దానికొఱకు మీరు తపింపనేల? పుట్టినసరే. లేకున్న తపింపవలదు. సత్పుత్రులుపుట్టుటకు కారణముమీరే. మీరు సదాలోచనలు కలిగియుండిన లోనిపిండము సదాచారముగలవాడగును. లేకున్న దుష్టుడగును కాబట్టి మీరు భగవంతుని ఆశ్రయించి ముక్తిబొందుడు. మీభర్తలను ఉద్ధరింపుడు. స్త్రీకి కావలసినది ముఖ్యముగ భక్తి. భక్తివలననే ముక్తిబొందవచ్చును. భక్తిఅనగా ప్రేమ. ఆప్రేమరసము పురుషులవద్దకంటె మీవద్ద ఎక్కువగాగలదు. దానిని భగవంతునిపై నుపయోగింపుడు. నిర్వంచనభక్తి యుండవలెనుగాని కపటభక్తియుండరాదు. ఒకగ్రామములో ఇద్దరు (దంపతులు) గలరు. ఒకరోజున భార్య కాళికా అమ్మవారిదగ్గరకు వెళ్లి "నాకు బిడ్డపుట్టిన పుట్టెడుజొన్నలు మొక్కుచెల్లింతు" ననెను. మ్రొక్కి రాగానే భర్త "ఏమే మనము బీదవారమైతిమే పుట్టెడుజొన్నలెట్లు యివ్వగలవు? మన శక్తికితగినట్లు మ్రొక్కవలెను, గాని చెల్లించలేని మ్రొక్కులు మ్రొక్కకొందు" కనెను. అంత ఆమె అమ్మవారు చూడకుండ చేయి అడ్డముపెట్టి నాలుకతో "పట్టిదే" అను భావమును గనుపరచెను. అంత కాళికా అమ్మవారుకూడ యీభార్య చూడకుండునట్లు "ఫలముకూడపట్టిదే" అను అర్థమిచ్చునట్లు నాలుక అల్లలాడించెను. తల్లులారా! మీరట్లుచేయక త్రికరణశుద్ధిగా నిర్వంచనముగా భక్తితో సేయుడు. భగవంతునినమ్ముడు. ముక్తిగలదు. మువ్వాటికి జెప్పుచున్నాను. భక్తికన్న తరణోపాయ మింకొకటిలేదు."

—ఆంధ్రపత్రిక.

## ప్రత్యేకాంధ్ర రాష్ట్రము:—

"స్వరాజ్యోద్యమసందర్భములో సింధు, ఒరిస్సారాష్ట్రముల ప్రత్యేకనిర్మాణావశ్యకత గుర్తింపబడెను. రౌండుటేబిల్ సభలోగూడ నది చర్చింపబడెను. ఆసభయొక్క చరమదశలో నాంధ్రులకు చురుకుపుట్టెను. మదరాసులో నొకసభజేసి యచ్చటి యాంధ్రనాయకు లేదోయొకమాదిరిగా రాయలసీమవారితో రాజీపడి, తమిళులకు నష్టములేనిరీతి నొకతీర్మానము చేసినామని రౌండుటేబిల్ సభాప్రతినిధులకంపిరి. కాని నాగపల్లి నగమై పెండ్లివారిరపరింటికి వారు వెళ్లుసమయమున, సదస్యమునాటికిరావలసిన యాచకుడువచ్చి తనకు సంభావనయొసంగుమని వేడుచందమయ్యెను."

—డి. భారతీదేవి. (ఆంధ్రపత్రిక.)




**"మనవారు పట్టిన చేపలనే తినుడు":—**

బ్రిటీషు పార్లమెంటుసభ్యులును, స్కాట్లాండు అండర్ సెక్రటరీయునగు ఎ. యస్. స్కెల్టన్‌గారు లండనులోనిఫోరమ్క్లబ్బులో మాట్లాడుచు "బ్రిటీషువరకులనే కొనవలయునను జాతీయభావప్రేరితులెల్లరును మనవారు పట్టినచేపలనే తినుటకు యత్నింపవలయును. మనవారుపట్టినది వారమునకు ఒక్కచేపనైన తినువ్రతమును ఈదేశమునందలి ప్రతివ్యక్తియు పట్టవలయును"అని చెప్పిరి. చూచితిరా? ఆంగ్లేయుల దేశాభిమానము. ఇప్పుడచట నార్వే దేశమునుండి వచ్చుచేపలపై నూటికి ఇరువదిరూపాయలచొప్పున పన్ను విధించిరి. వానిని తమదేశమునకు అసలేరాకుండగ చేయువలయునను ప్రయత్నములును సాగుచున్నవి. స్వాయత్తమైన దేశము. సాగుటలో ఆశ్చర్యమేమి?

**కింగ్డమ్‌వార్డునతి సాహసము:—**

1930-లో లండనునందలి భూగోళశాస్త్రవేత్తయగు కాప్టెన్ కింగ్డమ్‌వార్డును, జంతుశాస్త్రవేత్తయగు ఎర్ల్ ఆఫ్ క్రాన్‌బ్రూక్కును అప్పరుబర్మా అడవులలో శాస్త్రపరిశోధనకొఱకు సంచరించుచుండిరి. అప్పు డొకసారి వార్డునకు జ్వరమువచ్చెను. ఇంతవఱకు తెల్లవాని పాదములచే తొక్కబడని ఆప్రదేశమున జ్వరగ్రస్తుడై వార్డు పడియుండినవార్త లండనులో అతనిసతికి తెలిసెను. వెంటనే ఆమె లండనునుండి విమానముపై ఆప్రదేశమునకువచ్చి వ్రాలెను. లండనునుండి బర్మాకు ఎగిరివచ్చినస్త్రీలలో ఈమెయె ప్రథమురాలు. శాస్త్రపరిశోధనయందలి వార్డు దీక్షాపరత్వమును, శాస్త్రపరిశోధకుడగు మగని ఆరోగ్యమునందలి వార్డుసతిశ్రద్ధయు కొనియాడదగియున్నవి. ఇట్టి ఉత్తమపత్ని ఉండిననే వార్డువంటి లోకోత్తర పరిశోధకుల ఘనకార్యములు ఫలోదయాంతమగును.

**ఒన్నిసు ఆడనేల? వద్దనంపరాదా?:—**

సింహళద్వీపమునందలి కురన్‌విటాకోరేల్‌నందలి పదపట్టుగణసభలో ఉపన్యసించుచు శ్రీ యస్. సి. పాల్‌అను వారిట్లుచెప్పిరి: "మిల్లుబియ్యము అనారోగ్యకరమైనవి, దంపుడు

భివృద్ధికి వ్యాయామము బలవర్ధకమైనవి అని అందఱికి తెలియును. కాని మనస్త్రీలు టెన్నిసు ఆడుట యందు చూపుచున్న ఉత్సాహము వడ్లుదంచుటయందు చూపజాలకున్నారు. టెన్నిసు ఆట గౌరవప్రదము. వడ్లుదంచుట హీనకార్యముఅను ఈభావము మారిపోవలెను. ప్రతిస్త్రీల క్లబ్బునందును టెన్నిసుకోర్టులకుబదులు వడ్లుదంచుటకు ఏర్పాట్లుచేయబడుగాక! ఇందు నేర్పరితనమును ప్రదర్శించువారికి బహుమతులీయబడుగాక!" పాల్ గారి ఈవాక్యములు వినుటతోడనే పలువురు స్త్రీలు పరిహసింతురని మాకు తెలియును. అయినను నిదానించు వారికి ఈవాక్యములు ఎంత వివేకసహితములో, ఎంత అవశ్యాచరణీయములో తెలిసి వచ్చును. భారతస్త్రీలకు రోమ్ముసరోకలి, చేత రాటముఉండినంతకాలము ఆరోగ్యము, ఐశ్వర్యముఉండినవి. ఇప్పుడు వారికి రోకలి, రాటములేవు—ఆరోగ్యమును, ఐశ్వర్యమును లేకుండపోయినవి.

శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారి సంఘసంస్కారము:—

'హిందూసుందరి' పత్రికాసంపాదకురాలు, విద్యార్థినీసమాజనిర్వాహకురాలు అయి కాకినాడ స్త్రీయుద్యమమునకు ప్రాపై యున్న శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారినామము ఆంధ్రదేశమున పలువురకు తెలిసినదే. పత్రికలోని వ్యాసములమూలముగను, ఉపన్యాసముల మూలమునను వారు సంఘసంస్కారప్రియులనుట ఎఱుంగనై యుండెను. ఆఎఱుక ఇపుడు ఆమె చేతలచే సునిశ్చితమయ్యెను. శ్రీమతిగారు 20–3–32 తేదీని తమ యేకమాత్ర పుత్రికయగు శ్రీమహాలక్ష్మీసుందరిగారికి 18 యేండ్లు నిండారగా రజస్వలానంతరవివాహము గావించిరి. చెప్పినట్లుచేయుగల ఇట్టి స్త్రీరత్నములు తెనుగుదేశమునకు కీర్తినిగొనిరాగలవారు. వధువు శ్రీమహాలక్ష్మీసుందరి విద్యాసుందరి. హిందీలో రాష్ట్రభాషాపరీక్షలోను; సంస్కృతము, హిందీ, ఇంగ్లీషుభాషలలో, కాశీవిశ్వవిద్యాలయపు మెట్రిక్యులేషను పరీక్షలోను ను త్తీర్ణయైనది. ఇట్లు విద్యనార్జించుటచేతను, రజస్వలానంతరవివాహము గావించుకొనుట చేతను నేటి ఆంధ్రయువతులలో భిన్నయైన ఈయువతిజీవితము శుభపరంపరలతో ప్రకాశ మానమగునుగాకయని కోరెదము. పుత్రిక నింతటిగణ్యస్థానమునకుగొనివచ్చిన శ్రీ శేషమ్మ గారికి మాఅభివాదములు.

శ్రీ అద్దంకి బిందుమాధవరావుగారి ఆంధ్రస్త్రీజనసేవ:—

నరసాపురముతాలుకాభివృద్ధిసంఘమువారు ఆంధ్రస్త్రీజనాభివృద్ధికై చిరకాలముగ చేయుచున్నకృషి వెలకట్టరానిదిగనున్నది. తెలుగుదేశమునందలి సకలమైన ఉద్యమములకు జవమునొసంగుటలో బద్ధకంకణులైన శ్రీపిఠాపురముమహారాజావారు ఈసంస్థకు వేయి న్నూటపదహారులు మూలధనముగనిచ్చియున్నారు. ఏటేట ఆంధ్రస్త్రీలకు పరీక్షలుజరుపుచు ఈసంస్థ ఆంధ్రస్త్రీలగృహవిశ్వవిద్యాలయముగా నుండుచున్నది. ఈఉత్తమసంస్థకు శ్రీ అద్దంకి బిందుమాధవరావుగారు ప్రాణమువంటివారు. వారిప్రజ్ఞవలన, దీక్షవలన ఈసంస్థ

1901-వ సంవత్సరమునుండి అవ్యాహతముగ సాగుచున్నది, స్వంతభవనమును సంపాదించుకొన్నది, నరసాపురమున ఒకపుస్తకభాండాగారమును నిర్వహించుచున్నది, పఠనమందిరమును నడుపుచున్నది. ఇంతకును బిందుమాధవరావుగారు నిరాడంబరులు. చేయుసేవయంతయు నిష్కామమైనది. తెలుగుదేశమునందలి ప్రతిఒక్కతాలూకాయు ఇట్టి నిష్కామసేవకునకు నిరాడంబరుని స్త్రీయుద్యమమునకు నోచిపుట్టునేని ఆంధ్రస్త్రీజనాభివృద్ధి వేయిమడుంగుల హెచ్చరిల్లియుండును. ఇపుడైన బిందుమాధవరావుగారు చూపిన ఆదర్శబీజము పలుతావుల మొలకలెత్తి దేశకల్యాణమునకు తోడ్పడగలుగునట్లు పరమేశ్వరు డనుగ్రహించుగాక యని కోరెదము.

సత్యాగ్రహి కేరు నిశ్చయము:—

బి. జి. కేరు అనువాడు ఆర్డినెన్సులసందర్భమున రెండుసంవత్సరములశిక్ష ననుభవించుచుండెను. కేరుతండ్రి పండుముదుసలి. తన ఒక్కకుమారుడును జయిలుకుపోయియున్నాడు. ఇక ఆవృద్ధుడు ప్రాణములను చిక్కబట్టలేకపోయెను. చావుబ్రతుకులమీదనున్న ఆముదుసలిని తుదిసారిచూచి సపర్యలుగావించి పితౄణమీగికొనుటకు కేరు తహతహలాడెను. కాని ప్రభుత్వమువారు తానికఎప్పుడును సత్యాగ్రహోద్యమమున పాల్గొనని నమ్మకపత్రమువ్రాసియిచ్చినగాని అతనిని తండ్రినిచూచివచ్చుటకు అనుజ్ఞనీయమనిరి. ఫ్రీప్రెసు జర్నలుప్రచురించిన ఈవార్తపై ఇండియను సోషలురిఫార్మరుపత్రిక ఇట్లు అభిప్రాయమిచ్చినది: "ఇంగ్లండునందు రాజకీయనేరస్థులను పెరోలుమీద విడుదలచేయుటకలదు. తనతండ్రినిచూచుటకుపోవుఅవకాశమును రాజకీయములకు ఉపయోగింపకుండుకరారును అడుగుచో కేరు ఆనందపూర్వకముగ ఇచ్చియుండువాడు. కాని గవర్నమెంటువారు వేరుకోరికకోరిరి. కేరు దానికి అంగీకరింపలేదు. అతనితండ్రి తన ఏకమాత్రపుత్రునిచూడకుండగనే చనిపోయెను. సత్యాగ్రహులతత్త్వమును ప్రభుత్వమువారు అర్థముచేసికొనలేదు. కేరుచేసినకృత్యము సత్యాగ్రహినిశ్చయము కుటుంబవ్యక్తులయందలిప్రేమచే కరగిపోదనుట వెల్లడిచేసినది."

శ్రీ స్టీఫెన్సను దొరసాని తుదికృత్యము:—

శ్రీ స్టీఫెన్సనుదొరసాని భారతదేశతీరమునుండినిర్గమించుటకు పూర్వముచేసిన తుదికృత్యము పాట్నయందు లేడీస్టీఫెన్సను స్త్రీలమందిరమునకు పునాదిరాయివైచుట. ఆదొరసానివారి ప్రోత్సాహముననుసరించి ఈమందిరనిర్మాణమునకుగాను 51, 168 రూపాయిలు చందాలువేయబడినవి. ఈమందిరము నిర్మింపబడుటకును, నిర్వహింపబడుటకును ఆధనము చాలియుండునని అంచనావేయబడినది. ఇట్టిమందిరమునుప్రసాదించుటవలన ఆరాష్ట్రమువారు ఈదొరసానిని చిరకాలము కృతజ్ఞతాపూర్వకముగ స్మరించుచుండగలరనుట నిక్కము.

# ౧౯౪౧

## మార్చి

19:—కావలి. కూరపాటి మంగళాంబ, భట్టారం సుందరమ్మగార్ల కేసువిచారణ.

:—లాహోరు. శ్రీ వలంటీరు రామరక్షీగారిని ఒకసంవత్సరంపాటు శాంతిపోషించుటకు రు1000జామీను లేనిచో ఒకసంవత్సరము ఖైదు అనుభవింపుమని విధించిరి.

:—శ్యామకుమారీ, జానకీకుమారీ జుట్షీగార్లపై విధింపబడిన జరిమానాల వసూలుచేయుటకై పోలీసులు ఆపిల్లలతల్లియగు రాధారాణీ జుట్షిగారియింటిని సోదాచూచి కొన్ని పెట్టెలు, మంచములు, సబ్బుపెట్టె జప్తుచేసిరి.

20:—కాకినాడలో బాలాంత్రపు సుందరరామయ్యగారి పుత్రికయగు సుందరమహాలక్ష్మమ్మకును (18 ఏండ్లు: రజస్వలానంతరము) బొండాడకాపురస్థులు కాశ్లకూరి జోగరాజుగారికుమారుడు శేషయ్య బి.ఏ. గారికిని పరిణయముజరిగెను.

21:—అలహాబాదు. విజయలక్ష్మీ పండిట్ గారి మోటారుకారును ఆమెపైవిధింపబడిన జుర్మానాకొఱకు వేలముపాడిరి.

22:—అంగలూరు. శ్రీమతులు తిపిర్నేని కౌశల్యమ్మ, వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ, గోనుగుంట్ల లక్ష్మీనరసమ్మ, కోనేరు భారతమ్మ, ఆరెకపూడి వృషామణి. ఈమాణిక్యమ్మ, ఈమహాలక్ష్మమ్మ, ఈనుగుణమణిగార్లను అరెస్టుచేసితిమనిచెప్పి కైకలూరుసబ్ జైలునందుంచిరి.

23:—నెల్లూరు. శ్రీమతులు ఓరుగంటి మహాలక్ష్మమ్మ, పాలకోడేటి శ్యామలాంబ, టి. సీతారామమ్మగార్ల (చంటిబిడ్డతో సహా) ఉత్సవసందర్భమున అరెస్టుచేయబడిరి.

:—శ్రీమతి మంత్రాల రామసీతమ్మగారిని విశాఖపట్టణమున అరెస్టుచేసిరి.

24:—రేపల్లె. వాపిరెడ్డి పార్వతమ్మ, గోళ్ళమూడి రత్నమ్మ, వట్టికుంట హనుమాయమ్మ, యలవర్తి ప్రసూనాంబ, కోనేరు మంగమ్మ, కస్నెగంటి దుర్గాబాయమ్మగారికి 6 నెలలు కఠినశిక్ష, సి. క్లాసు.

25:—కాశీలో. హేమాంగియను 80 ఏండ్ల వృద్ధాంగన మరి ఆర్గురు స్త్రీలు అరెస్టుచేయబడిరి.

:—అలహాబాదులో రాష్ట్రీయమహిళాసభ అక్రమసంఘమని ప్రకటింపబడెను. ఆసంఘభవనములన్నియును వశపఱచుకొనబడెను.

:—లాహోరు. శ్రీమతి లజ్జావతిగారి జుల్మానా ఆమె భర్తసోదరుడగు హంసరాజుగారివద్ద వసూలు చేయబడెను.

26:—తాడేపల్లిగూడెము. 'వీరభారతి' కరపత్రములు పంచిపెట్టినందుకు శ్రీమతులు జక్కుల చిట్టెమ్మ, జక్కుల నూకరాజమ్మగార్లు అరెస్టుచేయబడిరి.

:—మాలవ్యాగారితో సంభాషించుటకు సరోజనీదేవిగారు కాశీవెళ్లిరి.

27:—కైకలూరు. గో. లక్ష్మీనరసమ్మ, కౌశల్యమ్మగార్లు ఏదోపనిమీదరాగా వారిని సబ్ జైలులోనుంచి సాయంకాలము విడుదలచేసిరి.

:—మున్షీగంజిచెరసాలలో స్థలములేనందున శిక్షాకాలము పూర్తికాకముందే చాలమందిస్త్రీలను విడుదల చేసిరి. మున్షీగంజిలో పికెటింగుచేసినందుకు పలువురుస్త్రీలను అరెస్టుచేసి వదలివేసిరి. ఇరువురుస్త్రీలకు మాత్రము 17 రోజులు శిక్షవేసిరి.

28:—నెల్లూరు. శ్రీమతులు కూరపాటి మంగళాంబ, భట్టారం సుందరమ్మ నెల్లూరుసబ్ జైలునుండి రాయవేలూరుకుమార్చిరి. శ్రీమతులు పాలకోడేటి శ్యామలాంబ, తంగిరాల సీతారామమ్మ, ఓరుగంటి మహాలక్ష్మమ్మ గార్లకేను వాయిదా పడెను.

:—టాలటోలా. కాంగ్రెసు 15వ నియంత్రి లావణ్యప్రభాదేవిగారు ఎరస్టుచేయబడిరి.

:—శ్రీమతి. సరోజనీదేవిగారు ఢిల్లీనుండి బొంబాయికివచ్చిరి.

:—బేగర్ ఘాట్ వందు శ్రీమతి సరోజగారును మరి యేడ్గురుస్త్రీలును అరెస్టుచేయబడిరి.

29:—తూత్తుకుడిలో పికెటింగుకై శ్రీమతి సుబ్బమ్మగారికి శిక్ష.

:—ఏలూరు. సబ్ జైలులోనున్న శ్రీమతులు మడుంబి వేంకటమ్మ, జవ్వాజి రాజరత్నమ్మ, మద్దుల దమయంతిగార్ల రిమాండు హెచ్చింపబడెను.

:—అహమ్మదాబాదు. విదేశపుస్త్రముల వ్యాపారుల యిండ్లకేగి విదేశవస్త్రములనిక దిగుమతి చేయమని ప్రమాణపత్రములపై సంతకము పెట్టించుకొన్నందుకై మువ్వురుస్త్రీలకు మూడేసి నెలలు శిక్ష.

:—కోమిల్లా. శ్రీమతి హేమప్రభమజుందారుగారు మఱి మువ్వురుస్త్రీలు ఎరస్టుచేయబడిరి.

30:—సూరతు. గాంధిగారిచే పెంచబడుచున్న అస్పృశ్యకన్యక శ్రీమతి లక్ష్మీబాయి, లీలావతి, లక్ష్మీదేవి గార్లకు చెరి 6 నెలలు కఠినశిక్ష.

:—రాజషాయి. గయిబందాము క్తీయూరు జతీంద్రమోహనరాయిగారి కుమార్తె కుమారీ బెలారాణీరాయి గారిని మరి యైదుగురిని శిక్షాకాలము పూర్తికాకుండగనే చెరసాలనుండి వదలిరి.

:—నవాబుగంజిలో. శ్రీమతి సాబాలాగుహాగారి జుల్మానా వసూలుచేయుటకు ఆమె భర్తపశువులను సామగ్రులను జప్తుచేసిరి.

:—లాహోరు. 25-వ డిక్టేటరు శ్రీమతి సుశీలరాణిగారికి శిక్ష.

:—మదరాసులో శ్రీమతి నాగమ్మ మూడుఏండ్లబిడ్డతో ఎరస్టుచేయబడెను.

31:—అంగలూరు. పికెటింగు చేయుచుండగా ఆరెకపూడి సుగుణమణి, ఈమహాలక్ష్మమ్మ, కన్నెగంటి నాగరత్నమ్మ, ఘంటా మల్లికాంబ, కోనేరి భారతమ్మగార్లను అరెస్టుచేసి ముదునేపల్లి, బంటుమల్లి మధ్య వేర్వేరుప్రదేశములలో వదలివేసిరి.

:—హాస్పేట. జయలక్ష్మీబాయిగారు కర్నాటకకేసరిసంపాదకులగు కేశవరావుగారి భార్యకు 6 నెలలు విడిక్షైదు రూ 150 జరిమానా. ఇవ్వనిచో 6 వారములశిక్ష. బి. తరగతి.

## ఏప్రియలు

1:—గుంటూరు. ఆంధ్రదేశనియంత్రి శ్రీమతి శ్రీపెరుంబుదూరి సుభద్రమ్మగారికి 1 సంవత్సరపు కఠినశిక్ష. బి. క్లాసు.

:—ద్విపరాలో కాంగ్రెసుసభ చేసినందుకు మల్కానగిరుజమీందారునిసోదరి లావణ్యప్రియాగుహా ఠాకుర్తా గారి అరెస్టు.

:—దయాడ్ పాట్ పురపాలకభవనముపై కాంగ్రెసు పతాకను నాటబోయినందుకు సుభాషిణీచంద్రగారును మరి మువ్వురుస్త్రీలును అరెస్టుచేయబడిరి.

2:—కోమిల్లా. అభయాశ్రమకన్యాశిక్షాలయాధికారిణి లావణ్యప్రభాచంద్ర బి. ఏ. గారికి మరి నలుగురు స్త్రీలకును 6 నెలల కఠినశైదు.

:—బొంగాలో శ్రీమతి సుభాషిణీచంద్రగారికి మరి 3 గురు స్త్రీలకు 6 నెలలుశిక్ష, రూ 100 జరిమానా. వీరు పోలీసుకోట్లపై జాతీయపతాకను పెట్టియుండిరి.

:—బ్రహ్మపురంలో హిల్లీ డిటెన్యూ సనిగోపాలబాగ్చిగారితల్లి కాళీదాసిదేవిగారు, మఱొక డిటెన్యూ సుకుంరాయిచౌదరితల్లి హేమవతీదేవిగారు, కిరణశశిదేవి, ఆశాలతాదేవి, కమలాదేవిగార్లు కాంగ్రెసుకార్యములందు పాల్గొనినందుకు వాల్గేసి నెలలు ఖైదు విధింపబడిరి.

:—ముష్షిగంజ్. మమతాయిదేవిగారికి 6 నెలలు కఠినఖైదు.

:—లాహోరు. అనర్కాళీ పికెటింగున అరెస్టుచేయబడి శిక్షనొందిన మాయాదేవిగారు అప్పీలుచేసి విడుదలపొందిరి.

2:—

3:—కొందరుకాంగ్రెసుస్త్రీలను పోలీసువారు కాశీదశాశ్వమేధఘాటావద్ద మార్చి 11 తేదీని అవమానించిరని రిపోర్టుచేయబడెను. మేజస్ట్రీటు విచారణచేయగా ఒక హెడ్‌కనిస్టేబిలుమీదను 4 గురు కనిస్టేబులుల మీద 323 సె॥ 509 సె॥ ప్రకారము నేరము ఆరోపింపబడెను. సదరు పోలీసులకు వారంట్లు జారీ చేయబడెను. సదరుపోలీసులు బర్తరఫుచేయబడిరి. కాని సదరు కాంగ్రెసు స్త్రీలు తాము కోర్టుల వెంట తిరుగుచు వారిపై ఫిర్యాదులు చేయజాలమనియు వారుచేసిన అవమానములకు వారిపై తమకెట్టి ద్వేషము, ఆగ్రహము లేదనియు మేజస్ట్రీటుకు ఉత్తరము వ్రాసిరి.

4:—శ్రీఆమరచింతిసంస్థానాధీశ్వరి రాణి రాజలక్ష్మీదేవిగారు హైదరాబాదు రెసిడెన్సీలో తమవసతి గృహమునందు పరమపదించిరి.

:—రేపల్లె. డిక్టేటరు శ్రీమతి యల్లాప్రగడ ఇందుమతమ్మగారిని భట్టిప్రోలులో ఎరస్టుచేసిరి.

:—కాశీ. హేమాంగినిదేవిగారు 80 ఏండ్ల వృద్ధురాలు 6 నెలలు కఠినశిక్ష. 31 మంది యితరస్త్రీలకు గూడ బెహరల్లియందు పికెటింగు చేసినందుకు 6 నెలలు కఠినశిక్ష విధింపబడెను.

:—అమరావతిలో. శ్రీమతి పార్వతీబాయి పట్వర్ధనగారికి 117, 302 సెక్షనుల ప్రకారము ఏడాది కఠిన శిక్ష. బి. తరగతి.

:—కాంగ్రెసువారు మహమ్మదీయుల దుకాణములవద్ద పికెటింగుచేయకుండ యేర్పాటుచేయగోరుచు మౌలానాషౌకతాలీగారు శ్రీమతి సరోజినీదేవిగారికి లేఖ వ్రాసిరి.

5:—మదరాసు. పాండురంగంసతి, రాజమ్మాళు, మఱియొక ఆంధ్రస్త్రీని ఎరస్టుచేసి రాత్రి 7-50గంటలకు వదలివేసిరి.

6:—గరికపర్రు కాపురస్తురాలు చెరుకూరి వియ్యమ్మగారు నాయకత్వము నెఱపి కొప్పల్లిగ్రామమున జాతీయ పతాకములతో గ్రామసంకీర్తనము గావించినందుకు ఎరస్టుచేయబడిరి.

:—అకోలా. వఃసనదుసతి, ప్రదాన్‌సతిగార్లు అరెస్టుచేయబడిరి.

:—నెల్లూరు. శ్రీమతి తంగిరాల సీతారామమ్మ, శ్రీమతి పాలకోడేటి శ్యామలాంబ, శ్రీమతి వోరుగంటి మహాలక్ష్మమ్మగార్లను రిమాండునుండి కోర్టుకు విచారణావసరమున నడిపించుకొనివచ్చిరి.

:—బొంబాయి. శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయ మరిపెద్దురు దేశసేవికలఅరెస్టు.

:—కటకము. శ్రీమతి మాలతీదేవిగారికి 4 నెలలు కఠినశిక్ష. శ్రీమతి వీణాపాణిదేవిగారి అరెస్టు.

:—అహమదునగరు. శ్రీమతి శాంతిబాయిఖైరుగారికి 41-వ డిక్టేటరు స్త్రీల ఉత్సవము జరిపినందుకు 9 నెలలు కఠినశిక్ష.

7:—బొంబాయి. శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయ మఱి 8 మంది స్త్రీలకును 6 నెలలు కఠినశిక్ష, రు 50 జరిమానా, చెల్లింపనిచో మఱి 6 వారముల ఖైదు.

:—మదరాసులో. పికెటింగుకై శ్రీమతిసరస్వతి, శ్రీమతిరాజంగార్ల, మఱియిరువురుస్త్రీల అరెస్టు, విడుదల.

:—లాహోరు. లండోరాణి జుట్షీకుమారీ, మనోమోహనజుట్షీ యం. ఏ; సత్యవతీకుమారి, పిండిదాసుసతి, తారాచందుసతిగార్లు ఊరేగింపు నడిపినందుకు ఎరస్టు.

:—లాహోరు. లాలా కెతూరాము అనువతనికి విధింపబడిన రు 50 లు జరిమానాపైకమును అతని భార్య యొక్క పాత్రసామగ్రిని జప్తుచేసి వసూలుచేసిరి. రిఖిదేవికి విధింపబడిన రు 25 లు జరిమానాయును ఆమె తాతవద్ద వసూలుచేయబడెను.

:—ఏలూరు. సబుజైలునుండి శ్రీమతులు ముడుంబి వేంకటమ్మ, జవ్వాజి రాజరత్నమ్మ, మద్దుల దమయంతి గార్ల విడుదల.

8:—రేపల్లెలో గడ్డిపాటి బుచ్చమ్మ, సూర్యదేవర వెంకమ్మ, సజ్జా రత్తమ్మ, తుమ్మల తులశమ్మ, యనమదల రత్తమ్మ, గడ్డిపాటి రాధాకృష్ణమ్మ, యార్లగడ్డ రత్తమ్మ, కొల్లి రాఘవమ్మ గార్లకు నలుగురు నలుగురు చొప్పున రెండుజట్టులుగా బహిష్కారకరపత్రములను పంచుచుండ ఎరస్టు, విడుదల.

:—శ్రీమతి హంసమెహతాగారు బొంబాయిలో పెరోలుమీద విడుదలచేయబడిరి.

:—బోగ్రాలో ఊరేగింపు జరిపినందుకు శశిబాలాదేవిగారు, మఱి 5 గురు అరెస్టు.

:—కలకత్తా. ఆయుధములను, మందుగుండును అక్రమముగా దేశములోనికి తెచ్చుచుండిరని అరెస్టుచేయబడిన శ్రీమతిసరోజబాలాదాసుగారును మఱి 15 మంది బంగాళీయయువకులును నిర్దోషులని విడుదలచేయబడిరి.

:—అలహాబాదులో ఊరేగింపు పోలీసులు చెదరగొట్టుసందర్భమున మోతీలాల్ నెహ్రూసతి స్వరూపరాణిగారికి బలమైన దెబ్బలు తగిలెను.

9:—రేపల్లె. నిన్న ఎరస్టుచేయబడి విడుదలచేయబడినస్త్రీలు నల్లూరున ప్రభుత్వవారిచే నిషేధింపబడిన శిబిరములలోగొనిరి. అందుపై వారు అరెస్టుచేయబడిరి.

:—బంకురాలో మహామాయాదేవిగారు మరి నల్గురుస్త్రీలు కోర్టులేచువఱకు నిర్బంధింపబడిరి.

:—నవకాలిలో శ్రీమతి కిరణప్రభాచౌదరిగారు అవసరాధికారముల ఆర్డినెన్సు 21 సెక్షన్ క్రింద, సీ. కో. 188 సెక్షను క్రింద అరెస్టుచేయబడి 1 ఏడు కఠినఖైదు, రు 500 జరిమానా; చెల్లింపనిచో మరి 6 నెలలు కఠినఖైదుపొందిరి.

:—కోమిల్లాలో బాబూ భూపేంద్రనాథగారి భార్య, బాబూ వసంతకుమారమజుందారి కూతురు జాతీయ వారోత్సవము జరుపుచుండగా ఎరస్టు.

:—నైనిటాలునుండి ప్రభుత్వమువారి ప్రకటన. "కాశీ దశాశ్వమేధఘట్టం పోలీసుస్టేషనులో మార్చి 11 తేదిని కొందరు స్త్రీవలంటీర్లను కష్టపెట్టిరను ఆరోపణపై మేజిస్ట్రేటు విచారించి చేసిననివేదన ప్రభుత్వమునకు చేరినది. విషయము తెలిసిన ఆందటినుండి మేజిస్ట్రేటు సంగతి సందర్భములను తెలిసికొనెను. 5 గురు కనిస్టేబుల్లు కొట్టి గాయపఱిచినట్లు కేసు పెట్టబడినది. కనిస్టేబుల్లు ఇపుడు సస్పెండు చేయబడియున్నారు. జిల్లా మేజిస్ట్రేటుముందు పోలీసులు విచారింపబడుదురు.

10:—

11:—విదేశపు చక్కెర బహిష్కరణ ప్రచారసందర్భమున కటకములో శ్రీమతి నిరుపమదేవి, మరి యైదుగురుస్త్రీల యరెస్టు.

:—శ్రీమతి సరోజినీదేవిగారు బొంబాయిలో స్వదేశీబజారు తెరచిరి.

:—మదరాసు. కోట హనుమంతరావు బి. యె. డి. టి. గారు (24 వత్సరములు) నేళ్ళ వారి ఆడుబడుచు శ్రీరంగనాంచారమ్మగారిని పదునైదువత్సరముల ఆర్యవైశ్యవితంతువును వివాహమాడిరి.

12:—కలకత్తా. శ్రీమతి ప్రమీలాగుప్తాకన్య బెథన్ కళాశాలలో జూనియరు బి. ఏ తరగతిలో చదువుచుండిన యువతిని బెంగాల్ క్రిమినల్ లా అమెండుమెంటు ఆక్టుక్రింద చెరసాలలో డిటెన్యూగా నుంచగా ఆమె హైకోర్టుకు అప్పీలుచేయ వారీవిషయమున మాకు అధికారములేదనిరి.

:—సూర్యసింహా కన్యఅను బెంగాలీయువతి బర్మాయందలి బెస్సీనులో న్యాయవాదవృత్తినవలంబించెను.

:—నాగపురము. స్త్రీల ఊరేగింపు. శ్రీమతి ఏ. కే. సాల్వేపతి, శ్రీమతి శాంతాబాయిగోక్లే, శ్రీమతి ఘ్యాల్ సతిగార్ల ఎరస్టు, విడుదల.

:—

13:—రత్నగిరి. కష్టా బేగ వేరుగారి (ప్లీడరు) భార్యయగు శాంతాబాయిగారికి ఆర్డినెన్సులప్రకారము 6 నెలల కఠినశిక్ష, రు 100 జరిమానా. శ్రీమతి బాగీరథీబాయి విష్ణు మంగదకారు గారికిని, లక్షణ సాధాళేల్కారుగారికిని 6 నెలలు కఠినశిక్షయును రు 25 లు జరిమానాయును విధించిరి. యమునాబాయి సదాశివ గనేంకరుగారికి 6 నెలలు కఠినశిక్షయును రు 50 లు జరిమానాయును విధింపబడెను. ఇంకొక స్త్రీ పికెటరు ముసలిదగుటచే శిక్ష వేయక విడుదలచేయబడెను.

:—ఏలూరు. జలియన్వాలాబాగుదినమును జరిపినందుకు శ్రీమతులు ముడుంబి వెంకటమ్మ, మొటపర్తి తులశమ్మగార్లు ఎరస్టుచేయబడిరి.

:—బెజవాడ. కొల్లిపర లక్ష్మీకాంతమ్మగారు; సూరపనేని అన్నపూర్ణమ్మగారు, గరికపర్రు; మైనేని రాజమ్మగారు, కొమ్మమూరు; యార్లగడ్డ రత్తమ్మగారు; వీరమాచినేని పుష్పావతిగారు, ముదునూరు; అన్నె దుర్గాంబగారు, ముదునూరు; వాదర్లి నాంచారమ్మగారు, ముదునూరు; జాతీయపతాకములను బూని జాతీయగీతములపాడుచు బట్టలబజారుగుండా వెళ్ళిరి. వారిని పోలీసువారు ఆటంకపరచి పతాకములను తీసికొని కృష్ణఆనకట్టవద్ద చీకటిపడువఱకుయుంచి ఆపైని పంపివేసిరి.

:—ఢిల్లీలో స్వామి శ్రద్ధానందుని మనుమరాలు సత్యవతి ఎరస్టు.

:—కాశీ. పండిత మదనమోహనమాలవ్యాగారి కోడలు ఊషామాలవ్యాగారు ఊరేగింపును నడపించుచుండగా ఎరెస్టు చేయబడిరి.

:—మర్షగంజ్ లో శ్రీమతి ఉషాబాలదేవిగారికి మఱొకస్త్రీకి 6 నెలలుఖైదు.

14:—తమలకులో డిక్టేటరు శ్రీమతులు ఇందుమతీ భట్టాచారి సువాసినీదేవిగార్ల కిద్దరికిని చెరిఆరునెలలు కఠినశిక్ష విధింపబడెను.

:—విశాఖపట్టణము. శ్రీమతి మంత్రాల రామసీతమ్మగారి తరువాత 5-వ జిల్లాడిక్టేటరుగా శ్రీమతి మరుంగంటి భట్టరు వేంకటరమణమ్మగారు(తెల్లాము)బొబ్బిలిలో కరపత్రములు పంచుచు నుపన్యసించినందున ఎరస్టుచేసిరి. విచారణావసరమున సబుకలెక్టరువారి యెదుట ఆమె తనను నిర్బంధించినవెంటనే కాళ్ల కడియములునగాపోలీసులు తొలగించిరని చెప్పగా వెంటనే వానినిచ్చివేయవలయునని ఆర్డరువేయబడెను. ఆమెకు 6 నెలలు శిక్ష. బి క్లాసు.

15:—పూనా. శ్రీమతి గాంధి వసతిదేవియును ఇంకను 8 మంది వలంటీర్లును జలియనువాలాబాగు సంస్మరణ దినమున ఊరేగింపులు జరిపినందులకై అరెస్టుచేయబడిరి.

16:—అహమదాబాదు. శ్రీయుత జమునాలాలు బజాజుగారి భార్య శ్రీమతి జానకీబాయిగారికి వేయబడిన 1000 రూపాయిల జుల్మానాకై వార్ధాలో బచ్చరాజజమునాలాలు కంపెనీలో మూడు ఇనుపపెట్టెలకు సీల్లువేసిరి.

:—ఎరవాడ. చెరసాలనుండి గాంధిమహాత్ముడు అలహాబాదులో జవహరలాలుసతి శ్రీమతి కమలానెహ్రూగారికి తంతినంపి శ్రీమతి స్వరూపరాణిగారి దెబ్బలవివరమును తెలియగోరెను.

:—భారతమహిళాసంఘమువారి 15- వార్షికసభ సంఘకార్యాలయమున (మదరాసు, ఎగ్మూరు, పాంథియన్ రోడ్డు) జరుపబడెను. శ్రీమతి కృష్ణాబాయమ్మగారు అధ్యక్షురాలు.

17:—రేపల్లె వాసిరెడ్డి అన్నపూర్ణమ్మ, సుఖవాసి అచ్చమ్మ, ముద్దా శేషమ్మగార్ల విడుదల.

18:—

19:—బొంబాయి ఆర్థరురోడు చెరసాలలో స్త్రీలసంఖ్య మిక్కిలి హెచ్చుగానుండుటచే శ్రీమతి కమలాదేవి చటోపాధ్యాయగారిని మరి 20 మంది స్త్రీలను బెల్గాముతీసికొనిపోయిరి.



---

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# లేడీస్ రిక్రియేషను క్లబ్, గుంటూరు



కార్యనిర్వాహక సంఘ సభ్యురాండ్రు

ఆగష్టు 1931 లో స్థాపితము. ప్రస్తుతము బ్రాడీపేటలోని శాంతి నిలయము[...] శ్రీమతి రాయస[...] రత్తమ్మ గారి అను[...]తిని ఉంచబడిన[...] కాని స్థలము చాల[...] కుంచితముగ నున్న[...] ఆటలకు అనువైన స్థల[...]ము లేదు. బాడ్మింటను, వాలీబాల్, చదరంగము, పచ్చీసు ఆటలే ప్రస్తుతము గలవు. చిన్న పుస్తక భాండాగారమును గలదు. ఈక్లబ్బు రిజిస్టరు చేయబడినది. స్థలముకొఱకు గవర్నమెంటుకు దరఖాస్తు చేయబడినది. సభ్యురాండ్రు స్వంతభవనమున క్లబ్బును సాధ్యమైనంత త్వరలో ప్రవేశపెట్టుకుతూహలపడుచున్నారు. శ్రీమతి కె. యస్. యస్. మూర్తిసతి కార్యదర్శిని, శ్రీమతి శర్మసతి కోశాధ్యక్షురాలు, శ్రీమతి కోదూరి సీతామణి భాండాగారాధిపురాలు.



గుంటూరు కలెక్టరుసతి శ్రీమతి జె. డబ్ల్యు. ప్రీస్టేసతి, ఈసంఘపు పాధ్యక్షురాలు, కొడైకెనాల్ కుపోవుసందర్భమున తీసిన ఛాయాచిత్రము.



శ్రీమతి కే. లక్ష్మీదేవమ్మకన్యగారు.
కడపనివాసులు బారిస్టరు కే. కోటిరెడ్డిగారి అన్నపుత్రిక. మదనపల్లె తాలూకా నాయునిచెర్వుపల్లె గ్రామం మజారా కోట్రెడ్డిగారిపల్లె నివాసస్థానము. విద్యావతి.



శ్రీరంగపట్టణమునందలి దేరియాదౌలత్.
(వేసవిమందిరము)
ఛాయాచిత్రగ్రాహకులు డి. అన్నాజీరావుగారు.

"ఆహా! ధనమా! మనుజులకు నీసహాయంబు లేనిచో సంతోషంబడంగును, ధైర్యము చెడును, సాహసముడివోవును, గౌరవము తగ్గిపోవును, కీర్తి దూరంబగును, నిజమార్గము మాసిపోవును, ధర్మంబు డాఁగును, కులాచారంబెడఁబాయును, ముఖపద్మంబు వాడును, దీనత్వము పెరుగును, దేవతారాధనాసక్తి తొలఁగును, బుద్ధిమందంబగును, సిగ్గు దోడ్పడును, సాధుసంగంబు విడచును, మనోవిచారంబెసంగును, అన్నపానంబులు దగ్గును, నిదుర చెడును, దేహంబుకృశించును, బంధుమిత్రులకడకుఁ బోవుటలంపు తలంగును. ఆహా! ద్రవ్యమా! నీశక్తి కేమని చెప్పుదు? కొందఱ పేదవారుగఁ జేసితివి. వారు నిన్ను బలువిధంబుల గొనియాడినను వారినిదయతోఁ జూడవేల? వారు నీకేమి దొసగుచేసిరి. వారివేడికోలు నీకుదృష్టికేదో? పేదవాండ్రను బెక్కుకీడులకుఁ దగిలించి హింసచేయుచున్నారు. పేదవాండ్రు సుఖదుఃఖంబులు పాటింపకున్నారు. పేదవాండ్రకు నొకయిక్కట్టు కల్గినపుడు వారిపాట్లు కన్నులారంజూచియు సాయంబుసేయక దయావిహీనులై వారలను మఱింత దండింతురుగాని అయ్యో! వీరికింతకష్టము వచ్చినదని యించుకేనితలంపరు. మరియు దారిద్ర్యంబునలన-నీదయలేనికతన-సేవకావృత్తి చేసినను యాచనావృత్తికిఁ దొడంగినను వారి పెండుకుఁ బ్రయోజనములేనివారిరలె కడకుఁ బుచ్చినవక్కలో నీడులేనట్లు చేయించుచున్నావు. నీకండలను సమభావంబునఁ జూడకుండుటేల? ఇఁకఁ బేదవాండ్రు నిన్ను నిందింపరే? నీవు కొందఱకు వలకడుపుకూడు నొసంగుచున్నావు. కొందఱకు నొకపూటకేని యిడక యున్నావు. పేదవాండ్రిట్లుదిక్కుపాట్లుపడుచున్నారని నీకించుకేని విచారముగలదే? వారికేమి సేయుదురు?"

—ఆలూరు వాసుదేవయ్య.

క. మృతిజెందిన జనునైనను
హితులెల్లను డాయుదురు మహీస్థలిలోనన్
మతిఁదలఁపఁ బేదఁజేరరు
బతిమాలినైన సఖులు బంధులు నెపుడున్.

—దూబగుంట నారాయణకవి.

సీ. కులమహీరుహ మహాక్రూరకుఠారంబు
కోపాగ్నివృద్ధికృద్ఘోరవాడి
సంసారసుఖశైలశతకోటిపతనంబు
దేహవ్యథాలతాదోహదంబు
ప్రతిభాంబుహృద్గ్రీష్మపవనంబు...
......అతిభాగ్యధర్మకషము

గీ. సంతతాహారిసంపాదిసంభ్రమప్ర
యత్నవిఘ్నదమతిసుఖప్రాప్తిదాయి
యమితలఘుతాశ్రయస్థానమైకడంగు
భూరిదారిద్ర్యదోషంబు పొదలెనపుడు.

—అయ్యలరాజు నారాయణకవి.

సీ. రూపింప నిర్మలరూపంబు లెడలించు
రక్తమాంసముల భారములడంచు
మనో్యగములకునై యూహఁజేరఁగనీదు
మగలకింతులకును జగలుసేయు
బహుళంబులైన లోభంబు లుత్పాదించు
సూనృతవాక్యంబుఁ జూఱపుచ్చుఁ
జాలదురాశావిచారంబుఁ గల్పించు
మానంబు చెడ బతిమాలిపించు

గీ. వసుధ నానందవనమున కగ్నికీల
యతిశయాక్రాంతచింతా విహారణభూమి
భూరిదుఃఖములకు నెల్లఁ బుట్టినిల్లు
ప్రజలకును లేమికంటెఁ బాపంబుగలదె?

—ఘట్టుప్రభువు.

మ. బలవద్దైన్యము వక్త్రగ
హ్వరముగాఁ బల్లేప్పట్లఁగొన్నట్టి య
ప్పులు మైచాలులుగాఁగ బా
లరుదితంబుల్ క్రొమ్మగుటల్గాఁగ దు
ర్నిలయారణ్యములో భయ
ప్రకరమూర్తి క్రూరమైయుండఁగాఁ
దలచే నెల్వఁడఁజేయు లావు
కలిమిన్ దారిద్ర్యశార్దూలమున్.

—మంచనమహాకవి.

# జ్యేష్ఠప్రకృతి

వారి రాధాకృష్ణమూర్తిగారు

తరుణవైశాఖరమకు సోదరివటంచు
యుక్తిసాధించి నిన్నని యోసరించు
గాక లోకమ్ము నీవు నిక్కముగ సౌఖ్య
సంపదలకిక్కవగుట నిస్సంశయమ్ము.

నిజముపేదయైనను నిత్యమ్ము పగటివే
ళను జాము పొద్దెక్కఁబనికివోక
మృష్టాన్నములను సంతుష్టితో భుజియించి
మాటామటకుఁజాల మనసుపడెడి
ఇల్లాలితో నేమొ యింపుగాఁబలుకుచు
బిడ్డలనెంతయుఁ బ్రియముతోడ
లాలించుచును దా విలాసమ్ముగా జాము
పొద్దువేళనెకాని గద్దెదిగకు
జ్యేష్ఠమాసమ్మ! యిట్టివి క్షేమసుఖము
గలుగునే యెందునైన నీవలనఁగాక
ఒక్కగతి భూమిపులు పేద లుల్లసిల్ల
సంచరిలెదెట్టిమాసరాజంబవీవో?

ప్రమదమెలర్పఁగర్షకుఁడు పంటవలంతిని బూజసేయ స
న్నమతను రోహిణేయుని సమస్యల బ్రీతునొనర్చి లాంగలం
బమర వృషోరుకంఠముల నాదటనేగెడి యేరువాకపు
న్నమ, యదియెంతచక్కనిదినంబె భవద్హృదయాంతరంబునన్.

వనితలకునెల్ల చక్కని
వినయనయంబులనుగఱపు విశ్రుతగుణయా
వనిత సావిత్రి బొగడెడి
ఘనముల్ వ్రతదినములెందుగలుగగనేర్చున్.

ఊరక నిన్నుగూర్చి చవులూరగఁబల్కుటకాదు లోకమున్
నీరమణీయభావమును నిర్మలవృత్తినెఱుంగు గానిచో
ధీరపతిన్ వనాంతరము దిద్దగఁబోవగనేల? రక్షణో
దారత గోగణంబులకు త్రాఘులనూడ్చగనేల? మాసమా!